

సంపుటము 24
సంచిక 3

# భారతి

మార్చి, 1947
వ్యయ, ఫాల్గునము



## భావలహరి

*

= శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి =

నా నిరుపేదవాకిట వినంబడె చల్లని పేకువన్ శుభ
స్వానము; ఏ శిరీషసుమపాదమృదుక్రమమంద్రనాదమో—
వీనుల సోకినంత కనువేదురునన్ పరువెత్తి చూడ నీ
దీనుని కంటిజంట గురుతింపదు శ్రీచరణాంక మొక్కటేన్.

ఔనులే నీ గళానూనసూనావళి పరిమళమ్ముల గాలి పొరల నించె
తెలిసెలేనయ్యా నీ దివ్యమంగళమూర్తి తొణకించె నిచట మాధుర్య మేదో ?
కనుపట్టినది లెమ్ము కరుణామృతపు జల్లు కురియించు నీ కనుగొనల చలువ
దొరకిపోయినదిలే తొలిసంజచాయ నీ స్నిగ్ధాధరపు పాలచినుకు నవ్వు
ఎంత తెరచాటులో నలయించి నన్ను - త్రిప్పజూచిన, నీమూర్తి తీయదనము
నిండిపోయిన సృష్టి నా నేత్రయుగళి - కప్పగలదయ్యా ? రమ్ము సాగంగనేల ?

వ్యోమజూటమ్ములో నుడురాజరేఖయో శిఖిపింఛరత్నరోచిర్విభవమ్మొ ?
మేనిమానిక పూచు మెలగు శ్రీదేవియో పర్వతరాజుగర్భమ్ముఫలమొ ?
మొలలోని వెలలేని పులికళాసపు సొబగో రమణీయ పీతాంబరమ్ము హొయలో ?
కరమున మురళికా గానస్రవంతులో డమరు ప్రచండ తాండవరవమ్మొ ?

కాద్రవేయగ్రైవేయమో కంఠసీమ? - దివ్యతులసీలలంతికాధీనరుచియొ ?
మెఱుఁగుగా కనుమొఱఁగుగా తరలిపోయె - ఏది యింకొకసారి కాన్పింపు తండ్రి!

శిలువయో చిలువయో గళసీమలోగాని కరుణామృతము కంట దొరలిపాఱు
కాషాయవసనమ్మొ కనకచేలమొగాని పతితమస్తము తాకు వరదకరము
నెలరేకగురుతో మిన్నులవాక ఫణితియో నడియెడాఱుల జీవనమ్ము నింపు
స్రుక్స్రువద్వితయమో సుఖవేణునాళిమో మఱిగి మాయెద త్యాగమధువు కురియు
ప్రాణి యూర్చిన చోట నేర్పడగ నిలిచి - బుద్ధికదలిన బాట నెవ్వఁడును పోలిచి
కలుగు మతపక్షపాతబుద్ధులకు నవ్వి - విశ్వమయరూపమై వెల్గు వెలుఁగు దలఁతు.

భావములోని చీఁకటులు పాయవు ; నైగమమోక్షశాస్త్ర వి
ద్యావిధి, తర్కకర్కశవిధాపరిణద్ధము, మౌనయాత్రులై
పోవుదురయ్య సన్మునులు ముట్టరు మూఢుల, నైననేమి నీ
మోవిని నిల్చు లేనగవు ముక్తిపథాగతకోటిచంద్రికల్.



# పారాశర్యవ్యాసుని వేదవిభాగ విధానము



= శ్రీ పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి =

వేదవ్యాసశబ్దమునకు వేదములను విస్తరింపజేసినవాడు అను నిర్వచనము మహాభారతమున గలదు. *

వేదములను విస్తరింపజేయుట యనగా వేదములలో జెప్పబడిన యజ్ఞాదికర్మములకు సంబంధించిన "విధ్యర్థవాదమంత్రా"దులను విస్తరింప జేయుట యే. నాల్గువేదములును యజ్ఞములను ప్రవర్తింపజేయు "హోతృ, అధ్వర్యు, ఉద్గాతృ, బ్రహ్మత్వ"ములకు సంబంధించిన యంశములు కలవైయున్నవి.

అందు ఋగ్వేదభాగము హోత యను ఋత్విక్కుయొక్క కార్యములకును, యజుర్వేదము అధ్వర్యుని క్రియలకును, సామవేదము ఉద్గాతయొక్క గాన క్రియలకును, అథర్వవేదము బ్రహ్మ అను ఋత్విక్కుయొక్క క్రియలకును అనుకూలు విధ్యర్థవాదమంత్రములు కలవైయున్నవి. కేవలము యజ్ఞక్రియలకే గాక వివాహాదిగృహ్యకర్మములకు సంబంధించినవియు, ఆముష్మికధర్మాచరణమున కనువగునవియు విధ్యర్థవాదాదులు ప్రతివేదముయొక్క సంహితాబ్రాహ్మణోపనిషత్తులలో నింపుగా నాయాయుగములయందు మహర్షులు విస్తరింపజేసియున్నారు. వారినే వేదవ్యాసులు అనిరి.

మఱియు నా వేదవ్యాసులేకాక భిన్నశాఖాప్రవర్తకులు, మంత్రద్రష్టలు, కాండర్షులు మొదలగు ప్రత్యేక భాగస్వాములును వేదములకు సంబంధించిన మహామునులున్నారు.

మహర్షులు వేదములలో బొందుపఱచిన విధ్యర్థవాదాదులలో భిన్నభిన్నరూపములు కలవు. వానిని పూర్వమీమాంసాశాస్త్రము వివరించియున్నది.

సాధారణముగా సంహితాబ్రాహ్మణములలో ఐహికఫలప్రాప్తికై చేయు యజ్ఞవిశేషాంశములే యుండును. ఎట్లనగా ఐశ్వర్యకాముడు 'వాయవ్య' సంజ్ఞగల శ్వేతపశువుచేతను, పశుకాముడు 'చిత్రి' సంజ్ఞగల పశువుచేతను, క్షేత్రకాముడు సితిపృష్ఠసంజ్ఞగల పశువుచేతను జన్నములను చేయవలయును. ఇట్టివిధులు, ఆవిధులకు సంబంధించిన గాథలు (వీనినే అర్థవాదములందురు.) పెక్కులుండును.

అర్థవాదములలో ఆయావిధుల ననుసరించి కర్మముల నొనరించి ఫలము నొందుట, వ్యతిరేకముగా నొనరించి దుష్ఫలము నొందుట మొదలగు వివర్ణనములు చెప్పబడును.

ఇందులకు కొన్ని యుదాహరణములు:—

మంత్రస్వరమును సరిగా నుచ్చరింపక హోమమొనర్చుటచే "త్వష్ట" అను మునికి అల్పాయుర్దాయము గలిగి ఉద్దిష్టఫలము నందింపలేని వృత్రాసురుడు జన్మించెననుటకు "విశ్వరూపుని" అర్థవాదము చెప్పబడెను. "సోమాహరణము"అను విధిని బలపరచుటకై "కద్రూ సౌపర్ణి"గాథ చెప్పబడెను. యజ్ఞదీక్షారంభమున యజమాను డొనర్చుకొను 'క్షురకర్మ'కు దేవాసురగాథ ప్రవచింపబడెను. విద్యాభ్యాస మెట్లు పూర్తియగునో దానినిగూర్చి "భారద్వాజుని"గాథయు, ఎట్టితపస్సు మోక్షహేతు వనుటకు "భృగువరుణసంవాదము" మొద

* "వివ్యాస వేదాన్ యస్మాత్ స వేదవ్యాస ఇతి స్మృతః" (ఆది. ౬3 అధ్యా.)

లగు నర్థవాదవిశేషములు కృష్ణయజుర్వేదశాఖయగు తైత్తిరీయసంహితాబ్రాహ్మణోపనిషదారణ్యకములలో చిన్నచిన్నవి ఏబది యున్నవి. ఇట్లే ఋగ్వేదమున క్షత్రియుడు హోతగా నుండవచ్చు ననుటకు "దేవాపి శంతనుల" గాథయు, రాజసూయమున క్షత్రియపశువు లభింపకుండిన బ్రాహ్మణపశువు, అదియు దొరకకున్న రాజసంజ్ఞకలది గాన "సోమలతాఖండనము"గల "అంజస్సవకర్మయు" కల "శునశ్శేపు" గాథయు, క్షత్రియునకు సోమపానార్హత లేదనుటకు "శ్యావపర్ణ" "మార్గవేయరాముల" గాథయు, ఇంక నెన్నియో చెప్పబడెను. *

అథర్వవేదమునను రాజు యజ్ఞము జూడవచ్చినప్పుడు యజ్ఞ మొనర్చువారు "బ్రాహ్మణాచ్ఛంసి"అను ఋత్విక్కుచే జేయింపబడు క్రియలకు సంబంధించిన "పరీక్షిత్తు" "కౌరవుల" గాథయు, పశువైద్యమునకు "అత్రి, జమదగ్న్యాదుల" శోధనాంశములు, రాజు సుపరిపాలన మొనర్చుటగూర్చియు, రాజు సింహాసన మెక్కునపుడు అధ్వర్యులొనర్చు స్తుతిరూపకగాథ మొదలగునవి యెన్నియో యున్నవి. †

నేను చదివిన సామవేదశాఖలగు "కౌథుమ, జైమిని" సంహితలలో పెక్కు మంత్రములు ఋగ్వేద మంత్రములుగానే యున్నవి. కాన ఋగ్వేదగాథలే సామసంహితాగాథ లనవచ్చును. కాని సామవేద బ్రాహ్మణములగు, "తాండ్య, ఛాందోగ్య, జైమిని" బ్రాహ్మణములలో ఔద్గాత్రమునకు సంబంధించిన యర్థవాదములు విశేషముగా నున్నవి. అందు ఛాందోగ్యమున "కుక్కలు వరుసగ వచ్చి, మొదల నాకసముపై కెత్తి హింకార మొనర్చిన వర్షము కురియు"నను గాథయు, తాండ్యమున మహావ్రతమొనర్చు యజమాని అగ్గురు భార్యలు కలవాడై, లేక వేశ్యలు కలవాడై గాన మొనర్చుట, "ఉద్గాత" ఉయ్యాల నూగుచు గాన మొనర్చు నంశము మొదలగునవియు, జైమినిబ్రాహ్మణమున అన్నము వండుకొనునపుడు, ఎసరులో బియ్యము పోయునపుడు వండువాడు కొన్ని గింజలనైన పొయ్యిలోని అగ్నియందు వేయకపోయినచో భుజించువారు పైజన్మములో బియ్యపుగింజలుగాను, వండబడు గింజలు భోక్తలుగాను మరల జన్మింతు రను గాథయు నింపుగ వర్ణింపబడియున్నవి. ఇట్టివే కొన్ని సోమగ్రహణాది గాథలు "కపిష్ఠలకఠ, కాణ్వసంహిత"లలోను జైమిని, శతపథాది బ్రాహ్మణములలోను కొన్ని మార్పులతో ప్రోక్తములై యున్నవి.

పై వేదగాథలన్నియు భారతరామాయణములలో జెప్పబడు నొక్కొక్క సాధారణకథకంటె హెచ్చయినవి కావు.

ఇట్లుండ, సామవేదద్రష్టలలో నొకడును, తపోమహిమముచే "వాల్మీకి" అను బిరుదము నొందినవాడు నగు "ప్రాచేతసమహర్షి" హతాన్విద్ధమగు "నిషాదక్రౌంచపక్షి" వృత్తాంతమును గాంచి నిషాదుని తిట్టుచు "వైదికానుష్టుప్ఛందస్సు"నందు కొంత మార్పుతో నుచ్చరించి ఆమాదిరిగా పిమ్మట నారదోపదిష్టమగు రామకథను రామాయణముగా నొనర్చి ‡ తరువాత దానిని రాముని అశ్వమేధకాలముననే రాముని పుత్రులును, వాల్మీకిచే కుశీలవులుగాను, వైణికులుగాను శిక్షితులైన కుశలవులచే వీణలపై పాడించెను. అది రాముడు రావణుని జయించి పట్టాభిషిక్తుడయ్యె ననుకథతో పూర్తిగాక "గర్భవతియగు సీతా మహాదేవిని" శ్రీరాముడు గంగాతీరారణ్యములలో విడిచి

---

* శాకల్యసంహిత, ఐతరేయబ్రాహ్మణములలో పైయర్థవాదములు కలవు.

† శౌనకసంహిత.

‡ వైదికవాఙ్మయమున గల 'అనుష్టుప్' గురులఘునియమము, లేక అష్టాక్షరపదఘటితపాదచతుష్టయమేయని "పింగళఛందసు"న గలదు. లౌకికచ్ఛందమున గల యనుష్టుప్ ప్రతిపాదమునందును ఐదవ యక్షరమును, ద్వితీయచతుర్థపాదములలో సప్తమాక్షరములును లఘువులుగా నుండవలయునను నియమ ముండుటచే గానము చేయునపుడు లయ వేయుటకును, వీణపై వాయించుటకును వీలుగా నుండును.

పెట్టెను* అను కథవరకు నుండుటచే దానిని "జయము" అను సంజ్ఞగల గ్రంథముగా తరువాత నుండిన (వాల్మీకికి) మహర్షులు తలపరైరి.

మఱియు యజ్ఞకర్మములలో సవనాదుల విరమణకాలములయందు జెప్పబడు పూర్వోక్తములగు అర్థవాదములవలె, నొకఫలమును (సీతావియోగకథ) సూచింపబడకపోవుటచేతను, గానరూపకమగు నర్థవాదము యజ్ఞక్రియలయందు విహితము కాకపోవుటచేతను రామాయణమును యజ్ఞక్రియలలో బ్రాచీను లుపయోగించినట్లు కాన్పింపదు.

కాని పవిత్రమగు సీతారాముల కథ గాయత్రీ మహామంత్రాక్షరఘటిత మొనర్చి గేయమేగాక పాఠ్యముగాను, పిమ్మట వివిధవృత్తాదులతోను, వివిధగాథలతోను గూర్పబడుటచే రామాయణము మహాభారతముతో సమానప్రతిపత్తిని, కొన్నియెడల నంతకంటె హెచ్చుగు గౌరవమునే పొందియున్నది.

## వ్యాసుని వేదవిభాగవిధానము

కృష్ణద్వైపాయనుడు వాల్మీకివలె సామవేద ప్రోక్తకాక సామవేదప్రవర్తకుడుగా (సామవేదమును ప్రచారము చేయువాడు), తాండ్యబ్రాహ్మణమునను, విద్యుత్పరిశోధకుడుగా (విద్యుత్తువలన గలుగు ఫలము చెప్పువాడు) తైత్తిరీయారణ్యకమునను చెప్పబడియున్నాడు. ఇట్టి వ్యాసమహర్షి వేదములలో నాయా వైదికకర్మములకు సంబంధించిన అర్థవాదరూపకములను నితిహాసముల జూచి అన్నియజ్ఞములలోను నుత్కృష్టమై, బహుదినములు చేయబడు అశ్వమేధయజ్ఞమునందుపయోగింపదగిన పెద్దదగు నితిహాసము చేసెను. ఇతిహాసము గేయముగా నుండరాదుగాన రామాయణేతిహాసము వైదికకర్మప్రయుక్తముగా నుండలేదు.† అశ్వమేధము మహారాజు మరియొక రాష్ట్రము నాక్రమించినతరువాత చేయబడి అన్యరాష్ట్రాక్రమణ ప్రోత్సాహకార్థవాదయుక్తముగా నుండవలయును. రామకథగల వాల్మీకియొక్క రామాయణము సీతావియోగాంతకథగా చెప్పబడెను. అందువల్ల వ్యాసమహర్షి తాను స్వయముగా నడిపించిన స్వపౌత్రులగు పాండవు లన్యరాష్ట్రముల నాక్రమించి జయముగొన్న కథను ‡ (పాంచాలదేశములుకూడ యుద్ధానంతరము పాండవు లాక్రమించినట్లున్నది.) జయము అను నితిహాసముగా రచించెను. అది వ్యాసమహర్షి యుద్ధానంతరము పాండవులు స్వకర్మమును నిర్వహించుకొనుచు ౨౪౦౦౦ శ్లోకములుగా రచించెనని మహాభారతముయొక్క ఆదిపర్వదియందు చెప్పబడెను. మఱియు భీష్మపర్వాదియందు వ్యాసమహర్షి ధృతరాష్ట్రునితో రాబోవు మహోపద్రవముల జెప్పి నీపుత్రులయొక్కయు, పాండవులయొక్కయు గాథలు శాశ్వతముగా నుండునట్లు చేయుదునని చెప్పుటకూడ జయేతిహాసముచేతను సూచనయేగదా.

---

* భవభూతిమహాకవి తన యుత్తరరామచరిత్ర నాటకమున "కుశుని" పాత్రచే వాల్మీకిరామాయణమును సీతను శ్రీరాముడు అరణ్యమున విడుచువరకే రచించెను అని చెప్పించినాడు.

† రామాయణము తొలుత 'ననుష్టుప్' శ్లోకరూపకమున నిపుడుండినరీతి నుండక చిన్నదిగా నుండెననుటకు బాలకాండాదియందు గల కథానుక్రమణిక వలన తెలియనగును. అనుక్రమణికలో గల యంశములకంటె నిపు డెంతయో భిన్నముగా నున్నది; విశేషముగా బెరిగినవి. ఉదాహరణమునకు స్వల్పముగా జూపెదను. బాలకాండ పదునాల్గవసర్గ మహాభారతములోని అశ్వమేధపర్వమునందలి ధర్మజాశ్వమేధవర్ణనము లే. అయోధ్యాకాండలోని ౧౦౦ వ సర్గ (కచ్చిత్సర్గ) భారతముసభాపర్వములోని ౫ వ అధ్యాయమే. ఇందలి భారత అను శబ్దము రామాయణమున "రాఘవ" మైనది. అట్లే సుందరకాండ ౧౫ వ సర్గలోని సీతావర్ణనము అరణ్యపర్వములోని దమయంతీవర్ణనమే. "భైమీ"శబ్దమునకు "సీతా"శబ్దము కూర్పబడెను.

‡ యోరాష్ట్రం క్రామతి సో అశ్వమేధేన యజతే—తై. సం.

"ఏమవఃకురవ ఏష వః పాంచాలా అయం రాజా" ఇతి కాణ్వసంహితా.

వ్యాసమహర్షి వాల్మీకివలె గేయముగా జేయక వేదేతిహాసములవలె పాఠ్యముగా చేయుటయు, విషాదాంతమగు (సీతావియోగము) గాథగాగాక పాండవులు విజయము నొందిరి అను స్త్రీపర్వాంతకథతో తన జయేతిహాసమును * ముగించుటయు అశ్వమేధ యాగదినములను అన్నిదినాలలోను యజ్ఞకర్మల విరమణ కాలమున జెప్పదగిన విస్తృతమగు నొక యితిహాసముగా జేసెను.

ఈ జయమను నితిహాసమును వ్యాసమహర్షి వాల్మీకి కుశలవులను కుశలవులచే బాడించినట్లుకాక తనకడ వేదాభ్యాసముచేయు "సుమంత, జైమిని, పైల, వైశంపాయన, శుకులు" అను నైదుగురు శిష్యులకుగూడ వేదమువలెనే చెప్పగా ఇది యితిహాసముగుటచే నందరి గాథలను వ్యక్తపరచి లోకమున నావైశంపాయనాదులు వెల్లడిచేసిరి.

మహాభారతయుద్ధానంతరము ఇంచుమించు నూటఏబదేండ్లకు పాండవప్రపౌత్రుడగు జనమేజయుడు తక్షశిలారాజ్యమును జయించి సర్పయాగము నర్పించి పిమ్మట † అశ్వమేధయాగము చేయుట కుద్యమించు కాలమున వ్యాసశిష్యుడగు వైశంపాయనమహర్షి వ్యాసులవారి యానతిచే జయేతిహాసమును జనమేజయ మహారాజునకు చెప్పెను. ఆ యితిహాసమును జనమేజయుడు వినుచు నందలి సందేహములను వైశంపాయను నడుగుచుండెగా, వైశంపాయను డిచ్చు ప్రశ్నోత్తరములచే జయము పెరిగి యిరువదినాల్గువేల శ్లోకములు గల భారతమైనది. దీనినే 'అస్తీకు'ని కథ ప్రారంభమున గల భారత మనవలయును. ఈ భారతభాగము వైశంపాయనుడు జనమేజయుని సంబోధించు 'భారత' అను శబ్దముతో విశేషముగా ప్రస్ఫుటమగుచుండును.

ఆ వైశంపాయనభారతమును సౌతి (వ్యాసుని శిష్యుని పుత్రుడు) విని కొంతకాలమునకు నైమిశారణ్యమున శౌనకాదులు చేయు దీర్ఘసత్రమునకు వచ్చి వైశంపాయనోదిత భారతమును జెప్పుచు వారి ప్రశ్నలకు విరళముగా ప్రశ్నోత్తరముల నొసగుటలో ఇరువది నాల్గువేల భారతము లక్షశ్లోకములు గల మహాభారతమైనది.

ఆ మహాభారతముననే ధర్మశాస్త్ర, అర్థశాస్త్ర, మోక్షశాస్త్ర, పురాణ, కావ్యముల యంశములు బాహుళ్యముగా నిమిడియున్నవి. పై ధర్మశాస్త్రాద్యంశములను భారతగాథలలో నింపుగ నిమిడ్చిన సౌతిప్రతిభ యద్వితీయమైనది.

తొలుత వేదేతిహాసముగా వ్యాసమహర్షి యుద్దేశించి చెప్పిన జయము అను నితిహాసమందు బహువిధములగు ధర్మశాస్త్రాద్యంశములు 'సౌతి' కాలమున గూర్పబడుటచే నది పంచమవేదముగా గాలాంతరమున పరిగణింపబడినది. ఆపస్తంబమహర్షి కాలమునకు (క్రీ. పూ. ౭ వ శతాబ్దము) ఇతిహాసము అను గ్రంథము వేఱుగ గలదని అతని ధర్మసూత్రములలో నొకటి రెండుస్థలములలో ఆపస్తంబుడు చెప్పియున్నాడు. దానిని భారతముగానే "హరదత్తుడు" (ఉజ్జ్వలాభాష్యకర్త) గ్రహించుట జయేతిహాసముగానే తలపనగును. ఆశ్వలాయనమహర్షి (క్రీ. పూ. ౮) తన గృహ్యసూత్రములలో (బ్రహ్మయజ్ఞవిధానమున) 'భారత, మహాభారతధర్మాచార్యులు' అని వైశంపాయనాదివ్యక్తులను చెప్పియున్నాడు. కాన అప్పటికి జయము భారతాంతర్గతమైయుండును.

---

* వ్యాసకృతజయేతిహాసము ఆదిపర్వమున గల 'ఉపరిచరు'ని కథతో ప్రారంభమై, స్త్రీపర్వాంతముతో ముగిసినట్లు ఆదిపర్వము ౬౨ అధ్యాయములోని అనుక్రమణికవల్లను, స్త్రీపర్వాంతమున గల ఫలశ్రుతి వల్లను తెలియనగుచున్నది.

† యజ్ఞములలో చెప్పబడు ఇతిహాసములకు మారురూపుగానే పురాణోదితయజ్ఞములగు వ్రతముల లోను వ్రతవిరమణకాలములలో కథలు చెప్పబడును. యజ్ఞములలో నితిహాసముల చెప్పు హోత మొదలగు వారికి విశేషదక్షిణలను యజమాను డిచ్చినటులనే వ్రతకల్పమును, కథను జెప్పువానికి వ్రతముచేయువారు విశేషదక్షిణ నీయవలయుగదా.

పై యాశ్వలాయనుని వాక్యమును బురస్కరించుకొనియే, కొందరు విమర్శకులు నేటి మహాభారతము క్రీ. పూ. మూడవ శతాబ్దమున కేర్పడినదని వ్రాసియున్నారు. (సౌతి క్రీ. పూ. 3 వ శతాబ్దివాడని సప్రేపండితుని తలంపు.)

తొలుత జయేతిహాసము బహుదిన ప్రవర్తకమును, యజమానుని యన్యరాష్ట్రాక్రమణవిజయముతో బూర్తియగు అశ్వమేధయాగముకొర కుద్దేశించి వ్యాసమహర్షి దానిని తొలుత తన శిష్యుడగు వైశంపాయనునిచే జనమేజయుని సర్పయాగాంతమున తక్షశిలారాజ్యాక్రమణకు పిమ్మట (సర్పయాగము అశ్వమేధయాగమునకు బూర్వకాలికమగు యజ్ఞముగా నొక సామవేదబ్రాహ్మణమున గలదు) ప్రవచింపజేసియున్నాడు. వ్యాసమహర్షి జయేతిహాసమును జెప్పకముందు సవనవిరమణకాలములలో హోత ప్రశ్నింపగా బ్రహ్మ యుత్తరము జెప్పునట్టి చిన్నచిన్న వేదగాథ లుండెడివి. * పై జయేతిహాస ప్రోక్తయగుటచేతనే పారాశర్యవ్యాసుడు వేదవిభాగకర్త యైనాడు.

ఆ జయేతిహాసమును వైశంపాయనసౌతులు భిన్నభిన్నాంశములు గూర్చుటచేతనే జయేతిహాసము భారతముగాను, మహాభారతముగాను, పంచమవేదముగాను ప్రాచీనులు పరిగణించిరి. ఇదియే వ్యాసమహర్షి చేసిన వేదవిభాగము. విభాగ మనగా వేరుగచేయుట. అనగా వేదముకాక వేరుగ చేయబడిన గ్రంథము వేదవిభాగము అగుటచే వేదమునకు సంబంధించి వేరుగ చేయబడినది. వేదములు సేతిహాసములు. అనగా ఇతిహాసములతో గూడినవి. ఇది వేరుగ చేయబడిన యితిహాసము. జయమునకు పూర్వము మరియొక వేరుగ చేయబడిన యితిహాసము లేదు. ఇదియే వ్యాసమహర్షి చేసిన వేదవిభాగము.

* హోత యడిగెడి ప్రశ్నములు యక్షప్రశ్నములుగాను, బ్రహ్మ చెప్పెడి సదుత్తరములు ధర్మరాజుని ప్రత్యుత్తరములుగాను మహాభారతారణ్యపర్వమున జేర్చబడినవి. ఈయక్షప్రశ్నములకు మూలము తైత్తిరీయసంహితలో గలదు.



# తార్కిక ప్రకృతి

✵

= శ్రీ కె. అన్నమరాజశర్మ =

శారదాకాశమున మనోజ్ఞత వెలార్చి
మొలకనవ్వులఁ గాసారముకురమందు
అందముల దిద్దుకొనియెడు చందమామ
కఱుపుమసి మచ్చ నేటికో కడిగికొనఁడు?

రాగపులకితసురభిళారణ్యవాటిఁ
గలరవంబున శ్రోతల కైపుసేయు
కోకిలాంగన నిజమంజుకూజితముల
మాని హేమంతమున మౌన మూననేల?

ఉదయరాగిణిపై మోహ ముట్టిపడఁగఁ
గనకకరపాళి కౌఁగిటఁ బెనచు తరణి
మత్సరపుయోగమునఁ బ్రియం దూలఁజేసి
మాటుపడు నేటికి మునిమాపువేళ?

చలిపున్ రేకుఁజీరలఁ గులికి, కులికి,
పసుపమెసలిన ఛదములఁ బరిహసించు
చివురుజొంపం బదేటికి శిశిరహతిని
మన్మథాస్త్రాలఁ బతనమై మ్రగ్గిపోవు?

శ్యామలవ్యోమసుస్నిగ్ధసైకతమున
శర్వరీశాంతి పాలించు సమయమందు,
తళతళల్ జిల్కు ఋక్షముక్తాచయంబు
ప్రత్యుషస్సుల నెవ్వాని పాలఁ బడునొ?

ప్రావృడంబుదపుత్రుండు ప్రతిభ మెఱయఁ
గేతకీపత్రపుటములఁ గీలుకొలుపు
అంబుకణచిత్రితంపు రహస్యలిపిని
సరసభావోదయస్ఫూర్తిఁ జదువునెవఁడు?

---

# సంస్కృతవ్యాకరణంలో ఉన్న విశేషాంశాలు



= శ్రీ గరికిపాటి కృష్ణమూర్తి =

శ్రీకుభాష అని ఒక భాషగా మొట్టమొదట ఏదీ లేదు. అనేక స్థానికభాషలు కలిసి గ్రీకుభాష అయినది. అలాగే ఇటాలిక్ భాషలలోనుంచి లాటిన్ భాష తయారయినది. ఈభాషలు రానురాను వృద్ధిపొంది కొంతకాలమునకు వ్రాయదగ్గ భాషలుగా అయినవి. ఇప్పటికీ సరియైన వ్యాకరణం గ్రీకుభాషకు లేదట. సంస్కృతంకూడా ఒకప్పుడు ఇండోయూరోపియన్ భాషలలోనిది అని చెప్పి తరువాత ఆభాష ఒక ప్రత్యేకత సంపాదించుకున్నది అని పాశ్చాత్య విజ్ఞులు సిద్ధాంతీకరించారు. 'చరతి' (వెళ్లుచున్నాడు) అనే క్రియ 'కరతి'అని అయిఉండాలట. అందులోని 'ఎ'కారాలు అన్నీ అకారాలు అయినవట. దీనికి కారణం గ్రీకులో Queliti అని, లాటిన్‌లో Colit అని ఉన్నదికాబట్టి అని చెప్తారు. 'ఎ'కారము ఉండటంవలన కకారము చకారమై 'ఎ' 'అ'గా మారి, 'చరతి' అయినదట. లాటిన్ గ్రీకుభాషలలో ఈవిధమైన మార్పులు జరిగినవికాబట్టి సంస్కృతంలోకూడా అలా మార్పు వచ్చిఉంటుంది అని వారి అభిప్రాయం. కకారము చకారమగుట చెప్పారు. కాని సంస్కృతంలో చకారము కకారమగుటకూడా కద్దు. ఈ మార్పు ఎలాగు సమర్థిస్తారో!

సంస్కృతం ఏనాడో ఇరానీభాషనుంచి విడిపోయి ఒక ప్రత్యేకమైన భాష అయినదట. వేదకాలంలో చక్కని భావప్రధానమైన కవిత్వం పుట్టినదట. తరువాత ఒక్కమాదిరిగా వచనం వ్రాయటానికి ఒక శైలి కల్పింపబడ్డది అని మేక్డనెల్‌గారు అంటారు. అంటే మొట్టమొదట వచనంకాని, మన రోజులలో మాదిరి వచనపద్యాలుకాని వ్రాయటం చేతకాక వేదకాలంలో ఋషులు పద్యాలే వ్రాసుకున్నారు. పాపం. ఈపద్యాలు రచించే నాటికి వాళ్లకు నోటితో చెప్పుకొనుటేగాని వ్రాయుట చేతగాదట.

## అపవాదులు

పూర్వులందరూ అనాగరికులు అని నమ్మితే ఈ వాదం తేలిగ్గా నమ్మవచ్చును. ఇదివరలో తెల్లవారే ఈ పరిశోధనలు చేయుటంవలన వారి భాషలకు సంస్కృతభాషను ముడిపెట్టటం తటస్థించినది. ఈ సిద్ధాంతముచేత సంస్కృతం ఒక అపభ్రష్టమైన భాషగా కనబడుతున్నది. ఒకప్పుడు గ్రీకుభాషనుచూచి సంస్కృతం ఫోర్జరీచేశారు అని ఒక పాశ్చాత్యవిజ్ఞుడు అన్నాడు. ఇదిగాక జెండవెస్టా వేదానికి పూర్వరూపమని, మెల్లిగా వేదం అందులోనుంచి బయలుదేరినదని, తత్వశాస్త్రం, ఖగోళశాస్త్రం గ్రీకులవలనా, గణితశాస్త్రం అరబ్బీలవలనా భారతీయులు నేర్చుకున్నారనీ వాదాలు ఉన్నాయి. జెండవెస్టానుంచి వేదం బయలుదేరింది అనటకు ఎంత ఆధారమున్నదో అంత ఆధారము వేదమునుంచి జెండవెస్టా వచ్చినది అనటకు ఉన్నది. కాని మొదట ఈ వాదం లోకంమీద తెల్లవారే వేశారుకాబట్టి అది కాదు అని ఋజువుచేసుకొనే భారం మనమీద ఉండి గిలగిలలాడుతున్నాము. అరబ్బీలనుండి వేదకాలంనాటి

బుషులు గడ్డాలూ మీసాలూ పెంచుకొనేటట్లు చేర్పు కొన్నారు అని ఒకవాడు లోకంమీద వేస్తే, అది నిజం కాదు అని ఎవరు బుజువుచెయ్యగలరు?

సంస్కృతశబ్దశాస్త్రంలో ఒక వైశిష్ట్యం ఉన్నదనీ, అది ఇతర భాషావ్యాకరణాలలో లేదనీ ఏలాగో వింటర్నిజ్ వగైరాలు ఒప్పుకున్నారు. వేదభాష ఒక స్థానికభాష అనీ, అది వైయాకరణులచే సంస్కరింపబడి మాఱిపోయి సంస్కృతమైనది అనీ మెక్డొనల్ అంటాడు. అయితే ఇతర భాషలకు వచ్చిన మార్పులోను, సంస్కృతానికి వచ్చిన మార్పులలోను ఒక భేదం ఉన్నది. గ్రీకు లాటిన్ భాషలు రానురాను కొత్త రూపాలు, ప్రయోగాలు కలిగి వృద్ధిపొందినవి. వేదభాష రాను రాను తగ్గి సంస్కృతభాష అయినది. సంస్కృతభాషలో ౨౦౦౦ ధాతువు లున్నవి. ఇప్పుడు ప్రయోగంలో ఏ ౪౦౦,౫౦౦ లో ఉన్నవి. 'లేట్'(Subjunctive) ప్రయోగం లోకంలో లేనే లేదు, వేదాలలో తప్ప. అర్థంకాని మాటలు పతంజలి కాలంలోనే చాలా ఉన్నవట. "బహవోహి శబ్దాయేషా మర్థా న విజ్ఞాయంతే!" జర్భరీ, తుర్ఫరీతు* అనే రెండు శబ్దాలు అర్థంకానివి పతంజలి ఉదాహరించాడు. కాబట్టి సంస్కృతభాషాప్రయోగ విషయము రానురాను తగ్గినది అని వెడ్డోనల్ పండితుడే ఒప్పుకుంటాడు. ఈ తగ్గటమే భాష వృద్ధిపొందటం అని చెప్పవలసి యున్నది.

లాటిన్ భాష గ్రీకుభాషనుంచి చాలావిషయం గ్రహించింది. గ్రీకుభాషలో శబ్దాలు, ద్వివచనము (ఇది ద్విత్వనిష్ఠమైన పేరులు, కాళ్లు వగైరా శబ్దాలలోనే) ధాతువులు, ధాతువులవలన నిష్పన్నమైన వాటి, ఒకమాదిరిగా కారకము ఉన్నది. సమాసాలు,

---

* జర్భరి అంటే భర్త; తుర్ఫరీతు అంటే హంతకుడు అని నిరుక్తంలో యాస్కుడు నిర్వచించాడు. ఈశబ్దాలు సర్వజనప్రసిద్ధములు కావు కాబట్టి, ప్రకృతిప్రత్యయవిభాగం చేసి చెప్పటానికి వీలుగాలేదు కాబట్టిన్నీ పతంజలి 'ఇవి అర్థమునట లేదు' అని చెప్పియుండవచ్చును అని నాగేశభట్టు అభిప్రాయం.

తద్ధితలు, యఙ్, సన్ వగైరా ప్రత్యయాలు లేవు. ఇవి సంస్కృతభాషలోనే ఉన్నవి. వీటి ప్రయోజనం సంక్షేపముగా రచించుటకు అవకాశము కలిగించటమే.

## సమాసాలు

సమాసమంటే సంక్షేపము అని అర్థము. వ్రాసేటప్పుడు సమస్తంగానూ వ్రాయవచ్చు, వ్యస్తంగానూ వ్రాయవచ్చు. కాని సమసించినప్పుడు కొన్ని నియమాలు పాటించాలి. 'సవిశేషాణాం వృత్తిర్న, వృత్తస్య విశేషణయోగో న'—సవిశేషణమైన శబ్దాలకు సమాసంరాదు; సమాసంలో ఉన్నవాటికి విశేషణం ఉండదు. 'రాజపురుషః' అని ఒకసమాసం. ధనికుడైన రాజుగారిమనిషి అని చెప్పవలసివస్తే 'సమృద్ధస్యరాజ్ఞః పురుషః'అని వ్యస్తంగానే ప్రయోగించాలికాని 'సమృద్ధస్య రాజపురుషః' అనకూడదు. 'రాజపురుష' అనే సమాసంలో ప్రధానమైనది రాజుగారి పురుషుడుగాని రాజుగారు కాదు. విశేషణ మేదైనా వేస్తే ఆ పురుషుడికి వర్తించాలి. 'రాజపురుషః సమృద్ధః'అని అనవచ్చును. 'సమృద్ధస్య రాజపురుషః' అన్నప్పుడు సమాసావయవమైన రాజశబ్దమును ఒక్కదానినే సమృద్ధశబ్దము సాపేక్షకముగా చూస్తున్నదికాబట్టి అక్కడ ఏకదేశాన్వయదోషం కలుగుతున్నది. ఇటువంటి తప్పులు పూర్వులూ చేశారు. 'దేవదత్తస్య గురుకులమ్'. కాని ఇక్కడ దేవదత్తగురుశబ్దాలు సాపేక్షకములైనప్పటికి దేవదత్తుడి గురువుగారి కులం(పాఠశాల)అని అర్థం గమకమౌతున్నదికాబట్టి ఇది తప్పుకాదన్నారు. అర్థం గమకమైనప్పుడే ఇటువంటివి పనికివస్తయి అన్నాడు భాష్యకారుడు.

ఖట్వారూఢః (మంచం ఎక్కినవాడు, అంటే పెళ్లిచేసుకొని)అని సమస్తంగా ప్రయోగిస్తే తిట్టౌతుంది. 'అధీత్య స్నాత్వా గురుభి రనుజ్ఞాతేన ఖట్వారోఢవ్యా'అని భాష్యం. వేదాధ్యయనము పూర్తి చేసి, సమావర్తనస్నాన మాచరించి గుర్వనుజ్ఞాతుడై గృహస్థాశ్రమము స్వీకరించాలి. చదువుపూర్తిచేసే ఓపిక లేకముందరే పెళ్లిచేసికొని మంచంఎక్కిన దుష్టుడిని ఖట్వారూఢుడు అనాలి. నిందావగమకం అయి

నప్పుడే సమాసం. చదువుకొనే కాలంలో మంచంమీద పడుకోకూడదు. కిందనే పడుకోవాలి. ఏదైనా జబ్బు చేసి మంచం ఎక్కితే 'ఖట్వా మారూఢః' అని వ్యస్తంగా ప్రయోగించాలి. అప్పుడు నింద లేదు.

'దాస్యాః పుత్రః' అని అలుక్ సమాసం చేసినప్పుడే నింద. దాసీపుత్రుడు కానివాడిని తిట్టదలచినప్పుడు 'దాస్యాః పుత్రః' అనాలి. వస్తుకథనమైతే 'దాసీపుత్రః' అంటేచాలు, వాడి స్వరూపము మనకు తెలుస్తుంది.

కొన్ని శబ్దాలు సమాసఘటితమయినప్పుడు ప్రథమావయవంగా ఉండాలి. 'ఇది దంతాలలో రాజు' (శ్రేష్ఠము) అని చెప్పినప్పుడు రాజశబ్దము ప్రథమావయవముగా వచ్చి 'రాజదంతం' అని సమాసం వస్తుంది. కొన్ని అటూ ఇటూకూడా వాడవచ్చును. ఆహితాగ్ని అనీ అనవచ్చును; అగ్న్యాహితుడు అనీ అనవచ్చును. కొన్ని సమాసాలు పాణిని నిపతిస్తాడు. ప్రక్రియకు భిన్నంగా సిద్ధమైనరూపము చెప్పటమే నిపాతము. 'వ్యంసకుడు (ధూర్తుడు) ఈ ఛాత్రుడు' అని చెప్పాలంటే 'ఛాత్రవ్యంసకః' అని అనాలి. రెండు పదాలు కలిస్తే సమాసం. రెండుపదాలు పైగా ఉంటే ద్వంద్వ సమాసంగాని, బహువ్రీహిగాని ఔతుంది. ప్రాచీన సంప్రదాయములో నాలుగురకాల సమాసాలు ఉన్నై: ౧. పూర్వపదార్థప్రధానము-అవ్యయీభావము. 'సతృణమ్ అత్తి' గడ్డితోసహా తింటున్నాడు అని అర్థం. ఇక్కడ గడ్డిమేయటంలో తాత్పర్యం లేదు. ఏమీ విడిచిపెట్టకుండా సాకల్యంగా తిన్నప్పుడు 'సతృణమ్' అని అవ్యయీభావం వాడవచ్చును. ౨. ఉత్తరపదార్థప్రధానము—తత్పురుష. రాజపురుషః (ఇందులోనే కర్మధారయకూడా వస్తుంది) ౩. అన్యపదార్థప్రధానము—బహువ్రీహి. 'యువజానిః' పడుచుపెళ్లాంకలవాడు. ౪. ఉభయపదార్థప్రధానము—ద్వంద్వము. కాకోలూకమ్-కాకులు, గుడ్లగూబలు. ఈవిభాగం పతంజలిలో కనబడుతుంది. ఈ విభాగాలలోనికి రానివి కొన్ని సమాసాలు ఉండటంచేత నవీనవైయాకరణులు సమాసాలను ఆరురకాలుగా విభజించారు.

సమాసరచనలో ఉన్న ఇబ్బందులు చాలక దానికొక స్వరకల్పనకూడా చేశారు. 'త్రిమునివ్యాకరణమ్' అన్నప్పుడు 'త్రిముని' అనే సమాసం స్వరభేదంచేత అవ్యయీభావంగాని, బహువ్రీహిగాని చెయ్యవచ్చునట. 'స్థూలపృషతీ మనడ్వాహీ మాలభేత' అని యాజ్ఞికులు ఒక ఆవుని చంపమన్నారు. ఆ ఆవు 'స్థూలపృషతి' అయి ఉండాలి. ఇక్కడొక సందేహం. 'స్థూలాచాసౌ పృషతీ (బలిసినది, చిత్రవర్ణమైనది)' అని అర్థమా? లేక 'స్థూలాని పృషంతి యస్యాః సా' (పెద్దమచ్చలుగలది) అని అర్థమా? తొందరపడి ఆవుని చంపక, ముందర ఇక్కడ తత్పురుషస్వరమో బహువ్రీహిస్వరమో తెలుసుకోవాలి-యజ్ఞఫలం లభించాలి అంటే. దుష్టస్వరం వలన వచ్చే ప్రమాదం వేదంలో కనబడుతున్నది. "దుష్టః శబ్దః స్వరతో వర్ణతో వా, మిథ్యాప్రయుక్తో నతమర్థమాహ, స వాగ్వజ్రో యజమానం హినస్తి, యథేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్-" స్వరంచేత దుష్టమైన, వర్ణంచేత దుష్టమైన శబ్దము వృథాప్రయుక్తమై అనర్థకమైపోవడమే కాకుండా యజ్ఞం చేస్తున్న యజమానుడిని వజ్రమై హింసిస్తుంది. ఇంద్రశత్రువైన వృత్రుడు ఇంద్రహననంకోరి యజ్ఞం చేశాడు. 'ఇంద్రశత్రుర్వర్ధస్వ' అని ఏదో ఒకమంత్రం చదవటంలో స్వరం తప్పి, 'ఇంద్రుని శత్రుడా, వర్ధిల్లవలసినది' అని అర్థం రావటానికి బదులు, 'శత్రువైన ఇంద్రుడా, వర్ధిల్లవలసినది' అని అర్థంవచ్చి, అంతపనీ జరిగి, వృత్రుడు పాడైపోయాడు. యజ్ఞయాగాదులవలన కలిగే అదృష్టఫలం ఎట్లున్నా అవి ఇప్పుడు చెయ్యకుండా ఉండటకు తగినంత కారణం కనబడుతున్నది. ఇదేదో యజ్ఞంలో కలిగే బాధ. ఆహితాగ్నికి దినదినమూ గండము ఒకటి కల్పించారు. 'ఆహితాగ్ని రపశబ్దం ప్రయుజ్య ప్రాయశ్చిత్తీయాం సారస్వతీ మిష్టిం నిర్వపేత్'. ఆహితాగ్ని అపశబ్దం ప్రయోగించితే ప్రాయశ్చిత్తంగా సరస్వతీ సంబంధమైన ఇష్టి ఒకటి చేసుకోవాలి. ఈబాధలు పడలేక ఆహితాగ్ని అంతరించిపోతున్నాడు.

'చిత్రగుః' అనేది ఒక బహువ్రీహిసమాసం. చిత్రమైన ఆవులు కలవాడు అని దాని అర్థం. ఈఅర్థం సమాస

సంలో ఉన్న పదములనుంచి వచ్చినదా, లేక సమాసంలోని పదసముదాయంనుంచి ఒక శక్తి-సమాసశక్తి బయలుదేరి వచ్చినదా అని వైయాకరణులూ, నైయాయికులూ వివాదపడ్డారు. చిత్రశబ్దంలో కాని, గోశబ్దంలో కాని (గోశబ్దం సమాసంలో 'ఉ' అయినది) ఈ గోస్వామి కనబడుట లేదు కాబట్టి ఏకార్థీభావం ఒకటి సమాసశక్తివలన కల్పించి ఆ అర్థం చెప్పకోవాలి అన్నారు వైయాకరణులు. వ్యపేక్షావాదులు నైయాయికులు. సమాసంలోని పదములు స్వార్థపర్యవసాయులు అయినప్పటికి ఆకాంక్షాదివశంచేత పరస్పరాన్వయం కలిగి వ్యపేక్ష అనే సామర్థ్యం బయలుదేరింది. అప్పుడు సమాసానికి ఒక అర్థం కలుగుతున్నది అని చెప్పి, 'చిత్రగుః' అన్న ప్రయోగంలో చిత్రమైన గోవులను చెప్పే పదములనుంచి గోస్వామిని చెప్పే అర్థాన్ని లక్షణచేత నైయాయికులు సాధించారు.* ఈవిధంగా వీరిద్దరూ అర్థానికి బాధరాకుండా వాదం పెంచుకొన్నారు. సమాసంలో ఎన్ని పదాలు ఉన్నా అది ఒక పదం. సమాసంలో ఉన్న పదాలకు ఒక్కొక్కదానికి ఒక్కొక్క స్వరం ఉన్నా అవి అన్నీ పోయి ఒక్క సమాసస్వరమే ఉంటుంది. ఈ విధంగా సమాసానికి ఐకపద్యం, ఐకస్వర్యం వైయాకరణులు కల్పించారు. నిత్యసమాసాలు అని కొన్ని ఉన్నై. అవి వ్యస్తంగా వాడటానికి వీలులేదు. వాటికి విగ్రహం లేదు. సమాసంలోనే ఉండాలి. కృష్ణసర్పం అన్నప్పుడు ఆమాటను విడదీయకూడదు. ఒకనల్లని పాము అని కాదు దీని అర్థం. ఈసమాసం ఒక సర్పజాతిని తెలియజేస్తుంది.

## తద్ధితాలు

తద్ధితప్రకరణంకూడా సంస్కృతవ్యాకరణానికి వైశిష్ట్యపాదకము. ఇదికూడా సంక్షేపంగా మాట చెప్పటానికి ఉపకరిస్తుంది. 'గర్గః' అని ఒకడు. ఆయన అపత్యం (కొడుకు) గార్గిః; గోత్రాపత్యం (మనుమడు) గార్గ్యః. అయిదవతరం వాడు, వాడి తండ్రిగాని అన్నగాని బ్రతికిఉంటే యువసంజ్ఞ అని ఒకటి వచ్చి వాడు 'గార్గ్యాయణః' అని అనిపించుకొంటాడు. అపత్యార్థమందేకాక ఇంకా అనేకఅర్థాలలో తద్ధితప్రత్యయం వస్తుంది. 'కషాయపురంగు వేసిన బట్ట' అంటే 'కాషాయం వస్త్రం' అనాలి. వసిష్ఠుడు ఈ సామమంత్రం చూశాడు అంటే 'వాసిష్ఠం సామ'; ఈ మంత్రానికి పశుపతి దేవత అంటే 'పాశుపతో మంత్రః' అనాలి. జనసమూహం అనటానికి 'జనతా' అంటే చాలు. చక్షుస్సుచేత గ్రహించిన రూపం అంటే 'చాక్షుషం రూపం' అనాలి; కావ్యం యశస్సు కలిగిస్తుంది అన్నప్పుడు 'యశస్యం కావ్యం' అనాలి. నలుగురు మోసే వాహనాన్ని 'చాతురం వాహనమ్' అనాలి.

ఈవిధంగా అనేకఅర్థాలలో తద్ధితప్రత్యయాలు వస్తా.వస్తున్నైగదా అని విశృంఖలంగా తద్ధితప్రత్యయాలు వాడకూడదు. తనది కాని వస్తువు తనది ఐనది అనే చ్విప్రత్యయార్థంలో స్వీకరణం అని వస్తుంది. కాని పాణిని 'స్వకరణం'అని సూత్రంలో వాడేశాడు. ఇదేమి అంటే పతంజలి చెప్పాడు—"విచిత్రా స్తద్ధితవృత్తయః నాత స్తద్ధిత ఉత్పద్యతే" ఈతద్ధితలు విచిత్రమైనవి. ఇక్కడ తద్ధిత పుట్టదు అన్నాడు. దాక్షిణాత్యులకు ఎప్పుడో పేరుపెట్టాడు పతంజలి—ప్రియతద్ధితా దాక్షిణాత్యాః అని. కాత్యాయనుడు అనవసరంగా తద్ధిత వాడాడు కాబట్టి తద్ధితప్రియులు దాక్షిణాత్యులు † అన్నాడు.

ఇచ్ఛార్థకమందు సన్ ప్రత్యయము ధాతువుకు వస్తుంది. 'పపతిషతి'—పడదలచుకొన్నాడు. అ[...] శయార్థకమందు, పౌనఃపున్యార్థమందు యఙ్ అ[...] ప్రత్యయం ధాతువుకు వస్తుంది. 'బోభూయతే'—అ[...] శయంగా ఉన్నది. ఈఅర్థంలోనే 'యఙ్ లుక్' అ[...] ఇంకొక ప్రత్యయం ఉన్నది. 'బోభవీతి' అని దా[...] రూపం. ఈ రెండురూపాలూ 'భూ' అనే ధాతు[...] నుంచి వచ్చినవి.

---

* Philosophy of Sanskrit Grammar
—Chakravarthi.

† ఈవాక్యాన్నిబట్టి కాత్యాయనుడు దాక్షిణాత్యుడు అని ఒక వాదం ఉన్నది.

నామధాతువులని కొన్ని. శబ్దమే ధాతువౌతుంది. 'అశ్వస్యతి వడవా'—వడవ (ఆడగుఱ్ఱము) అశ్వాన్ని కోరుతున్నది. 'క్షీరస్యతి బాలః'—పిల్లవాడు పాలు కోరుతున్నాడు. అశ్వ, క్షీర శబ్దాలమీదనుంచి ఈ క్రియలు పుట్టినై.

## కృత్ప్రత్యయాలు

భాషలోని శబ్దాలు చాలామటుకు కృత్ప్రత్యయాంతాలు, ఉణాదిప్రత్యయాంతాలు. ధాతువులనుంచి ఈప్రత్యయాలు పుడతై. అన్ని భాషలలోను ఇటువంటి ధాతుజమైన శబ్దాలు ఉన్నై. కాని ఏధాతువునుంచి ఏప్రత్యయం వచ్చి ఏశబ్దం వచ్చిందో సంస్కృతంలో సులువుగా తెలుసుకోవచ్చును. తప్పించుకొని ఎగిరి పోకుండా సూత్రములచేత నిర్మింపబడిన అష్టాధ్యాయి అనే వలలో శబ్దాలను పాణిని బంధించాడు. ఈపని ఇతరభాషలలో ఎవరూ ఇంతబాగా చేయలేదు. 'నివర్తకం శాస్త్రమ్'—తప్పుదారిన పడకుండా చెయ్యటమే శాస్త్రం చేయవలసినపని. ఈపని వ్యాకరణశాస్త్రం చేసినంత బాగా ఇతరమైనది ఏదీ చేయలేదు.



# ఆషాఢంలో ఒకనాటి ఉదయం

= శ్రీ మహంకాళి భీమశంకరమూర్తి =

ఆకాశం వాన కురిసి
అంత తెల్లబడిం దిపుడు
కాకిలాంటి నావాళ్లు
కాస్త చల్లబడిం దిపుడు
పొన్న మొక్క ఒరిగిందని
కన్నె పిల్ల తడబడుతూ
సన్న సన్న గొంతుతోటి
జాలిజాలి పాడిం దెదో.

నీలాంటి మబ్బైనా
నిలుపుకోలేని ఆకాశం
మల్లెంటుమాటుగా
మలచుకొన్న ఆశీవిషం
తెల్లని వెన్నెల
వెళ్లిపోయిన విశేషం
నిమిషనిమిషం నాలో
నెమరుకోలేని ఆవేశం
ఎందుకో చూపునిండా
ఇలా పరచుకొం దిప్పుడు
అందంలాంటి నీవు లేని-యీ
మందు తిన్న ఉదయాన్ని.
ఏడురంగుల బాణానికి
ఎగిరివచ్చే సూర్యుడు
ఏడుకోట్ల కిరణాలతో
ఎందుకో భయపడుతూ
తెగిపడని ఆలోచనతో
తెల్లబోయి నిలుచున్నాడు
అంత దూరదూరాల
వింతగా నాకుమల్లే
అంతగా దుఃఖాన్ని
అణచుకోలేని నాకు మల్లే.

---

## భారత పరిశ్రమల ఆయువుపట్టు ఇంకను బ్రిటిషువారి చేతులలోనున్నది.

### మనమందర మైకమత్యముతో కలిసి కృషిచేసినప్పుడే అవి మనకు వశము కాగలవు.

తక్కువ పెట్టుబడితో, జాతీయ పరిశ్రమలు నెలకొల్పుటకు బ్రహ్మాండమైన ప్రణాళిక.

## ★ మా సోడావాటర్ మెషినులను స్థాపించుడు.

## ★ పరిమళద్రవ్యములను, టాయిలెట్ వస్తువులను ఉత్పత్తి చేయుడు.

మేము చిన్నవి, పెద్దవి అన్ని రకముల సోడావాటర్ యంత్రములు, సుగంధ తైలములకు, టాయిలెట్ వస్తువులకు ఉపకరించే పరికరములు మిక్కిలి చౌకధరలకు సప్లయిచేయుదుము.

ఉచితముగా మీకు ప్రవీణుల సలహాకూడ నొసంగబడును.

## THE ESSENCE & BOTTLE SUPPLY AGENCY,

**14, Radha Bazar Street,**

**CALCUTTA.**

[కథానిక]



# ఒంటరి పక్షులు



= శ్రీ తెన్నేటి సూరి =

వైశాఖ పూర్ణిమ—

అక్కడ బుడమేరు చాలా వెడల్పుగా వుంది. కాని, వేసవికావటంచేత, నది చిక్కిపోయి, యేటికి మధ్యగా సన్నటి పాయలో మాత్రం నీరు ప్రవహిస్తోంది ఇరుప్రక్కలా ఉబ్బెత్తుగా మేటవేసిన యిసుక తిన్నెలకు మధ్యగా ప్రవహిస్తూ, భూదేవి వక్షస్థలానికి మధ్యనుంచి స్ఫటికపుహారాల వ్రేలాడుతున్నట్టుగా వుంది ఆ సెలయేరు. ఆ నీటితరగచాలులమీద పండు వెన్నెల ప్రతిఫలించి నెమ్మదిగా కన్పిస్తోంది.

ఒక స్త్రీమూర్తీ, ఒక పురుషమూర్తీ ఎత్తుగా వున్న ఆ గట్టుదిగి ఆ యిసుకతిన్నెమీదుగా నీటి ఒడ్డుకు నడిచివస్తున్నారు.

"మేరీ!"

"అబ్బా! ఆ పిలుపు నాకు సిగ్గొత్తా వుంటది"

"అసలు నీ పేరదే మేరీ! సిగ్గెందుకు? ఎంత చక్కని పేరు! ఆ పేరు పలకటం చాతకాక మరియమ్మ అంటున్నారు — మొరటుతనంగా. నాకల్లా పిలవటం బాగుండదు. మేరీ అనే పిలుస్తాను."

"ఇదిగో నా అలవాటై...నలుగుర్లో వుండగా నీ కా పేరు నోరుజారుద్దేమోనని."

"మంచిపనేగా!...మన వెన్నుచాటున వాళ్లేది గుసగుసలాడుకుంటున్నారో, అది వాళ్ల ముఖాన కొట్టినట్టు ఒక్కముక్కలో తేరదించి చెప్పెయ్యగలుగుతాను...దాంతో ఆ గుసగుస అణుగుతై"

"నయం...నువ్వింతవాడివి కాబట్టి!...నన్ను రచ్చలోకి మాత్రం యీడవమాక...నీ పుణ్యముంటాది. నీపాదాలెనక కూసేట్టూ తిరగనియ్యి — అదిచాలు; ఎవ్వరికీ కాపడకుండా...నీపెళ్లే, నీయెనకెనకే మసుల్తా వుంటాను, పాణంబోయేదాకా."

"నువ్వు నా ప్రక్కన ఇలా నిల్చుంటే... నేనెంతో యెత్తున్నాననిపిస్తోంది మేరీ! చెయ్యెత్తితే ఆకాశమందుకుంటా అనిపిస్తోంది"

అడుగు వెనక్కువేసి మేరీ అతణ్ణి ఆపాదమస్తకం తేరిపారజూచింది. 'అవును...బలే!... ఎంత ఎత్తుగా నిల్చున్నాడూ!' అతనిప్రక్కన నిల్చుంటే తనూ ఆకాశంలోకి పెరుగుతున్నట్టనిపించింది. ఏదో, చెప్పరాని ఆవేశంతో తన శరీరమంతా క్షణక్షణం విచ్చుకుని తను ఇంకాఇంకా పెద్దపెద్దదిగా పెరిగిపోతున్నట్టనిపించింది. ఏదో అదపుచేసుకోలేని ఉత్సాహంతో వొళ్లు తెలియకుండాపోతోంది. ప్రక్కన నడుస్తున్న మనిషి 'చక్'న ముందుకు అడుగువేసి అతని గమనాన్ని నిరోధించింది. ఆ స్త్రీ రెండు బాహువులూ అతని నడుంచుట్టూ పాముల్లా పెనవేసుకుపోయినయ్.

తన ఆశ్రయం లేంది ఆ ప్రాణి బ్రతకలేదని తోచిందతనికి. తన నీడను ఆశ్రయించుకు బ్రదకాలనుకునే ప్రాణి ఒకటి యీలోకంలో వుంది. అది చాలు అతనికి. ఆపాదమస్తకం అతనిలో ఏమో ఒక గంభీరమైన శక్తి మేల్కొన్నట్టయింది. ఈ భూగోళానంతా గప్పున భుజంమ్మీదికి ఎత్తుకొని ఆశ్రయమియ్యగల ఒక మహాశక్తి అతనిలో విశ్వాసాన్ని ఆక్రమిస్తూ లేచి ఒళ్లువిరుచుకుంటోంది. ఆ స్త్రీమూర్తిని

గుబులుగా గొంతులో యేడుపొస్తావుండది...ఇటు చూడు...నావంక నవ్వుతా చూడు. ఎనకటికిమల్లే కళ్లల్లోకి చూసి సంతోషంగా నవ్వు...నా కేదో పోగొట్టుకున్నాను. యెందు కంత జాలిబడ్డావు ?" చెక్కిళ్లు బుచ్చుకు బ్రతిమిలాడుతోంది.

మేరీఒళ్లో పసిబిడ్డలా పడుకున్నాడు. ఆస్త్రీ అరచేతులు మసిలిపోతున్న తన గుంట బుగ్గలకూ హత్తుకుంటున్నాడు. వినిపించీవినిపించని గొంతుతో నెమ్మదిగా మాట్లాడుతున్నాడు.

"నాకు బుద్ధితెలిసేటప్పటికే మాఅమ్మ చచ్చిపోయింది మేరీ! అప్పటినుంచీ నా జీవితమంతా యీ చెట్టుచేలోనూ, యీ తోటలోనూ గడిపాను. ఈ బుడమేటిగాలికి ఆకులు కదిలి సన్నగా ధ్వనిచేస్తుంటే, ఆచెట్లు సంతోషంగా నన్ను పలకరించుతున్నట్టుగానే వుంటుంది. తోటలో పాకలో కట్టివేసివున్న ఆ యెడ్లూ, ఆవులూ, దూడలూ—అన్నీ ఆనందంగా కళ్లు ఇంతింతగా విచ్చులుకుని, నవ్వుతూ నావంక జూసి, మోరలు పైకెత్తి 'అంభా' అంటూ నన్ను ప్రేమగా పిలుస్తై. ఈయేటి నురగలోకి అడుగు పెడితే, ఈ సెలయేరుకూడా, హృదయమంతా విచ్చులుకొని, కిలకిలా నవ్వుతూ నన్ను తనవాణ్ణిగా పలకరించుకుంటుంది. అంతదూర మెందుకు— బుగ్గను ముంజెయ్యాని, ఇలా నాముందు మౌనమూర్తిగా కూర్చున్నావు కాని నీ హృదయం నన్ను పలకరించుతూనేవుంది—"

మేరీ రొమ్ముమీద చెయ్యివేసి చూసుకొంది. ఆశ్చర్యం...అవును...నిజమే...ఇదేమిటి ?... పలకరించుతున్నట్టుగానే వుంది. అవునన్నట్టు ఆశ్చర్యంగా అతనివంక తెల్లబోయి చూసింది.

"కాని,...మీ దొరసానికిమాత్రం నన్ను పలకరించటం చేతగాదు మేరీ! ఆవిడ మాట్లాడుతున్నా, నా కావిడ మాట్లాడుతున్నట్టుగావుండదు. ఆమాటల వెనక హృదయముండదు. గ్రామఫోను రికార్డుకు మల్లే కొంచెంసేపు వింటే ఇట్టే విసుగెత్తిపోతుంది."

"మనసిచ్చి ఆతల్లి నీతో యెందుకు మాట్లాడదూ?"

"చేతగాక— ఆవిడధోరణి వింటుంటే, ఆవిడకేమన్నా కొంచెం పిచ్చేమోననికూడా అప్పుడప్పుడు అనుమానమేస్తుంది— ఆవిడపుట్టింటివాళ్ళు చాలా గొప్ప వాళ్లుట. తన అన్నగారు. తాసిల్దారుట; వదిన హార్మోనియం వాయిస్తుందిట; వాళ్లు అద్దెకున్న మేడ చాలా అందంగావుంటుందిట; వాళ్ల పినతండ్రికూతురూ అల్లుడూ మద్రాసులో బీచిమీద షికారుచేస్తారట; వాళ్ల మేనమామ చాలా దర్జాగలవాడట; వాళ్లంతా రోజుకు డజనుసార్లు కాఫీతాగుతారట; వాళ్లంతా చాలా గొప్పవాళ్లుట; గొప్పవంశంట; వాళ్లల్లో పుట్టిందిగనుక తనూ గొప్పదేట—

"ఈ పిచ్చవాగుడంతా, నోటికి విసుగూ విరామమూ లేకుండా ప్రొద్దస్తమానమూ తను వాగుతూంటూ కూర్చుంటుంది; చుట్టూవున్నవాళ్లందర్నీ వాగమంటుంది. ఎప్పుడైనా, కాస్త విసిగెత్తి, నే నావాగుడు వాగలేక కొంచెంసేపు మానేస్తే,ఆవిడకుఎక్కడలేని దురాగ్రహమూ వచ్చేస్తుంది. మూతిబిగించుకుని ఇక ఆయిదారురోజులు, పిలిచినా పలక్కుండా, సత్యభామలా, అలిగికూర్చుంటుంది. ఏయేమాటలు మాట్లాడితే పుస్తెగట్టానన్న ధీమాతో యేడుస్తున్న మగాడు ఆత్మహత్య చేసుకుచస్తాడో ఆ సూటిపోటీకుళ్లుమాటలన్నీ బాకుల్లా యెడాపెడా విసిరేస్తుంది. ఇక వంకనున్న తువ్వాల నేనే స్వయంగా తీసుకోవాలిసివస్తుంది. కాగులో నీళ్లు నేనే స్వయంగా బిందెలోకి తోడుకోవాలిసివస్తుంది.

"సుఖపడటం ఆమనిషికి చేతగాదు. ఇతరులను సుఖపెట్టడం ఆమనిషివల్ల యేమాతుంది? అసలావిడకు సుఖపడక్కర్లేదు. ఆ ఆడంబరంలో సుఖంకావాలని వాంఛించటం అది అజ్ఞానం.

"సుఖాన్ని అనుభవించటంకాదు, ఆవిడకు కావలసింది. తను చాలా సుఖపడుతోందని చుట్టూ వున్నవాళ్లంతా అనుకోవాలి. తను, కోకిలా, 'సుఖపడుతున్నా, సుఖపడుతున్నా' అంటూ వాక్కుంటూ వుండాలి; చుట్టూ వున్నవాళ్లంతా వాగాలి. 'ఈ 'వత్సగభ'వీరంగం సాగుతూవుంటే, ఇదావిడకు చాలు.

"ఆత్మవంచన చేసుకుని, సుఖంకోసం టఫేటా బ్లౌజుల్లో, బర్మాశిల్కు చీరల్లోనూ, మెరీనాబీచ్‌లోనూ వెదుకులాడే ఆ [illegible] సుఖ మెక్కడ లభిస్తుంది మేరీ ?— [illegible] ఆడంబరంలో మొగవాడు సుఖంకోసం దేవుళ్లాడ [illegible] అవివేకం!

"అబ్బా! ఆ నరకమంతా మళ్లా తల్చుకుంటూ వుంటే నా గుండెలు కర్పూరంలా గాలిలోకి హారించి పోతున్నయ్ మేరీ! ఆవిషయం నన్ను మరిచిపోనీ

మేరీ! కదిలించబోకు; ఆఘోవ వదిలెయ్. పాతాళ కూపంలోకి దిగబడిపోతున్నాను. జీవచైతన్యంతో తొణికిసలాడుతున్న నీ అరచెయ్యి నాకు బరువుగా అంటింది పైకి లేవదీసుకో మేరీ! మళ్లా జీవితంలోకి అందిపుచ్చుకో; ఇప్పుడు నా చెయ్యి జారవిడవాలని చూడకు—దిగబడిపోతున్నాను.

"అనవసరంగా కంగారుపడి... నా ప్రక్కనుంచి ఆకాశంలోకి ఎగిరిపోవాలని చూడకు...మళ్ళా ఒంటరిగా బ్రతకలేను...నేను ఏకాకిని."

౨

అసురసంధ్య—

దూదిపింజెల్లాంటి తెల్లటి మబ్బులు. ఎర్రటి సంధ్యారాగంలో పరుగులు తీస్తున్నయ్. ఆ వేపున నిప్పంటుకుని, ఆకాశం ఆ పెళపెళా పెళపెళా తగులబడి పోతున్నట్టు కనిపించుతోంది. సూర్యబింబం ఆ జ్వాలల్లో ఎర్రగా కాలి భస్మమైపోతూ, క్షణక్షణం భూగర్భంలోకి పారించిపారించి పోతోంది. ఆ పొలం మీద వున్న మానూ మాకూ అన్నీ మంటలంటుకొని, ధగధగా మండిపోతున్నట్టుగా కనుపించుతున్నయ్. ఏటిగాలికి ఆకులూ, రెమ్మలూ కదిలి తెపకలు తెపకలుగా మంటలలుముకుపోతున్నట్టు బీభత్సంగా వుంది.

జుట్టు చిక్కగా రేగిపోయింది. చిన్నదొర ఆ మంచెముంగు వాల్చివున్న మడతమంచంమీద ఒక మూలగా గిజాటుగా కూర్చుని అదృశ్యంలోకి కోపంగా చూస్తున్నాడు. సంధ్యారాగం పడి, అతని ముఖం నెత్తురు పులుముకున్నట్టు ఎర్రగా భయంకరంగా వుంది. ఆ సూర్యుడికి మల్లెనే తనూ ఎవో మంటల్లో వొళ్లుకాలి తగులడిపోతున్నట్టు అలజడిగా వున్నాడు.

కట్టుగొయ్యల దగ్గిర కట్టేసున్న గొడ్లు కట్టుగొయ్యల దగ్గిరే చాలుపడి నిల్చుని అతనికంక తెంగగా చూస్తున్నయ్. పరాకొంకడంలేదు. పొలాన్నుంచి వచ్చాక అతను వాటిని కంట జూడలేదు, నుంట పలకరించలేదు. కనుమూగెద్దు మోర పైకెత్తి 'అంభా' అని జాలిగా పిలిచింది. అతను మాట్లాడలేదు. దాని రెండు కాటికకళ్లలోనుంచీ రెండు నీటిబొట్లు గాజుగోళీల్లా జారి భూమిమీద పడ్డయి. అతను కన్నెత్తి మాడనన్నా చూళ్లేదు. వచ్చుగా బుసగొట్టింది. నిల్చున్నచోట్లు నిల్చున్నపళాన నీరసంగా తించుకుపోయి నెమ్మదిగా కాలిముడుచుకొని పడుకుంది వట్టి నోరే దిగులుగా నెమరేస్తోంది.

మేకపిల్ల తల్లిపొదుగులోనుంచి నెమ్మదిగా లేచి వచ్చి భయంభయంగా దూరదూరాన నిల్చుని, పెల్లిగా 'మెహె హె!' అని అడిగింది.

'ఏమో!... నన్నడుగుతారేం...ఆ తాసిల్దారు చెల్లెల్నడగండి' అన్నట్టు, చిరాగ్గా కసిరికొట్టినట్టు ఒకసారి చూశాడు. మళ్లా ఆకాశంవైపు ముఖం తిప్పేసుకున్నాడు.

మంటలన్నీ ఒకటొకటే ఆరిపోతున్నయ్. ఆకాశమంతా నల్లగా కమిరిపోయింది. చీకట్లు క్రమ్ముకుంటున్నయ్.

చేనుగట్టున వున్న చిట్టికేసరగుట్టునిండా గిజిగాడిగూళ్లు వ్రేళ్లాడుతున్నయ్. ప్రొద్దుగూకేటప్పటికి ఆ బంగారుపిచ్చుకలన్నీ గూళ్లనిండా చేరాయి. "కిజ్ కిజ్ కిజ్" మంటూ ఉద్రేకంతో వాటిలో అవి ఏవో గందరగోళంగా మాట్లాడుకుంటున్నయ్. 'కిజ్ కిజ్ కిజ్' ప్రతిపక్షి తను చెప్పేది వినమనటంతప్ప అవతలపక్షి మాట్లాడేదేమిటో కాస్త విందామన్న జ్ఞానం అందులో యేపక్షికీ వున్నట్టు తోచదు. కిజ్ కిజ్ కిజ్-పిచ్చెత్తిపోయేలా ఒకటే రొద; చిరాగ్గా కూసేస్తున్నయ్.

'కిజ్ కిజ్ కిజ్—పాపం! మరియమ్మ...యెంత మంచితల్లి; ఇట్టా చెడ్డేనా తుంచి అదిలించేది కాదు. ఇంతికీ దాని రాత—'

'కిజ్ కిజ్ కిజ్— పాపాలు కారుమరదలు...పిశాచి ... ఎంతపని చేసిందీ ... అక్కానాక్కగుగా నిండు ప్రాణాన్ని కూనీ చేసింది...'

'కిజ్ కిజ్ కిజ్—మొన్న దీపావళినాడే; పండ చేసుకున్నానని పిలిపించిందిట; పప్పన్నం పెడతానని పిలిపించి ప్రాణం తీసింది—అరిసెల్లో విషం పెట్టిదిట: ఎంత రాసివారుంటారూ!'

'కిజ్ కిజ్ కిజ్!—పాపం! మరియమ్మంటే దాని కంత కోప మెందుకో?'

'కిజ్ కిజ్ కిజ్!—ఆ సంగతి నీకు తెలియదూ యేమిటీ? మొగాణ్ణి సుఖపెట్టుకోటం దానికి ?

గాదు. వాడూ అంతే ఏకముఖం, ఏకముఖం; వాడు ఇలాగే తిరిగి, ఈ పదేళ్ళ నుంచీ, చీకట్లో కూడా ఈపొలం లోనే తిరుగుతున్నాడు.'

'కిజ్ కిజ్ కిజ్ — చీకటంటే వాడికి భయం లేదా?' అంది, ఒక పక్షూన, గూట్లోనుంచి మెడ బయటికి చాచి. దానిమాట యెవళ్లూ వినిపించుకోలేదు.

'కిజ్ — మరియమ్మ మొగుడు?'

'కిజ్ — అవును, యేసోబ్.'

'కిజ్ కిజ్ — అది ఎంత యేడిచినా వినకుండా యుద్ధంలోకి పోయాడు'

'కిజ్ — అవును, చచ్చాడుగా!'

'కిజ్ కిజ్ కిజ్ — వాడు చావటంతో మరియమ్మ కూడా ఒంటరిపక్షై తిరగటం ప్రారంభించింది. ఈ యేకాకు లిద్దరూ తారసిల్లారు. ఇద్దరూ కలిసి హాయిగా బుసమేటిఒడ్డున వెన్నెట్లోకి నడిచి పోయారు. హాయిగా మళ్లా జీవితంలోకి బ్రతుకుతున్నారు!'

'కిజ్ కిజ్ — మొగుడక్కర్లేందానికి మరి, మరియమ్మమీద కోపం దేనికి?'

'కిజ్ కిజ్ — అది మొగుడుకోసం కాదు; అది తాసిల్దారు చెల్లెలట; తాసిల్దారు చెల్లెలి మొగుడు ఎవరినో కానిదాన్నుంచుకున్నాడంటే తనకూ, తనవాళ్లకూ తలవంపులుగా వుందట.'

'కిజ్ కిజ్ — మొగుణ్ణి సుఖపెట్టలేని మొప్పె అని లోకులు చెప్పుకుంటుంటే, అది తనకూ, తన వాళ్లకూ తలవంపులుగా యేమీ లేదుగాబోలు?'

'కిజ్ కిజ్ — కూనీచేసినందుకు ఆపాపిని ఉరికంబ మెందు కెక్కించారుగాదూ?'

'కిజ్ కిజ్ — తాసిల్దారు చెల్లెలూ, షావుకారు ముగదలూ కూనిచేస్తే మటుకు దాన్ని శిక్షించే వాడెవడు? పాడుదేశం!—'

'కిజ్ కిజ్ — ఇంతకూ, యీయుద్ధం దానికొంప దీసింది!'

'కిజ్ కిజ్ — యేసోబ్ ఎల్లాగైనా పెంకె ముండావాడు లెద్దురూ! యుద్ధట, వాడి శ్రాద్ధం! తను చచ్చాడు, దాని ప్రాణం తీసియించాడు.'

'కిజ్ కిజ్ కిజ్ — పాపం! వాడేంచేస్తాడు, పది డబ్బులు సంపాయించి తెచ్చి పెళ్ళానికి పెట్టుకోవాలనుకుని ఆశపడ్డాడు; చస్తాననుకున్నాడా?'

'కిజ్ కిజ్ — మీకు తెలవదు లెద్దురూ... అసలింతా ఆ అసమర్థపు చిన్నదొరవల్లంగా వచ్చింది. ఆతల్లిని కాపాడలేక, ఆపెద్దపులినోటికి బలిగా అందించాడు—అసమర్థుడు'

'కిజ్ కిజ్ — సన్యాసి,—చవట—'

'కిజ్ కిజ్ — సచ్చువెధవ'

'కిజ్ కిజ్ — అడుగడుగో! అదే! ఇక్కడే కూర్చున్నాడు; మనం మాట్లేదు. ఏకి గతి ఎప్పుడూ ఇంతే, ఏకాకి.'

'కిజ్ కిజ్ — ఏడేడీ?—'

'కిజ్ — అడుగో, మంచంమీదా!'

'కిజ్ కిజ్ కిజ్ — ఏడేడీ?' అంటూ పక్షులన్నీ తొంగితొంగి కొమ్మలచివరలకు వచ్చేసినై.

'కిజ్ కిజ్ కిజ్ — వాడే, వాడే, వాడే' అంటూ పిచ్చెత్తిపోయేలా గజిబిజిగా కూసేస్తున్నాయ్.

చెదరిపోయిన జుట్టులోకి వ్రేళ్లు పోనిచ్చి, చిక్కగా పీక్కుంటూ, పిచ్చివాడులా లేచి, ప్రాణం లేని చీకటిక్రీనీడలా నిస్పృహగా, బుసమేటొడ్డుకు అంధకారంలోకి నడిచిపోతున్నాడు.

## 3

కారుమబ్బుల కాళరాత్రి—

కన్నూ కన్నూ పొడుచుకున్నా కనుపించకుండా అంధతమసం! జీమూతాలు ఆకాశంలో పరుగులు తోలుతున్నాయ్.

ఆ నిశాగర్భంలో గండుగట్లకూ తనాయించి, ప్రపంచాన్నంతా ముంచిపారేసే ఉద్వేగంతో కెరటాలెగరవేసుకుంటూ, అల్లకల్లోలంగా, కొల్లదుబ్బుల మీదుగా పొర్లిపోతోంది బుసమేరు.

గట్టుమీద నుంచుని నదీగర్భంలోకి చూస్తున్నాడు అతడు. అతని హృదయంకూడా స్వాధీనం తప్పి, కెరటాలం లేచి కల్లోలమైపోతోంది. ఆ జలవేగాన్ని అనుసరిస్తూ రివ్వున...యెక్కడికో—

సన్నగా తుపరపడుతోంది. ఆ ఈదురుగాలికి చెట్లు జడలదెయ్యాలలా అంధకారంలో భయంకరంగా ఊగిపోతున్నయ్.

ఆకాశం ఒక్కసారి విరిగిపడిపోతున్నట్టు ఫెళ ఫెళా ఒక్క ఉరుమురిమింది; 'ఫిగేల్'మని ఒక మెరుపుతీగ 'సర్ర్'న భయంకరంగా అంధకార గర్భాన్ని చీరిపారేసి మళ్ళా అదృశ్యమైపోయింది.

'ఇన్చ్, ఇన్చ్, ఇన్చ్, ఇన్చ్'— దూరాన చీకట్లో, గులకరాళ్ల మీద మట్టెలు మ్రోగుతున్నయ్.

గట్టుమీద నిల్చున్న రౌద్రమూర్తి చివాల్న వెనుదిరిగి, సింహంలా ఉరిమిచూశాడు.

పసిడిగాజులు గలగ్గా మ్రోగినై — 'హు' అని భయంకరంగా గర్జించాడు. వాయుగర్భం కంపిల్లిపోయింది.

ఎర్రగా మినుకుమినుకుమంటున్న లాంతరు వెలుగులో, మామిడిపిందెల పట్టాలతో, చిక్కిపోయినట్టు సన్నగిలి, నాజూగ్గా వున్న, చిన్నిచిన్ని ఆపపాదాలు గట్టెక్కుతున్నై.

"ఎందుకొచ్చావ్ ?—" అంధకారగర్భంలోకి భయదంగా గర్జించాడు.

.........."

"మాట్లాడవేం ?—"

సన్నగా ఆడగొంతుయేడుపు వినిపించింది.

"నాకొక్కడా అరిసెలు తెచ్చావా ?...తెస్తే యిలా తే"—

విలయంగా ఘూర్ణిల్లిపోతున్న అంధిలోకి ఆ క్రోధమూర్తి పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ నడిచి పోతున్నాడు.

"అమ్మో ! అమ్మో ! ఆగండాగండి ! ... అదేమిటి ?"

"నదిలోకి అడుగుపెడితే చస్తావ్"... జలగర్భ ప్రళయంగా ఘూర్ణిల్లిపోయింది. నదిలో ఫర్లాంగు దూరాన, రెండు ఏనుగుగుండాలు నీటికెరటాలమీద దబాదబా బాదుతున్నట్టు శబ్దం వినిపిస్తోంది.

తనూ అతణ్ణి వెంబడిస్తుంది; చచ్చినాసరే— నీరు గుండెల్దాకా వచ్చి పడదోసేస్తోంది;

'అమ్మో !—' భయమేసి, అడుగు వెనక్కు తీసుకుంది.

"పోనీ, నీటిలో బడి మునిగిపోతుం టేనన్నా వచ్చి కాపాడుకోడూ ?...ఏమో..."అనుమానమేసింది.

'చస్తే చచ్చాను'—తూగి అడుగు ముందుకు వెయ్యబోయింది.

ఒక కెరటం 'గయ్య్'మని లేచి, పరుగెత్తుకుంటూవచ్చి, 'ఏడిశావ్ ! మొగవాడికోసం ప్రాణత్యాగం చేసే ధైర్యం నీకెక్కడేడిసింది ? ఇదేం మరి యమ్మకు ఏమంబెట్టడమనుకున్నావా ?'అని, ఫెళ్లున చెంపమీద కొట్టి, నెత్తిమీదుగా పార్లిపోయింది.

వుక్కిలింతలై, హడిలిపోయి, ప్రాణభీతితో, వెనక్కు గట్టుమీదకి పారిపోతోంది ఆస్త్రీ.

నదిలోనుంచి బయటికి లేచి అవతలిగట్టుమీది కెక్కుతున్నాడు ఆ రౌద్రమూర్తి. ఇవతలిగట్టు— గజగజా వణుకుతూ నిల్చున్న ఆస్త్రీకంక భయంకరంగా ఉరిమిచూచాడు.

"పో ! ఇంటికి పో ! హాయిగా బ్రతుకు, నీకు కావలసింది డబ్బా, గౌరవం—కావలసినంత నీ మొహాన పారేశాను. నెత్తినేసి కొట్టుకో— మొగాడి జోలి నీకెందుకు ?— మేరీని చంపేశానని మటుకు చంకలు గొట్టకోకు. ఇదుగో మేరీ నా హృదయంలో, కళ్లు తెరచుకు చూడు"—నదీగర్భంమీదుగా ఆకాశంలో వినుపించుకొంది.

ఫెళ ఫెళా ఒక ఉరు మురిమింది. ఒక మెరుపు మెరిసింది—మేరీని హృదయంలో దాచేసుకుంటున్నట్టు రెండు ముంజేతులూ ఎదురొమ్ము మీద ముడి చేసుకుంటూ పెద్దపెద్ద అంగలుగా ఆకాశపుటంచు దగ్గిరకి కోపంగా నడిచి పోతున్నాడు.



# మనుచరిత్రము: కొన్ని విశేషములు



*

= శ్రీ బులుసు వెంకటరమణయ్య

ఆంధ్రకవితా పితామహుఁడును, అనన్యసామాన్య ప్రతిభాభాసురుఁడు నగు నల్లసాని పెద్దనార్యుని మనుచరిత్ర మాంధ్ర మాత ధరించు కంఠమాలలోఁ దరళమణి యగుచున్నది. కొంచెము వాక్కుశుద్ధి యున్న ప ల్లెటూరివారికైనను ఇందలి పద్యరత్నములలో అన్నియో, కొన్నియో కంఠస్థములయి యుండును. ఎక్కువ ప్రచారము గల ప్రబంధములలో నిది ప్రధానము. దీనికి వ్యాఖ్యానములును పెక్కులు. ఇందలి బాగోగులను గూర్చియు, అర్థభేదములనుగూర్చియు, పాఠములనుగూర్చియు పెక్కురువిద్వాంసులు పెక్కుసారులు పెక్కు పత్రికలలో వ్యాసములను ప్రకటించియేయున్నారు. నేను మఱల దీనిని గూర్చియే వ్రాయుట చర్వితచర్వణ మని కొందఱు తలఁపవచ్చును. కాని ఇది వఱకుఁ బ్రకటింపఁబడని విశేషములను కొన్నింటిని తెలుపుటకే యీ వ్యాస ముద్దేశింపఁబడినదని మనవి. పూజ్యపాదులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఒండు రెండుసారులు 'మనుచరిత్రము' నందలి పాఠభేదములను గూర్చి ప్రకటించి కొన్ని 'గ్రంథగ్రంథు' లను విప్పి ఆంధ్రవాఙ్మయాభిమానులకు మహోపకారమొనర్చిరి. వానిని చదివినపిదప ఈ ప్రబంధము నామూలాగ్రముగ వ్రాఁతప్రతులతో సరిచూచి ఉచితపాఠములను, విశేషములను గ్రహింప మనసుపుట్టినది. పిదపఁ గొన్ని నెలలా విషయమునఁ బరిశ్రమించితిని. నా పరిశ్రమ మూరకపోలేదు. పెక్కు పాఠాంతరములు, విశేషములును లభించినవి. ఆ విశేషములను మచ్చునకు వెల్లడించుటయే నా సంకల్పము.

౧. ఇందలి ప్రథమాశ్వాసపు ౧౦-వ పద్యమున-

'నావాడపతి శకంధర సింధురాధ్యక్షు
లరిగాఁపు లెవ్వాని ఖరతరాసికి'

అను పాదము శ్రీకృష్ణదేవరాయల సామంత సౌభాగ్యము చెప్పునది కలదు. వ్యాఖ్యాతలిట 'శకంధర' పదమునకు 'శకంధర దేశపురాజు' అని అర్థము వ్రాసిరి. ఈ పదము అక్కాలమున గుజరాతు దేశమును పాలించిన 'శికందరషా' ప్రభువును తెల్పుచున్నది. వ్యాఖ్యాతలు తలఁచినట్లు శకంధర మనుపేరు గల దేశమును తెలుపుటలేదు.

౨. ఇందలి ద్వితీయాశ్వాసమున (౨౨)

శా. తావుల్ క్రేవలఁ జల్లు చెంగలువకే
దారంబు తీరంబునన్
పూవుల్ క్రోవులు నల్లి పెల్లికొను కాం
తారంబునం దైందవ
గ్రావాకల్పితకాయమాన జటిల
ద్రాక్షాగుళుచ్ఛంబులం
బూవుం దీవల నొప్పు నొక్క భవనం
బుఁ గాంచెన్ ద్విజోత్కృష్టమున్.

పయిపద్యమునందలి 'చెంగలువ కేదార తీరంబునన్' అనుదానికి 'ఎఱ్ఱకలువలుగల వరిమడియొక్క చేరువను' అని వ్యాఖ్యాతలర్థము వ్రాసిరి. ఎఱ్ఱకలువలు నీటియందుఁ బుట్టును; వరిమడుల గట్టులపై పుట్టుట అసంభవము. ఇచటి 'చెంగలువ' పదము ఎఱ్ఱ కలువలను బోధింపదు. చెంగలువయనునది తెల్లని - పరిమళించు పూవుల నిచ్చు దుంపజాతి గడ్డి

యొక్క కొన్ని కొంచెపు నీలిరంగు గల పూలనున్నట్టి పూచును. ఇయ్యవి సామాన్యముగా వరిమళ్ళ గట్లపయినే నాటఁబడును. ప్రవరుఁడు చూచిన చెంగలువలు ఇవియేగాని వ్యాఖ్యాతలు వ్రాసిన ఎఱ్ఱకలువలు కావు. వ్యాఖ్యాతలు 'చెన్ను + కలువ' అని విడఁదీసి చెన్ను శబ్దమునకు శోణార్థమును గ్రహించి 'ఎఱ్ఱకలువ' అని అర్థమును చెప్పియుండవచ్చును. ఇచటి 'చెన్ను' రమ్యార్థకముగాని శోణార్థకము కాదు.

3. ప్రవరుఁడు వరూథినికి లొంగక పరిశుద్ధుఁడై సంధ్యవార్చి గార్హపత్యాగ్నిని స్తుతించి "పావకప్రసాదలబ్ధంబగు పవనజవంబున నిజమందిరంబున కరిగె" నట్లు ద్వితీయాశ్వాసమున (౭౭ వచనము) జెప్పఁబడియున్నది. ఇచట ప్రవరుఁడు పవనజవంబున నడచి వెళ్లెనా? లేక సిద్ధుని పాదలేపప్రభావముచేతం బలె తలఁచినంతమాత్రమున ఇలు సేరియుండెనా? అను సందేహము కలుగుచున్నది. ఒక వ్రాఁతప్రతిలో నిచ్చోట "పావకప్రసాదలబ్ధంబగు హయంబు నెక్కి పవనజవంబున" అను పాఠమున్నది. ప్రవరుఁ డగ్నిని ప్రార్థింపఁగా నాయగ్నిభట్టారకుఁడు యోగిహయమును ప్రసాదించె ననియుఁ, దన్మూలమున ప్రవరుఁడు పవనజవమున నిలుసేరెననియు నాపాఠమును బట్టి తెలియుచున్నది. ఇది ఎంతయు నుచితముగ నున్నది.

౪. మాయాప్రవరుఁడు వరూథినితోఁ బ్రేమముట్టిపడ సంభాషించె ననిన పిమ్మట ఈ క్రిందిపద్యము కలదు. (౩-౨౦౮)

క. అని యూసగలుగఁ బలికిన
విని వేలుపుఁబలంది మోము వికసిల్లంగాఁ
దనచేతి చెఱఁగు బిగియం
బెనఁచుచుఁ దలవాంచి నగవు [illegible]

పయి పద్యములో 'తనచేతి చెఱఁగు = తన చేతఁ బట్టుకొన్న కపట ప్రవరుని యుత్తరీయపుఁ గొంగును; బిగియన్ = బిగియునట్లు; పెనఁచుచున్ = చేతికిఁ జుట్టుకొనుచు' అని యర్థము వ్రాయఁబడినది. దీనినిబట్టి వరూథిని మాయాప్రవరుని యుత్తరీయమును తన చేతికి గట్టిగాఁ జుట్టి లాగుచుండెనని వ్యాఖ్యాతలభిప్రాయపడినట్లు తెలియుచున్నది. కాని లజ్జావతియగు నామె యంతటి సాహసమునకొడిగట్టలేదు. ఆమె తన పైఁటచెఱఁగునే తన చేతివ్రేలికిఁ జుట్టుకొనుచు, నవ్వుచు నతనితో మాటలాడినది. చేతివ్రేలికిఁ జీరచెఱఁగును చుట్టుకొనుట లజ్జాసూచకమని సహృదయులెల్లరు నెఱిఁగిన విషయమే!

౫. రాక్షసుఁడు గంధర్వుఁడుగ మాఱి స్వరోచితో మాటలాడఁ బ్రారంభించునెడ మనోరమ యచ్చోటికి వచ్చినట్లు తెలుపు పద్యప్రారంభము -

క. అనునెడ వచ్చి మనోరమ
జనకుని పాదముల కెరఁగ— [౫-౫.]

అనియున్నది. స్వరోచి యంతకుఁ బూర్వ మామెను ఒక పొదరింట భద్రముగా దాఁచియుంచినట్లు చతుర్థాశ్వాసము చివఱఁగల

క. ఆసమయంబున గీర్వా
ణీసుతుఁ డయ్యింతి నొక్క నికట నికుంజా
వాసమ్మున నిశి క్రమ్మఱ
వే సురరిపుఁ దాఁకె......

అను పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది. గంధర్వుఁడు మాటలాడఁ బ్రారంభించిన సమయమున మనోరమ యచ్చోటికి రాక్కఱలేదు. కాని ఆమాటలు విని తన తండ్రి మాటలే యగుట గుర్తించి, యచటికి వచ్చెననుట బాగు. వ్రాఁతప్రతిలో 'అనునెడ' బదులుగ 'అనవిని' యనియున్నది ఇది ఎంతయు నుచితము. ముద్రితపాఠ మంతసరసము కాదు

❈ కథానిక ❈



# సుషుప్తి

❈ శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి ❈

చంద్రశేఖరానికి విచిత్రవిషయాలలో జోక్యం కల్పించుకోవటం చాలా సరదా. ఊరందరకూ ఉత్తరమైతే అతనికి దక్షిణమే. పాడుబడ్డ దేవాలయాల్లోకి వెళ్ళేవాడు. దయ్యాల మేడల్లోనే నివసించేవాడు. మంత్రతంత్రాలు చేసే ఆశవాళ్ళ పూటకూళ్ళ ఇళ్ళల్లోనే తినేవాడు. అంతా విచిత్రంగా ఉంటే రమ్యంగా ఉందని భావించేవాడు. లోకానికి ఇతడు ఒక పిచ్చివానిలాగానో, దయ్యంలాగానో కన్పించేవాడు. అతనిమీద అనేక అపవాదులు వేశారు. కాని అవన్నీ దున్నపోతుమీద వర్షం కురిసినట్లే. ఎవరూ దగ్గరకు రానిచ్చేవారు కాదు. అలాగే ఇతను వెళ్ళే ఇళ్ళల్లోకి కూడా ఇతరులు వచ్చేవారు కారు.

నరసమ్మ పూటకూళ్ళ ఇల్లు చాలా ప్రఖ్యాతి చెందింది ఆవూళ్ళో. ఆవిడ రోజూ అర్ధరాత్రి స్మశానానికి వెళ్ళుతుందనీ, భూతాలతో సంభాషిస్తుందనీ, లోకులంతా భావించి, రాత్రి కాస్త పొద్దుపోతే ఆమె ఎక్కడ కన్పిస్తుందో అనే భయంతో ఇల్లు కదిలేవాళ్లు కారు. ఆమె అలా వెళ్లినా వెళ్లకపోయినా చంద్రశేఖరం మటుకు పాడుబడ్డ దేవాలయంనుంచీ అర్ధరాత్రి ఐతేగాని ఆమెఇంటికి భోజనానికి వచ్చేవాడుకాదు. పొద్దుపోయి తిరగకూడదనీ, ఊళ్ళో చాలా చెడ్డవాళ్లున్నారనీ, పెందలాడే భోజనం చేయటం మంచిదనీ, పగలు తీరిక లేకుండా చేసే ఉద్యోగానికి రాత్రి విశ్రాంతి అవసరమనీ ప్రతిరాత్రీ అతనికి భోజనంముందు హితోపదేశం చేస్తుంది. ఏమీ మాట్లాడేవాడు కాదు. చాలా మంచిపిల్లవాడని తన కొడుకు లాగానే చూస్తూఉండేది. కాని అతని ప్రవర్తనలో ఏమీ మార్పు రాలేదు. ఆమెకు ప్రాణం విసికింది. ఒక నాటి రాత్రి అతను వచ్చాడు.

"నీకోసం ఎంత సేపో చూసీ చూసీ విసుగు పుట్టింది. నీజాడే లేకపోయింది. నీకు మంచిగా చెప్తే ఏమీ నచ్చటంలేదు. నీకు శాస్తి చేయాలి. రేపటినుంచీ వేళకు రాకపోతే భోజనం పెట్టను."

అనేసింది. చంద్రశేఖర మేమీ మాట్లాడలేదు. భోజనం చేశాడు. తన దారిన తాను వెళ్ళిపోయాడు. ఈ ఉపన్యాసాలతో కొన్నిరోజులు గడిచిపోయినవి. ఇదంతా మామూలైంది అతనికి. ఒకరోజు భోజనమైనాక అతన్ని నిలవేసింది.

"నేనెవరో నీకు తెలుసునా?" అని అడిగింది.

అతని కాశ్చర్యం వేసింది. ఇలాంటి ప్రశ్న అత డెప్పుడూ వినలేదు. వస్తుందని అనుకోనూలేదు. కాని ఆమెముందు ఏమీ మాట్లాడిఎరగడు. మళ్లీ అదేప్రశ్న వేసింది. కాస్త వస్తాయించి జవాబిచ్చాడు.

"మీరు నరసమ్మగారని అనుకొంటున్నాను"

"ఇంతేనా నీకు తెలిసింది? లోకు లేమనుకొంటున్నారో తెలుసా?"

"ఆ, తెలియకేం!.....ఎవర్ని గురించి?"

"నిన్నూ, నన్నూ గురించి."

"మీరు దయ్యాలతో సంభాషిస్తారనీ, నన్ను మీఅమ్మాయి కిచ్చి వివాహంచేయాలని నన్ను వశం చేసుకొన్నారనీ అంటున్నారు."

"అదే అడగాలని అనుకొంటున్నాను."

"ప్రొద్దున ఈసంగతి వినేవాకా మీదగ్గర ఒక అమ్మాయి ఉందనే నాకు తెలీకపోయింది. అందుచేత వాళ్ళపాపాన వాళ్ళే పోతారని ఊరుకొన్నాను."

"సరేగాని, ఆ పాడుబడ్డ దేవాలయానికి రోజూ వెళ్తున్నా వెందుకూ ?"

"అది వెనక కాళికాలయం. అక్కడ తపస్సు చేస్తే కాళికాదేవి ప్రత్యక్షమౌతుందనీ, నేనుకూడా కాళిదాసంతటివాణ్ణి ఔతాననీ ఆశ."

"దేవత ఏమన్నా సాక్షాత్కరించిందా ?"

"మీ కొక అమ్మాయి ఉందనీ, ఆమెపేరే కాళిక అనీ, అందుకనే ఆగుడికి వెళ్తున్నాననీ ప్రొద్దున్నే నాకు వాళ్లు సాక్షాత్కరింపజేశారు."

"ఇది అబద్ధమంటావా ?"

"ఆ. ఖచ్చితం."

"ఐతే, కాళికాదేవి అర్ధరాత్రిదాటితేనే గుళ్లోకి వస్తుంది. అందుచేత నీవు అర్ధరాత్రినుండి అక్కడ ఉండటం మంచిది."

"పెందలాడే నాకు భోజనంపెట్టి సాగింపటాని కిది ఒక ఎత్తన్నమాట."

"అసలుసంగతి అది కాదు. అర్ధరాత్రిదాటితే నీకు తగని భయం. కాబట్టి ఇక్కడకు వెంటనే వస్తున్నావు."

"పోనీలెండి. ఇక వెళ్లివస్తాను. సెలవు తీసుకొంటాను."

"పొద్దుపోయింది. ఈరాత్రి ఇక్కడే పడుకో. దయ్యాలు ఏమీ రావులే."

"ఏమండీ, ఐతే మీరు దయ్యాలతో మాట్లాడుతారట నిజమేనా ?"

"అక్షరాలా నిజమే."

"నాకుకూడా వాటిని చూపరూ ?"

"అర్ధరాత్రికి తిరిగితిరిగి వచ్చే నీకన్నా పెనభూత మేముంది ? ఐనా ఇక్కడ నిద్రపో. దయ్యాలున్నయ్యేమో చూద్దుగాని" అని అంటూ అతన్ని పంచలోకి తీసుకొనివెళ్లి, పక్క వేసి, నిద్రపొమ్మన్నది ఆమెదారిన ఆమె లేచిపోయింది ప్రక్కగదిలోకి. ప్రతిక్షణమూ దయ్యాలు వస్తున్నయ్యని అనుకొంటూ, వాటిని చూడాలనే కుతూహలంతో, అవేం చేస్తయ్యో అనే భయంతో నిద్రపోకుండానే పడుకున్నాడు. నరసమ్మ తన కేమీ అపాయం రానియ్యదనే ధైర్యం తెచ్చుకుంటూ మెలకువతోనే ఉన్నాడు. ఆ దయ్యాలు వస్తే వాటి నెలా పలకరించాలా అని ఎన్నో సంభావణలను మనసులో అల్లుకొంటున్నాడు. ఎంతకాలం గడచినా ఒక్కదయ్యమైనా కనబడలేదు. వాటి కాళ్ళు చేతులూ వెనక్కు తిరిగి ఉంటయ్యనీ, గోళ్ళు పెద్దవిగా ఉంటయ్యనీ, జుట్టు విరబోసికొంటుందనీ, తా నిదివరకు విన్న విషయాలన్నింటినీ జ్ఞప్తికి తెచ్చుకొని, వాటిని సరిగా పరీక్షచేయాలని నిశ్చయించుకొన్నాడు.

కోడికూసింది. నిరుత్సాహపడ్డాడు. కోడికూస్తే దయ్యంరాదు. ఇక ఏం చెయ్యాలి ? నిద్రపట్టలేదు. తన కుతూహలమంతా నాశనమైంది. పైన తెల్లవారినాక నరసమ్మ ఇంట్లోనే మకాంమార్చాడని ఇతరులకు తెలిస్తే, ఇంకొక కొత్త అపవాదుకూడా బయలుదేరుతుంది. ఏమీ తోచక, ఎలాగైనా లేచిపోవాలని నిశ్చయించుకొన్నాడు. కాని ఆమెతో చెప్పి వెళ్ళాలి. ఆమె ఎక్కడ పడుకుందో తెలియదు. ప్రక్కగదిలోకి వెళ్ళినట్లు రాత్రి చూశాడు. సరే, ఆమె అక్కడే పడుకొనిఉంటుందనుకొని వెళ్ళాడు. ఒక్క మంచమే ఉన్నది. దీపంలేదు. ఎవరో గాఢసుషుప్తిలో ఉన్నారు. "నరసమ్మగారూ, నరసమ్మగారూ" అని పిలిచాడు. కాని ఎవరూ పలకలేదు. ప్రాణంవిసికి చేతితో నెమ్మదిగా ముఖం కదిపి మళ్ళా పిలిచాడు. ఎందుకో గుండె వేగంగా కొట్టుకున్నది. "ఆమె లేస్తే ఏమనుకొంటుంది ? ఎందుకు లేచివచ్చావంటే ఏమని చెప్పాలి ? వెళ్తున్నానని చెప్పటానికి అంటే ఆమె ఏమంటుంది ?" అని ఏమేమో ఆలోచించుకొని, లాభం

లేదని, దాహమౌతున్నదని అందామని నిశ్చయించు కొని మళ్ళా లేపాడు. ఫలితం శూన్యమే.

నెమ్మదిగా చేతిమీద కొట్టిలేపాడు. "ఎవరు వారు" అన్నది. "నేనండీ, చంద్రశేఖరాన్ని. దాహ మేస్తున్నది. కాసిని మంచినీళ్లివ్వండి" అన్నాడు. ఆమె లేచి నీళ్లు తీసికొనిరావటానికి రివ్వున వెళ్ళింది. ఆమె నరసమ్మగారి కాళికేమోనని అనడక చూసినాక అతనికి స్ఫురించింది. చాలా భయం వేసింది. నిజంగా ఆమెకూతురే ఐతే, నరసమ్మ ఈసంగతి చూస్తే ఏమంటుందో అని జంకాడు. గబగబా లేచిపోయి తన పక్కదగ్గరకు వెళ్లి కూచున్నాడు. అప్పుడే పొద్దు పొడుస్తున్నది. ఆ అమ్మాయి నీళ్లు తెచ్చి అందిచ్చింది. కాస్త ధైర్యం తెచ్చుకొని పలకరిద్దామనుకొన్నాడు. నీళ్లు తాగలేక తాగలేక ఎలాగో తాగాడు. "ఇంకా కాసిని కావాలా" అని మెల్లిగా అడిగింది. అప్రయత్నంగా జవాబిచ్చాడు: "మీపేరేనా కాళిక" "అవునండీ" అన్నది నవ్వుతూ. అతనికి భయం వేసింది. నిజంగా నరసమ్మ తన కివివాహం చేయాలని వశీకరణం ప్రయోగించిందేమోనని చాలా దిగులుపుట్టింది. దీనికి తగ్గట్టు ఆ అమ్మాయికూడా కదలకుండా మెదలకుండా నిలిచిపోయింది. ఇలా ఉంటే ప్రతిమించి రాగాన పడుతుందని, "క్షమించండి. నిద్రలేపాను. దాహం చాలా అపరిమితంగా వేసింది" అన్నాడు. "అందుకనేనా అ! కాసిని నీళ్ళూ తాగలేకపోయారు" అన్నది కొంటెగా. గ్రహించాడు సర్వమూ. తన భయం ధ్రువపడ్డది. ఇక ఎలా తప్పించుకోవాలి అనే ఆలోచనలో పడ్డాడు "కాదండీ, మీ అమ్మగారు నాకు దయ్యాల్ని చూపిస్తానన్న దీరాత్రి. చాలా సేపు నిరీక్షించాను. లాభం లేకపోయింది. పైగా దాహం వేసింది. నీళ్లు తాగుతూకూడా, దయ్యాలు అదృశ్యమై వస్తయ్యేని పరీక్షిస్తున్నాను నాలుగు దిక్కులూ. అందుకని జబ్బుగా తాగలేదు" అన్నాడు. "దేవతాసాక్షాత్కారం కావాలని మీరు తపస్సు చేస్తున్నారట నిజమేనా ?" అని సాభిప్రాయంగా అన్నది. అవునన్నాడు తడుముకోకుండా. "దేవత కనపడాలనేవారికి దయ్యాలు కనబడవు" అన్నది. "ఐతే దేవతకూడా కనబడటంలేదుగా" అన్నాడు. "అర్ధరాత్రి దాటింతరువాత తపస్సు చెయ్యమని మాఅమ్మ చెప్పిందిగా. అలా చేస్తే కని పించదూ." అన్నది. "ఏమో"నన్నాడు. "మీ రీరాత్రి చేసిన తపస్సుకు తార్కాణంగా కాళిక కన్పించిందే" అన్నది కొంటెగా. వెంటనే ఏదో భావం స్ఫురించింది. ఆమెచేయి పట్టుకొన్నాడు. ఆఅమ్మాయి బాగా చేయివిదిలించుకొని రివ్వున లేచిపోయి తనపక్క మీద కూర్చొన్నది. అతనూ వెంబడించాడు. సమీపంలో నిలబడి చేతులు జోడించుకొని ముఖమొకసారి చూపించమని ప్రార్థించాడు. కాకుల కూత వినబడ్డది. "మాఅమ్మ లేచే వేళైంది. మీరుపోయి, ఏమీ తెలీని వారిలాగా పడుకోండి. రేపుకూడా ఇక్కడ ఉంటే, నన్ను స్పృశించనని వాగ్దానంచేస్తే, ముఖం చూపిస్తా" నన్నది. సరేనని చంద్రశేఖరం వెళ్లిపోయి ఏమీ ఎరగని అమాయకునిలాగా పక్కమీద పడుకొని గురకలు మొదలు పెట్టాడు.

మర్నాటి రాత్రి చాలా పొద్దుపోయింది. నరసమ్మ చాలాసేపు మేల్కొనిఉన్నది. కాలక్షేపానికి కూతుర్ని పిలిచింది. ఏవేవో మాట్లాడుకుంటూ కాలం గడిపారు.

"ఐతే,అమ్మాయి, పొద్దున చంద్రశేఖరంమంచం దగ్గిర మంచినీళ్ల చెంబున్నదేమిటి? నేను పెట్టినట్లు జ్ఞాపకంలేదే. నిన్నేమన్నా లేపి మంచినీళ్లడిగాడా" అని అడిగింది.

ఉన్నదున్నట్లుగా కాళిక పూసగుచ్చినట్లు చెప్పింది. నరసమ్మ లోపలలోపల నవ్వుకొంటూ "ఇదేనా అతగాడి గాఢసుషుప్తి, గురకలూనూ" అన్నది. కాసేపు నిశ్శబ్దం.

"ఈరాత్రికికూడా అతడు ఇక్కడే పడుకొనే టట్లు చేస్తాను, నివు ఈరాత్రం నేపడుకొనేచోట పడుకో. నేను నువ్వు పడుకొన్నచోట నిద్రపోతున్నట్లు నటిస్తాను. ఏం జరుగుతుందో చూద్దాం."

అన్నది. కాళిక అలాగే నని వెళ్లిపోయింది. అర్ధరాత్రి దాటిన ఎంతసేపటికో చంద్రశేఖరం భోజనానికి వచ్చాడు. నియమాలమీద, అలవాట్లమీద దీర్ఘోపన్యాస మిస్తూ భోజనం పెట్టింది. అత డిక

వెళ్ళబోతుంటే, "పొద్దుపోయింది. నీ బసకు వెళ్ళాలంటే చాలాదూరం. ఇవాళకూడా ఇక్కడే పడుకో" అన్నది.

"కాదండీ నరసమ్మగారూ, క్షమించండి. వెళ్తాను. నేను రాత్రి ఇక్కడె పడుకొన్నానని దుర్మార్గుడెవరో అప్పుడే గ్రహించి గోలచేస్తున్నాడు. వెళ్తాను. పైగా రాత్రి దయ్యాలను చూపిస్తానని చెప్పారు. ఒక్క దయ్యమేనా రాలేదు" అన్నాడు.

"కాదు, ఇవాళ తప్పకుండా చూపిస్తాను. వాళ్లకేం ? ఇక్కడే పడుకొనితీరాలి" అని బలవంతం చేసి ఒప్పించింది.

పోయి పడుకున్నాడు. దయ్యాలను చూడాలని ఒక పక్క కుతూహలం ఉన్నది. కాని దయ్యాలకు బదులు కాళికాదేవతే ప్రక్కగదిలో కనబడుతుందని నిశ్చయించుకొన్నాడు. లేచి నెమ్మదిగా వెళ్లి ఆమె పక్కదగ్గర నిలబడి, "కాళికా, ముఖం చూపించవూ" అన్నాడు దీనంగా చాలాసార్లు. చివరకు ఆమె లేచి-

"నన్ను ముట్టుకోనంటే చూపిస్తాను" అన్నది.

"ముఖం చూసేదాకా ముట్టుకోను లే" అన్నాడు.

నరసమ్మ లేచి చిన్న దీపం వెలిగించి తెచ్చి బల్లమీద పెట్టి ఇక ముఖం చూసేమన్నది. "అచ్చగా మీ అమ్మలాగానే ఉన్నావు" అంటూ చేయిపట్టుకొన్నాడు. ఏం చేస్తుందో చూడామని, గట్టిగా చేయి విదిలించలేదు. ఆమెను దగ్గరకు లాక్కొని, కౌగలించుకొని, ముద్దుపెట్టుకొన్నాడు. అప్పటి ఆ ఉద్రేకంలో తను చేస్తున్నది తప్పని ఆమెకు తోచలేదు.

ఆమెకు మూర్ఛవస్తున్నవి. కూతుర్ని పుట్టిన ధర్మమా అని మెలుకువ చేసిపోయినాడు. అప్పటినుంచీ చాలా జాగ్రత్తగా సత్ప్రవర్తనతో మెలగుతూ వచ్చింది.

* * *

కాళికను వివాహం చేసుకోవాలని అతనికి హృదయంలో బాగా నాటుకొనిపోయింది. రోజురోజుకీ ఈ ఉద్దేశం ఎక్కువైపోయింది. ఒక రోజున నరసమ్మతో ఈ విషయం ప్రస్తావించాడు భోజనం చేస్తూ. ఆమెకు నవ్వూ, ఏడుపూ వచ్చినై. అతని కేమీ తోచలేదు. చాలా కష్టంలో—

"కొద్దిరోజులు గడవనీ. పైగా మీవాళ్లేమంటారో కూడా తెలుసుకోటం మంచిది. ఇప్పటికే ఊళ్లో అపవాదులు చాలా ప్రబలమైపోయినవి. జాగ్రత్తగా మెలగాలి"

అని ధైర్యం చెప్పుకొని అన్నది. కాని చంద్రశేఖరం లోకంలో ఏకాకి. చంద్రశేఖరానికి ఏడాది తిరక్కముందే తల్లిదండ్రులు గతించారు. అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు ఎవ్వరూ లేరు. ఉన్న బంధువులు ఆస్తి అంతా సంగ్రహించేశారు. పొరుగిళ్లవారి ధర్మమా అంటూ రెక్కలువచ్చేదాకా పెరిగాడు. తన సంగతంతా పూసగుచ్చినట్లు చెప్పేశాడు. "ఆలోచిద్దాంలే" అని మాత్ర మనేసి, కూతుర్ని పిలిచింది. ఇద్దరూ అతలకు వెళ్లి దీర్ఘంగా సంభాషించారు. చివరకామె వచ్చి, "చంద్రశేఖరం, నీవూ కాళికా కలిసి ఆలోచించుకొని నిశ్చయించండి" అని చెప్పలేక చెప్పలేక చెప్పి వెళ్లిపోయింది.

అతని కేమీ తోచలేదు. ఇలాంటి సంఘటనలలో ఎలా ఎదురుకోవాలో అతనికేమీ తెలియదు. ఐనా ప్రస్తావన మొదలుపెట్టినాడు. కాళిక చాలా దీనస్థితిలో నిలబడిఉన్నది. అతని భోజన మైపోయింది. చేతులూ కాళ్లూ కడుక్కొని, సమీపంలో కూచొని, తన హృదయంలో ఉన్న భావాలను ఆమెకు వెళ్లబుచ్చాడు. కాళికకు ఏడుపు పొర్లుకొనివస్తున్నది.

"ఈ వివాహం మీకు శ్రేయస్కరం గాదు" అన్నది.

నిశ్చేష్టుడైనాడు. ఇలా అంటుందని అతడు అనకోలేదు. 'ఏ'మన్నాడు.

"ఇప్పటికే చాలా అపవాదులున్నవి. లోకులంతా మా అమ్మను తిట్టిపోస్తున్నారు. నన్ను మీకిచ్చి వివాహంచేయాలని ఏదో తంత్రం పన్నిందంటున్నారు. ఈ పరిస్థితిలో మీ రీవూరు వదలిపెట్టి పోవడం చాలా మంచిది. లేకపోతే ఇక్కడ భోజనమైనా మానేయాలి" అన్నది.

ఒళ్లంతా తేళ్లూ, జెర్రులూ పాకినట్లయింది అతనికి. ఐనా—

"లోకంతో నాకేం సంబంధమున్నది ? మీ అమ్మకి సంబంధం ఇష్టమేకదా ?" అని అడిగాడు.

"కాదు" అన్నది. కొయ్యబారిపోయినాడు మనిషి. ఇన్నాళ్లూ నరసమ్మ కూతుర్నిచ్చి తనకు

పెళ్లి చేయటానికి ఇష్టపడుతున్నట్లు కనిపిస్తున్న దతనికి. ఈ పరిణామ మర్థం కాలేదు. "ఎందుకని?" అన్నాడు.

"మా అమ్మ ఎవరో మీకు తెలుసుగాదా ?" అన్నది.

"తెలియకేం?" అన్నాడు.

"మానాన్న చనిపోయి పదిహేనేళ్లయింది. నన్ను పెంచి పెద్దదానిని చేసింది. పెద్దతనంలో దిక్కు లేకుండా పోతుంది. ఏపంచనైనా చేరుదామని లోపల ఆలోచన ఉన్నది"

ఈ సంభాషణకూ, తన భావాలకూ సంబంధ మేమీ కనపడలేదు.

"ఇదంతా అప్రస్తుతప్రశంసగా ఉన్నది. మన వివాహానికి మీ అమ్మ అంగీకరిస్తే, మనదగ్గిరే ఉంటుంది. ఇంకా భయ మెందుకు ?"

"ఇదివరకంతా మా అమ్మ మిమ్మల్ని కొడుకులాగా చూస్తూవచ్చింది. ఇప్పటినుంచీ నేను మిమ్మల్ని ఎలా చూడాలో నాకు బోధపడటం లేదు. అంతా అయోమయంగా ఉన్నది. పైగా మీ రెప్పుడూ రెక్కలమీదే ఆధారపడి ఉండాలికాదా" అన్నది.

అతనికి వెర్రి ఎత్తినట్లున్నది. ఐతే కాళిక తనకు చెల్లెలువరస ఔతుంది కాబోలని భావించాడు. ఐనా ఆదరం చూపటంలో కొడుకుకన్నా అల్లుడిమీదనే కొందర కుంటుందని సమాధానపడ్డాడు.

"కొడుకులాగా చూడట మేమిటి ? కొందరు అల్లుణ్ణికూడా అలాగే చూస్తారు. అంచేత నువ్వు నాకు చెల్లెలువరస కావులే. పిచ్చిఆలోచనలు వద్దు" అన్నాడు.

ఆమెకళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగినై. ప్రపంచమంతా వేగంతో తిరిగిపోతున్నట్లు కన్పించింది. చితికిపోయిన ధైర్యాన్ని ఒక్కసారిగా దగ్గరతీసికొని—

"మీకూ, నాకూ వయస్సులో ఎంత తేడా ఉన్నదో తెలుసా ?"

"ఏడేళ్ళుండేను"

"ఇంతేనా ? మీ కిదరకు వివాహమైఉంటే నాఅంత కూతురే పుట్టిఉండేది" అని అంటూ శోకంతో చివ్వున లేచిపోయింది.

అతడుకూడా వెంట నడిచిపోయినాడు. తను పడుకునేస్థానందగ్గరకు వెళ్లిచూచాడు. పక్క వేసి ఉన్నది. కాని కాళికతో కచ్చితంగా ఏసంగతీ తేల్చుకోవాలని నిశ్చయించుకొని లోపలకు వెళ్లాడు. పక్కగదిలో ఎవ్వరూ లేరు. ఆశ్చర్యమూ, భయమూ వేసినవి. పక్కనే వున్న హాలులోకి వెళ్లాడు. మంచంమీద కూర్చొని, ఆమెబుజంమీద చేతితో తట్టూ, ఓదార్చటం మొదలుపెట్టాడు. కాని ఆమె ఎంత దిగమింగుకున్నా ఏడుపు ఆగలేదు. తన చేతితో ఆమె ముఖాన్ని దగ్గరకుతీసుకున్నాడు. కన్నీటిని తుడిచివేశాడు. అనునయంగా పలకరించాడు. కాని ఆమె కదలలేదు. మెదలలేదు. పట్టరాని ఆవేశంలో ఆమెను ముద్దుపెట్టుకొన్నాడు. ఇక ఆమె తన భావాలను అణచుకోలేక పోయింది.

"చంద్రశేఖరం, ఆదీపం పెద్దదిచేయి" అన్నది. అతడు శిరసావహించి, చేసి ఆమెను చూచాడు. అతనికి పిచ్చిఎత్తిపోయినట్లుంది. అప్పుడుగాని ఆమెకూ, కాళికకూ ఉన్న భేద మతనికి బోధపడలేదు. ఇక అక్కడ ఉండలేక, లేచిపోవాలని బయలుదేరాడు. ఆమె అతనిచేతిని గట్టిగా పట్టుకొని పోనీయలేదు. అతనికి తీరని అవమానంగా ఉన్నది. కాని ఆమె నవ్వుతూ—

"కాళిక అంతా చెప్పిందా, లేదా ?" అని అడిగింది.

* * * *

నరసమ్మ దీర్ఘంగా యోచనచేసింది మర్నాడంతా. తన సుఖానికి కూతుర్ని బలిఇయ్యాలా వద్దా అనే ప్రశ్న కలతపెట్టింది. కాని అతడు తన కూతుర్ని తప్ప పెళ్లిచేసుకోడు. కాని ఈవిషయమంతా విన్నాడు కనుక, ఇక ఆఇంట్లోకే రాడు. మూడు జీవితాలూ నిష్ప్రయోజనాలవుతాయి. జీవితం చాలా తుచ్ఛమని తోచింది. కూతురితో మాట్లాడటానికికూడా ఆమె కెందుకో భయంవేసింది. ఆనాడు పగలు భోజనానికి చంద్రశేఖరం రాలేదు. పొద్దుపోకవచ్చింది. ఊళ్లో ఎవరినన్నా అతని సంగతి అడుగుదామంటే, తనతో ఎవ్వరూ మాట్లాడరు. చీకటిపడ్డది. అతను రాలేదు. అతనేమైనాడో తెలియదు. కూతురుకు భోజనం పెట్టి నిద్రపొమ్మని పంపేసింది. ఎంతసేపు జాగరణచేసినా లాభంలేకపోయింది. ఇక లాభంలేదని, కాళికాలయంలో అతడుంటే పట్టుకువద్దామని తేల్చుకొని

బయలుదేరిపోయింది. ఆమె వెళ్ళిన కాసేపటికి చంద్రశేఖరం వచ్చాడు. తలుపు ఓరవాకిలిగా ఉన్నది. లోపలకు వెళ్ళాడు. తనకోసం నిరీక్షిస్తూ తలుపు వెయ్యలేదేమోనని, ఇప్పుడు తలుపు దగ్గరగా వేశాడు. లోపల అంతా నిశ్శబ్దం. వెళ్ళాడు. ఎవరూ కనబడలేదు. పక్కగదిలోకి వెళ్లి ఆమెను లేపి అన్నం పెట్టించుకు తిని వెళ్లాలని వచ్చాడు. అక్కడ డేనరో పడుకుంటే ఆమే నరసమ్మని లేపాడు. కాళిక లేచింది అతన్ని చూడగానే "పగలు ఉపవాసం చేశారా!" అన్నది. "ఔ"నన్నాడు. "ఎందుకని?" అని అడిగింది. "మీరు చెప్పినమాటలు ఎంతవరకూ నిజమో అని ఆలోచిస్తున్నాను" అన్నాడు. "అక్షరాలా నిజమే"నన్నది. ఈ సమాధానం పిడుగులాగా పడ్డది. ఇలా ఔతుందని అతడెన్నడూ అనుకోలేదు. "ఇక మన వివాహం కుదరగూడదుగదా" అన్నాడు. "అంతే" నన్నది. "ఐతే వెళ్లిపోతా" నన్నాడు. "మాఅమ్మ ఇదంతా వింటే......" అని అనబోయింది. ఇంతదాకా ఆమెనే నరసమ్మగా భావించినవాడు కాస్తా అదిరిపోయి, మంచంమీదనుంచీ లేచి నిలబడ్డాడు. కింద తలుపు శబ్దం వినవస్తున్నది. కాళిక లేచింది. బలవంతంగా చేయిపట్టుకొన్నాడు. ఆమె విదల్చుకోబోయింది. కాని లాభంలేదు. తనను కాపాడమని వేడుకొన్నాడు. ఇంతలోకే నరసమ్మ వచ్చి ఈదృశ్యం చూచింది. ధైర్యం తెచ్చుకొని—

"చంద్రశేఖరం, ఏం జరిగిందో జరిగింది. అన్నీ మనము అనుకొన్నవాటికి వ్యతిరేకంగానే జరిగినై. ఇకనైనా శాంతంగా కాలం గడుపుదాం. కాళికను నీకూతురుగా చూసుకో" అన్నది.

ఏపాపమూ ఎరగని చంద్రశేఖరానికి ఏడుపూ, కోపమూ వచ్చినై. చేయివిదల్చుకొని రివ్వున బయట పడ్డాడు. నరసమ్మ వెంబడించింది. ఎక్కడకు వెళ్తున్నారో, ఏమౌతుందో నని కాళికకూడా బయలుదేరింది. శీఘ్రకాలంలో కాళికాలయంలోనికి చేరారు. ఇదివరకు అక్కడున్న ఆ పాడుబడ్డ విగ్రహంకూడా కన్పించలేదు. ఇదే తన అవసానకాలానికి తార్కాణమని భావించాడు అంతటా వెదికాడు. ఎక్కడా విగ్రహం లేదు.

"చంద్రశేఖరం, నువ్వు కాళికను ఇవ్వాళ్ల ప్రార్థించావు. కాని దేవత సుషుప్తిలో ఉన్నది. నీ మొర ఆలకించలేదు. ఇక లాభమేముంది" అన్నది నరసమ్మ.

అతడు గర్భగుడిలోకి వెళ్లి, చిన్నకొవ్వొత్తి దీపం వెలిగించాడు.

"ఇకమీరు వెళ్లండి. రేపుఉదయం మిమ్మల్ని కలుసుకొని మీకు నా నిశ్చయం తెలియజేస్తా" నన్నాడు.

ఇంతవరకూ కాళిక వారికి కనబడకుండా దాక్కొని ఉన్నది. నరసమ్మ మారుమాటాడకుండా ఇంటికి వెళ్లిపోయింది. వెంటనే కాళిక అతని దగ్గరకు వచ్చి చేయిపట్టుకున్నది. అతడు తన వస్త్రంతో ఏమో చేయబోతున్నాడు. వెంటనే కాళిక ముందు నిలబడింది. ఆమెకు భయం వేసింది.

"ఏమిటి విపరీతం! ఇంతమాత్రానికే ఇంత విరక్తి కలగాలా!"అన్నది.

"నన్ను వదిలిపెట్టి వెళ్లు" అన్నాడు.

"వీల్లేదు. ఇక్కడ మిమ్మల్ని ఒంటరిగా వదిలితే మీరేంచేస్తారో భయంవేస్తుంది" అన్నది.

"అంతా అంధకారంగా ఉన్నది. ఇలా ఐనదని నే నెప్పుడూ అనుకోలేదు" అన్నాడు.

"కాళికాదేవి సుషుప్తిలో ఉండి మీకీవ్యమిచ్చిం"దన్నది. పూర్వస్మృతు లేవో గిర్రున తిరిగినవి అతని మనస్సులో. సుషుప్తిమాత్రమే అతనినికూడ ఈ దశలోకి తెచ్చింది.

"ఇప్పటికైనా మా అమ్మ మీకు భూతాలు చూపించిందా" అన్నది వికటంగా.

చప్పున లేచాడు. 'ఇంటికి పోదాంపద' అన్నాడు. ఇద్దరూ బయలుదేరారు. ఇంట్లో ప్రవేశించారు.

* * * * *

మర్నాడుదయం ఆ ఇంటిముందు జనమంతా మూగినారు. అంతా బూడిదతప్ప ఏమీ కనబడలేదు. ఆ చుట్టుపక్కల ఇళ్లుకూడా కొన్ని నాశనమైనవి. సుషుప్తిలో ఉన్నవాళ్లు సుషుప్తిలోకూడా లేరు. ఎక్కడనుంచీ నిప్పు బయలుదేరిందో ఎవరికీ అర్థంకాలేదు. ఎముకలుకూడా లేవు. కొందరకు బూడిదకూడా కనబడలేదు. ఆ రోజునుంచీ ప్రతిరాత్రి కాళికాదేవి అక్కడకు వచ్చి ప్రళయనృత్యం చేస్తూఉంటుందని అంతా భావించేవారు. కాళికాదేవితో ఇద్దరు స్త్రీలు, ఒక పురుషుడుకూడా వచ్చి నాట్యం చేస్తూ ఉంటారని కొందరు గమనించారుకూడా. కాని అంవరకూ అది సుషుప్తిమాత్రమే. చంద్రశేఖరానికో!



Godrej 'CHAVI' BRAND

# గోద్రెజ్ చావి బ్రాండ్

## 'టాయిలెట్' (స్నాన) సబ్బులతో

## పరిశుభ్రత, ఆరోగ్యం, సౌందర్యము.

శరీర పరిశుభ్రత వల్ల మీకు ఆరోగ్యసౌభాగ్యాలు కలుగుతుంది. పరిశుభ్రత కలిగి ఆరోగ్యవంతంగానుండే శరీరం సౌందర్యంతో ప్రకాశిస్తుంది. పుష్పములతో అలరారు తోట ప్రదేశాల స్ఫురణకు వచ్చే పరిమళము, ప్రయోజనకరమైన ప్రకృతి తైలాలూ, మూలికలతో అతి నైపుణ్యంగా చేర్చబడి తయారయిన గోద్రెజ్ 'టాయిలెట్' (స్నాన) సబ్బులు పరిశుభ్రత కలిగించి, శరీరానికి హాయి నిచ్చి, సహజ శరీర సౌందర్యాన్ని కలిగిస్తవి.

గోద్రెజ్ ఇంకా షేవింగ్ సబ్బు (స్టిక్ లేక రౌండు) కూడ తయారుచేయుదురు.

గోద్రెజ్ సోప్స్, లిమిటెడ్

మదరాసు: 164, బ్రాడ్వే; ఎర్నాకులం: 9/278, బ్రాడ్వే.

## ఉజ్జ్వలమైన సతీత్వము



పండిత డి. గోపాలాచార్యులవారి

# అరుణ

## గర్భాశయరోగ నివారిణి

అరుణ బుదుదోషములను పోగొట్టి, పరిపూర్ణ స్త్రీత్వమును ప్రసాదించగల స్వయం సంపూర్ణమగు ఔషధము. అట్టిదానిని విడువక సేవించినట్లయితే, మిమ్ము ఆరోగ్యవంతులను జేయుటయే గాక, మీ జీవన పరమావధి యగు ఆనందానందమును తప్పక యొసంగును.



ఆయుర్వేదాశ్రమం, లిమిటెడ్,
టి-నగర్.... మద్రాసు.

భారతదేశమందలి అన్ని జాతులయందువలె సిక్కులలో కూడా టీ త్రాగుట ఇప్పుడు జనాదరణీయమైన అభ్యాసముగా ఏర్పడినది బ్రూక్ బ్రాండ్ తేయాకు తాజాగా, కమ్మని వాసనకలిగియుండబట్టి సాధారణముగా ప్రతి యొక సిక్కు యింటి ఉగ్రాణములో తప్పకుండ కానవగును. కుటుంబము లోని వారికి, అతిధులకూ పేదదీర్పుటకు ఎల్లప్పుడు సిద్ధంగా నుండును.






# బ్రూక్ బాండ్

రెండాకులు ఒక మొగ్గ.

# పద్యంలో రాగం వున్నదా?



## — శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి —

పల్లెటూరివిద్యార్థిని "అబ్బీ, ఒక పద్యం చదవరా" అంటే చదవడు; పాడడము మొదలుపెడతాడు. సప్తస్వరాలూ ఒకేమారు తోసుకువచ్చే గొంతుకువాడైనాసరే, బడిపంతులుకూడా పద్యాన్ని పాడేతీరతాడుగాని చదవడు. పెళ్లిఅరుగులమీద గావంచా పరుచుకుని పడుక్కునే కుక్షింభరుడుకూడా 'భోజనకాలే గోవిందనామస్మరణ'లో పద్యాల్ని పాడతాడు. పౌరాణికుడి పక్కన పద్యపాఠము చదివే తోడుపెళ్లికొడుకు చెవిమీద చెయ్యిపెట్టుకుని పద్యాల్తో రాగాలు విసిరేస్తాడు. సభల్లో, హరికథల్లో, గొల్లకలాపాల్లో, నాటకాల్లో—సర్వత్రానూ పద్యం రాగంతో చేరే ప్రత్యక్షమౌతోంది. పద్యాన్ని పాడే ఆచారం తెలుగుదేశంలో బాగా వేళ్లుకన్నుకుంది.

కాని ఈ పాడడంలో ఒక నియమమంటూ ఏదీ కనపడదు. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు మునుపు మోహనరాగంతో పాడేవారు. నేడు మాయామాళవగౌళలో పాడుతున్నారు. కాశీ కృష్ణాచార్యులుగారు శ్రీరాగమూ, జాషువాగారు మాయామాళవగౌళా, పువ్వాడ శేషగిరిరావుగారూ, రాచకొండ నరసింహమూర్తిగారూ బిలహరీ వాడుతున్నారు. నటుల్లో కూడా ఈ తేడాలు కనపడుతున్నాయి. డి. వి. సుబ్బారావుగారు మధ్యమావతీ, అద్దంకి శ్రీరామమూర్తిగారు బిలహరీ, నిడసనమట్ల కొండలరావుగారు మోహనా, బ్రహ్మజోస్యుల సుబ్బారావుగారు సురటా, బి. వి. నరసింహారావుగారు సరస్వతీ వాడతారు తరుచు. ఒక్కొక్కరికి ఒక్కొక్క అభిమానరాగమో, బాగా ఫలిగిన రాగమో, ఏదో ఒకటే బాగానచ్చుతోంది. "ఆ రాగమే ఎందుకు వాడుతున్నారూ ?" అని అడిగితే వారు చెప్పగలిగిన ప్రత్యేకసమాధాన మేదీ వుండదు. "పద్యాన్ని ఈ రాగంలో పాడాలి" అనిగానీ, "ఈ రాగంలో కూడదు" అనిగానీ నియమ మేదీ లేదు. అంటే, పద్యం పాడే ఆచారం నియమబద్ధప్రపంచంలోది కాదన్నమాట.

ఇది కేవలం కృతకమే గాని సహజంగా ఏర్పడ్డది కాదని సులువుగా కనపడిపోతుంది. ఒక పద్యాన్ని పట్టుకుని బయల్దేరితే, ఆ పద్యానికే వీరు శ్రీరాగముద్రా, వారు బిలహరిముద్రా, ఇంకొకరు మాయామాళవగౌళముద్రా, వేరొకరు సరస్వతిముద్రా, ఇలాగ ఒక్కొక్కరు ఒక్కొక్క రాగముద్ర కొడతారు. ఎడ్రను తప్పిన ఈ త్తరముగతే పద్యానికీ పట్టుతుంది. ఇక, ఒక వ్యక్తిదగ్గిరే కూర్చున్నా మనుకోండి. అతని దగ్గిరకి ఏ పద్యం రానివ్వండి దానికి ఒకే రాగముద్ర తగులుతుంది. ఆ పద్యం కందమైనా, వృత్తమైనా, సీసమైనా సరే—అదే రాగముద్ర! అది శృంగారసంబంధి కానివ్వండి, కరుణాసంబంధి కానివ్వండి–దానికి అదే రాగముద్ర పడుతుంది! కృతకత్వ మన్నది ఇంతకంటే జుగుప్సాకరంగా వుండగలదా ?

పద్యం పాడే ఆచారం తెలుగువారిలోనే కాదు, భారతీయములైన జాతు లన్నిటిలోనూ వుంది. అంటే ఈ సంస్కృతుల కన్నిటికీ తల్లి అయిన సంస్కృతమునుంచే ఈ ఆచారము దిగుమతి అయిఉంటుందని ఊహచేయవలసివస్తోంది. సంస్కృతపండితులు కూడా శ్లోకాన్ని పాడుతునేవున్నారు. ఈ ఆచారమే దేశభాషలకికూడా పాకిఉండవచ్చు ననుకోడము విపరీతపుటూహ కాదు. అయితే శ్లోకాల్ని పాడే ఆచారం ఎలా వచ్చింది ?

సంస్కృతాలంకారికులు ఎవరూ పద్యానికి ఉపయోగించవలసిన రాగమును గురించిన జిజ్ఞాస చేయ

లేదు. ఒక్కొక్క అలంకారాన్ని పట్టుకొని దాని రూపభేదాల్ని గురించి అధ్యాయంపొడుగునీ చర్చ సాగించిన ఆలంకారికులు శ్లోకపఠనం గురించి ఏమీ ఎత్తుకోనేలేదంటే, అసలు శ్లోకాన్ని రాగముమాత్రమే చేర్చి పాడే ఆచారం ఇటీవల సంక్రమించినదే కాని ప్రాచీనం కాదేమోననిపిస్తోంది. ప్రామాణిక సంగీతవేత్తలు భరత, దత్తిల, మతంగ, నారదాదులు కూడా శ్లోకమును పాడడమునుగురించి ఏమీ వ్రాయలేదు. ఒక్క స్వరమూ, రెండు స్వరాలూ, మూడు స్వరాలూ, నాలుగు స్వరాలూ, అయిదు స్వరాలూ ఉపయోగించి పాడినవాటికి ఆర్చిక, గాథిక, సామిక, స్వరాంతర, ఔడవము లని పేర్లు పెట్టి గౌరవమిచ్చిన సంగీతశాస్త్రకారులు రాగాన్ని పూర్తిగా ఇమిడ్చి పాడిన పద్యగానాన్ని పేర్కొనకపోడము చిత్రంగానేవుంది. గీతాలూ ప్రబంధాలూ గురించి వివరిస్తూ శార్ఙ్గదేవుడు తన సంగీతరత్నాకరంలో రెండు శ్లోకాలు లిఖించాడు. అవి ఇవి:

> "వర్ణజో మాత్రికశ్చేతి కలహంసో ద్విధా మతః,
> గద్యాత్మాచేత్ స్వరాన్ గీత్వా తతః పదని
> వేశనం. (౨౮౧ వ శ్లోకం)
>
> అనిబద్ధా నిబద్ధాచ ద్విధా సా గద్య-పద్యజా,
> గాతవ్యా నియతై ర్నిత్యం గీర్వాణగణవల్లభా"

అంటే అర్థము ఇది: "కలహంస అనే ప్రబంధములో వర్ణఛందన్నూ వాడతారు, మాత్రాఛందన్నూ వాడతారు" అనీ, "దానిలో అనిబద్ధమైన గద్యా, నిబద్ధమైన పద్యమూకూడా ఉంటాయి...దాన్ని గీర్వాణగణము ప్రీతితో పాడుతునేవుంటారు" అనిన్నీ. ఈ శ్లోకాల్నిబట్టి (కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిలుగారన్నట్టు) లోకంలో వున్న గద్యఅంతా పాడవలసినదే అనడానికి వీలులేదనుకుంటాను. పాడడముకోసమే కూర్చబడ్డ కలహంసవంటి గద్యప్రబంధాల్ని పాడాలిగాని, "గద్యవంతటినీ పాడుకోవలసినదే" అన్నదే పై శ్లోకాలయొక్క అభిప్రాయ మని బుకాయించడానికి వాకు దమ్ముల చాలదు. గద్యనిమిడ్చిన పాటలకోసము శార్ఙ్గదేవుడిదాకా మనము పోనక్కరలేదు. త్యాగరాజు రచించిన "సమయానికి తగుమాట లాడే" అనే ఆరభిరత్నంలో "రంగేశుడు సద్గంగా జనకుడు సంగీతసాహిత్యలోలుడు" అని గద్య వుంది. ఈగద్యని స్వరాలు చేర్చి పాడతారుగాని వితాళముగా మాత్రం పాడరు. ఈగద్యగానీ, 'కలహంస'లోని పద్యముగానీ సంగీతానికి అనుగుణంగా తాళబద్ధం చెయ్యబడే వున్నాయి గాని మనము వ్యాసాల్లో రాసుకునే గద్యలాగ విశృంఖలంగా లేవు. ఏతావతా తేలే దిది. పద్యాల్ని (రాగముమాత్రమే చేర్చుకుని) గానీ, గద్యాన్నిగానీ వితాళముగా పాడే ఆచారము ప్రాచీనకాలంలో లేదు.

శారదాతనయుడు 'భావప్రకాశము'లో "వైతాళికులు తెరలోనుంచి తాళములేకుండా అపరవక్త్ర-వక్త్ర వృత్తాల్ని పాడతారు" అన్నాడట (డాక్టరు వి. రాఘవన్ గారు చెప్పారు). ఈ మాటల్నిబట్టి, తాళముతో పాడే ఆచారమే వాడుకలో నున్నట్టున్నూ, వితాళముగా పాడేవారికి వైతాళికులని పేరువచ్చినట్లున్నూ తెలుస్తోంది. అంటే నేటివిధముగా వితాళముగా శ్లోకాల్నీ, పద్యాల్నీ పాడే ఆచారము వైతాళికుల దన్నమాట! మెల్ల మెల్లగా ఈ ఆచారము వక్త్ర, అపరవక్త్ర వృత్తాల్నిదాటి తక్కిన (శ్లోక, స్రగ్ధరాది ఇతర) వృత్తాల్నికూడా ఆక్రమించిందేమో! శ్లోకగానాన్ని సంగీతలాక్షణికులూ, సాహిత్యలాక్షణికులూ ఆమోదించలేదు. దీన్ని ఆచారంలోకి దించినవారు తెర వెనుక ఉండే వైతాళికులు! శహబాస్. గొప్పవాళ్లనే అనుసరిస్తున్నాం!

వాల్మీకిమహర్షి కుశలవులచేత రామాయణ కావ్యాన్ని పాడించినట్లు రామాయణంలో వుంది. మూడుచోట్లగాబోలు ఈ ప్రశంస వచ్చింది. "పాఠ్యబద్ధోత్సురసమ స్తంత్రీలయసమన్వితః" అని ఒకమారూ; "పాఠ్యే గేయేచ మధురం ప్రమాణై స్త్రిభి రన్వితం జాతిభి స్సప్తభిర్బద్ధం తంత్రీలయసమన్వితం" అని రెండోమారూ; "తంత్రీలయవదత్యర్థం విశ్రుతార్థ మగాయతాం" అని మూడోమారూ కనపడుతుంది ఈ గాన ప్రశంస. మూడుచోట్లాకూడా తంత్రీలయసమన్వితంగానే పాడినట్లు చెప్పాడు ఆదికవి. అంటే తంత్రిమీటి వాయిస్తూ పాడే రన్నమాట! అంటే రాగతాళాల

కెండూ, ఉన్నాయన్నమాట. కాని రాగముమాత్రము చేర్చి లాగేయలేదు! కుశలవులు పాడిన పద్ధతి వేరూ, మనవారు పాడుతూన్న పద్ధతి వేరూను. మనవారి పద్యంపాటలో లయ ఎక్కడ ఉందీ? లేనేలేదు. కాబట్టి ఇప్పటిపద్ధతిలో నడిచే పద్యగానాన్ని సమర్థించడానికి వాల్మీకిని దింపడంలో సబబు లేదు.

అయితే వాల్మీకి చేసినది ఏమిటీ? వాల్మీకిది ఆదికావ్యం అన్న సంగతి జ్ఞాపకానికి తెచ్చుకుంటే వాల్మీకిది ఒక లాగ అర్థమవుతోంది. అంతకుముందు గానానికే ప్రాముఖ్యత ఉండేది. 'పాఠ్యేచ మధుర'మైన కావ్యం వాల్మీకిదే మొదటిది. క్రౌంచపతనం చూచి ఆయన శ్లోకాన్ని పాడేయలేదు. 'అబ్రవీ'త్రేడు! ఆ శ్లోకంలోని గతిని చూసుకుని ఆశ్చర్యపడుతూంటే, ఎవరో రావడమూ, కావ్యం రచించమనడమూ జరిగేయి. "ప్రజలు ఈ నూత్నసృష్టిని ఆమోదిస్తారో, గానముగ్ధ చాపల్యంచేత పెదివివిరుస్తారో!" అని ఆలోచించి శ్లోకాలికి లయ ఏర్పరచి, గానము చేర్చి 'గేయేచ మధురం'గాకూడా చేశాడు ఆదికవి!

అభినవగుప్తుడు భరతుని నాట్యశాస్త్రానికి అభినవభారతివ్యాఖ్య వ్రాస్తూ, పధ్నాలుగో అధ్యాయంలో ఛందోప్రశంస చేస్తూ "దోధక, తోటకవృత్తాలు పాడితే బాగుంటాయనీ, శ్లోకమూ, స్రగ్ధరా పఠిస్తే బాగుంటాయ"నీ అన్నాడట. అంటే మాత్రాఛందస్సులుపాడితే బాగుంటాయనీ, అక్షరఛందస్సులు పఠిస్తే బాగుంటాయనీ ఆయన అభిప్రాయము అన్నమాట. శ్లోకాల్ని పాడకూడదనే వెఱ్ఱి అభినవగుప్తునికికూడా వుండేది!

బాహ్యసాక్ష్యము పద్యగానాన్ని నిలబెట్టలేదు. అభ్యంతరసాక్ష్యంకూడా అంతే. కీర్తనకి రాగనిర్ణయం ఉంది. ఎక్కడో తప్పిజారి, దేవామృతవర్షణిలో వున్న కీర్తన ఒకటి ఖరహరప్రియలో ప్రచారమై పోవడము చిత్రమేగాని సదాచారము మాత్రం కాదు. ఇలాగ రాగాలు మారిపోతాయేమో అనే కాబోలు దీక్షితులవారు రాగాలపేరుల్నికూడా తమ కీర్తనల్లో బిగించారు. పద్యాలికి అలాంటి రాగనిర్ణయం కనబడదు. తెలుగు (స్టేజి) నాటకప్రదర్శనాల తొలిరోజుల్లో రాగాల పేరులు ఇమిడ్చి చాలామంది సీసపద్యాలు రాశారు. ఆసీసపద్యంలో నాలుగు పాదాలూ మంచంకోళ్ల లాగు ఒకేరీతిగానే వుంటాయి. (సామాన్యంగా అలాగే వుంటున్నాయికూడాను!) వాటికి నాలుగురాగాల్ని తగిలించడములో పాప మా కవులు, ఏదో, పాదంలోని అభిప్రాయానికి రాగాలపేర్లు కలిసి వచ్చాయని తగిలించారుగాని, ఆ పాదభావానికి ఆ రాగాలు తగివున్నాయని మాత్రం కాదు. రామ రామ! "నా ఊళ కేదారగౌళ" అని నేటి ఆధివాస్తవికకవి అన్నాడంటే, అతనికి కేదారగౌళ అంటే ఇదీ అని తెలుసునని అర్థమా. 'సంగీత' నాటకాల్లోని పద్యకాయలకుకూడ అంతే!

కీర్తనల్ని వాగ్గేయకారులు పాడుతూనే రచిస్తున్నారు. త్యాగరాజూ, క్షేత్రయ్యా, రామదాసూ తమ కీర్తనల్ని పాడేశారుగాని, సాహిత్యం ముందు కట్టుకుని స్వరములు వేరే కట్టుకోలేదు. అంటే, కీర్తనలోని రాగం అసల్లోచేరే బయటపడుతోందని నా అభిప్రాయం. కీర్తనలోనిరాగం పుట్టుకతోనేవుంది. అల్లాగే పద్యాలతో చేరి రాగాలు రావడము లేదు. వివరంగా మనవిచేస్తున్నా. ఒక్కొక్క కవి ఒక్కొక్క రాగంలో పద్యాల్ని పాడుతూన్నట్లు చెప్పేను. ఆకవికి అదొక అలవాటయిపోయి, (ఎవరో ఆంగ్లవక్త గుండీ తిప్పుకుంటూ ఉపన్యాసాలిచ్చినట్లూ మన పండితులు ముక్కుపొడుము పీల్చి శాస్త్రార్థముచేసినట్టూ) కూను రాగము తీస్తూ పద్యరచన సాగిస్తున్నాడుగాని, రాగంతో చేర్చి పద్యాన్ని ఇవ్వడంలేదు. అన్నట్టు ఈ కవులికి ఉన్న రాగజ్ఞానం ఏపాటేరాగాల్లో పద్యాలివ్వడానికి ?

రాగం రాకపోవడము కవికి న్యూనతకాదు. "కవులు కుంచెపట్టుకుని చిత్రాలు రచించగలరా? ('ఆ.' అంటున్నాడు నా పక్కన మిత్రుడొకడు. అయితే ఆ కవి కవిత్వంలో చిత్రకళా, చిత్రకళలో కవిత్వమూ వుంటుంది చూసుకోమంటున్నాను!) గజ్జెలు కట్టుకుని తాండవం చెయ్యగలరా? (నువ్వు రాసినది బాగాలేదయ్యా అంటేమాత్రం కొందరు చేస్తారుట!) అవి వేరే సంస్కారాలు. కవి నేర్పేది భావ; స్వరాలూ

గాంధర్వమూ కాదు. కవిత్వం చెప్పాలంటే గానము నేర్చివుండాలని ఎవరూ అనరనుకుంటాను. పద్యగచనా సంస్కారంలో రాగరచనాసంస్కారము లేనేలేదు. రాగము ఏమీ పాడలేని కవిసార్వభౌములలో ఉన్నంతగా పద్యరచనాసంస్కారము మరొకరికి లేదేమో. వేదుల సత్యనారాయణశాస్త్రిగారు కూడా పాడలేరు. వారి పద్యాలు రసగుళికలు! ఆచార్య రాయప్రోలు, శివశంకరప్రభృతులూ పాడలేరు. * (కొని పాడతారు. అది వినవలిసినవారి కర్మం!) కాని వారి పద్యాలు చక్కగా వుంటాయి. వేలకొద్దీ పద్యాలు రచించగల మహాకవులు పాడలేకపోవడముకంటే బలమైన సాక్ష్యం ఏముంటుందీ, పద్యరచనాసంస్కారంలో రాగరచనా సంస్కారము ఎంతమాత్రమూ లేదనడానికీ?

పద్యానికి పుట్టుకలో రాగంతో సంబంధంలేదు. రాజశేఖరుడు తన కావ్యమీమాంసలో కవిత్వావిర్భావానికి మరో వింతకథ చెప్తున్నాడు. సరస్వతీదేవి కుమారుడట కావ్యపురుషుడు! ఆమె ఆ కుమారుణ్ణి ఒక చెట్టుకింద(?) పడుకోబెట్టి ఏటికి వెళ్లిందట. అ దారిని పోతూన్న వాల్మీకి ఈ బిడ్డణ్ణి చూసి 'నీ వెవరు' అని ప్రశ్నిస్తే, "నేను సరస్వతీదేవికుమారుణ్ణి. కావ్యపురుషుడు నా పేరు" అని శ్లోకంలో జవాబిచ్చాడట. భ్రమరకీటన్యాయంగా ప్రాచేతసుడికి పద్యగతి పట్టుబడిందట! ఈ కథనిబట్టి చూచినా, పద్యంలో వున్న గతిని చూచే ప్రాచేతసుడు అక్కజపడినట్టు తేల్తుంది గాని గానప్రశంస లేనేలేదు. పద్యంలో రాగము లేదు.

* వాడు వారి కవిత్వమ్మీద ఉన్న మమత వారికి విదితమే.






[ నాటకం ]

●

# = శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి =

[ గతసంచిక తరువాయి ]

## మూడో అంకం

### మొదటి రంగం

[జైలు సూపరింటెండెంటుగారి గది. సూపరింటెండెంటు బుగ్గమీసాలతో గంభీరంగా వుంటాడు. పక్కని హెడ్డువార్డరు నించునివుంటాడు. అతనిది కొంచెం ముసలి మొహం.]

సూప—(రంపంలాటి ఓ వస్తువు పరిశీలిస్తూ) తమాషాగా వుంది పనిముట్టు! ఎక్కడది దొరికింది?

హె. వా.—వెంకడి చాపకింద! వూచలు కొయ్యాలని ప్రయత్నంకాబోలు.

సూప—వెంకడా? పాతదొంగేనేమో?

హె. వా.—కాకేం? ఇది నాలుగో మాటు జైలుకి రావడం. వొళ్లు వాయగొట్టినా లాభం లేకుండా వుంది. దెబ్బలకి అలవాటుపడిపోయాడు. ఒక్కమాటు జైలు రుచిమూస్తేసరి, మళ్లీమళ్లీ తయారవుతూనే వుంటారు!

(మాట్లాడుతూవుంటే నౌకరు ప్రవేశం. "తమరిని చూడాలని ఎవరో వొచ్చారు." అంటాడు)

సూప—ఎందుకు?

నౌక—పంపించెయ్యమని శలవా?

సూప—రమ్మను!

(నౌకరు వెళ్లిపోతాడు. మెల్లిగా అడుగులేసుకుంటూ రామయ్యప్రవేశం)

రామ—శ్రమిచ్చినందుకు క్షమించాలి. ఇక్కడున్న ఓ కుఱ్ఱాడి విషయంలో...

సూప—ఇక్కడి కుఱ్ఱాళ్లు కావలసినంత మంది వున్నారు!

రామ—నాకు కావలసింది ఒక్కడే లెండి. పేరు మోహనరావు. ఫోర్జరీనేరం. (సూపరింటెండెంటుగారికి తన విజిటింగ్ కార్డు అందిస్తూ) రాఘవయ్యగారి హెడ్డుగుమాస్తాని. రాఘవయ్యగారి పేరు వినని వారు పట్నంలో వుండరుగా?

సూప—(విసుగుతో) సరే. ఇప్పుడు నాతో మాట్లాడవలసిన పనేమిటి?

రామ—నేను అసలు ఇక్కడికి రావలసినవాడిని కాదు. కాని అతని అప్పగారు నాదగ్గిర కొచ్చి బతిమాలుకుంది. తల్లీ, తండ్రీ లేరు పాపం! ఆడవాళ్లు దుఃఖపడితే నేను చూసి వూరుకోలేను. మోహనరావంటే నాకు మొదటినుంచీ అభిమానం. నాచేతికింద పనిచేశాడు. ఓశాఖవాళ్లం...రాక తప్పిందికాదు.

సూప—అతన్ని ఎవరూ చూడ్డానికి వీల్లేదండీ. ప్రస్తుతం చీకటికొట్టులో వున్నాడు.

రామ—చీకటికొట్టులోనే ? రామరామ ! అతవలా ఒక్కడూ వుండలేడండీ. నే నెరుగుదునుగా !

నూప—మరేం ఫరవాలేదులెండి. మొదట కష్టంగా వున్నా, తరవాత అలవాటయిపోతుంది. ఈ ఖైదీల సంగతి నేనూ ఎరుగుదునుగా !

రామ—చాలా జాలేసింది మొన్న చూసినప్పుడే. ఇంకా కుర్రాడేకాదండీ. "శాంతంగా వుండవోయి" అన్నా. "శాంతంగానా ? జైలులో ఒక్కరోజు పైన సంవత్సరం పెట్టు ! ఆలోచనలతో తల బద్దలయిపోతోంది. నా ఖర్మ మింతే." అని ఏడ్చాడు. మొగాడు ఏడిస్తే ఏమి బాగుంటుంది!

నూప—పెళ్లయిందా ?

రామ—లే...దు, గా...ని...అలాటి లంపటమే మరోటుంది. అదంతా మరోగాథ.

నూప—ఊఁ. తాగుడూ, ముండా లేకపోతే జైళ్లన్నీ మూసెయ్యొచ్చును.

రామ—అవుననుకోండి...ఆ సంగతే చెబుదామనుకున్నాను. అతను మహావేదనపడుతున్నాడు. మూడేళ్లు ఖైదులో వుండిపోవాలి. ఒక్కమాటు...

నూప—వీల్లేదండి. రూల్సుకి వ్యతిరేకంగా నడవడానికి వీల్లేదు.

రామ—అతని మనస్సంతా చెదిరిపోతుందిమరి. పైగా ఒక్కణ్ణీ చీకటికొట్టులో పారేశారని చెప్పారు ! ...అయినే, తెలీక అడుగుతాను, కొట్టడంలాటిది ఏమీ జరగదుకదా !

నూప—అవసరమయితే కొట్టనూ కొట్టాలి : శిక్ష అనుభవించడానికొచ్చాడుగాని, అత్తవారింటికి రాలేదుకదా !

రామ—శ్రీ రామచంద్ర, శ్రీ రామచంద్ర! ఇహ అతుక్తాడు బతికి బయటపడే దెలాగ ?

నూప—ఇలాటివాళ్లని ఎంతమందిని చూశాం కాదండీ...విడిచిపెట్టినతరవాత ఆరునెలల్లో ఇక్కడికి మళ్లీ తయారవడూ !

రామ—జైలుతిరిఫీదు అందుకే పనికొచ్చేటట్టుంది చూస్తే. ఇదేం శిక్షండీ! మన పెంపుడు కుక్కపిల్ల నన్నా బరికిందనుకోండి. కొట్టులో పడేసి బాదుతామా ?

నూప—నేరస్థుడు, కుక్కపిల్ల కాదు, చూశారా ! మంచిచెడ్డలు తెలుసుకునే జ్ఞాన ముంది అతనికి !

రామ—కొట్టి జ్ఞానం తెప్పించగలరండీ, ఎక్కడన్నా ? ఇదిగాదు పద్ధతి...

నూప—మీకేమన్నా జైళ్ల అనుభవ ముందా !

రామ—కుక్కల్ని చూడండి. దయగా చూస్తే, ఏ పని చూపించినా చేస్తాయి. ఒంటరిగా పారేసి బాధిస్తే, క్రూరమృగాలకింద తయారవుతాయి.

నూప—జైళ్ల విషయంలో మాకు ఎక్కువ అనుభవ ముంది. ఖైదీలకి ఏది అవసరమో మాకు తెలుసు. మీరు అనవసరంగా శోక్యం కలగజేసుకుని ప్రయోజనం లేదు.

రామ—కాని నాకు ఇతన్ని తెలుసు. "ఎక్కడమ్మా నీకు బాధ" అన్నా. "నే చెప్పలేనండీ, రామయ్యగారూ ! కాని ఒక్కొక్కప్పుడు తల గోడకేసి కొట్టుకోవాలని బుద్ధిపుడుతుంది." అన్నాడు. ఏమీ బాగాలేదు వరస !

నూప—(డ్రాయరులోనించి కాగితాలు తీసి వెదుకుతూ) అతని కొచ్చిన ప్రమాదం ఏమీ లేదు. డాక్టరు రిపోర్టు బాగానే వుంది. తూనిక తగ్గలేదు. రెండుపూటలా భోజనం బాగానే చేస్తున్నాడు !

రామ—అతని మనస్సు పాడయిపోతుందేమోనని నా బాధ !

నూప—మరేమీ భయంలేదు. కొత్తగనక అప్తమానమూ విచారిస్తూంటూ వుంటాడుగాని, కొద్దిరోజుల్లో అలవాటయిపోతుంది.

రామ—అదే నా గొడవ. జైలుకి అలవాటయిపోతే, నేరాలకి అలవాటయిపోతారు. ఇంక వాగకేమిటి ?

నూప—నేరం చేసినప్పుడు ఆ సంగతి ఆలోచించలేకపోయాడూ ?

రామ—క్షమించాలి. మీతో ఘర్షణపడ్డం నా కిష్టంలేదు. వెళ్లొస్తా. శలవు. (నా. వార్డరువైపు

తిరిగి) శలవు. (అని కొంచెం దూరం వెళ్లి మళ్లీ తిరిగొచ్చి) చూడండి. ఒక్క మనవి. ఈ స్త్రీ వుండే... ఒక్కమాటు అతన్ని చూపెనిస్తే ... ఇద్దరికీకూడా పండుగ. ఈ ఒక్కమాటూ కరుణించలేరేం !

సూప—కరుణించలేమండీ, మేం కరుణించలేం. మేం దయతలచి, నేరస్థులందరినీ వూరిమీద విడిచిపెడితే ఇహ మీరు బతికినట్టే !...

రామ—వూరిమీద విడిచిపెట్టమనలేదుగా నేను ...కొంచెం దయగా చూస్తే...

సూప—దయగా చూస్తే మరీ పేట్రేగిపోతారు బాబూ, మీకు తెలీదు. జైలుసర్వీసులో నాబుర్ర పండిపోయింది. నాకు పాఠంచెబుతానంటారేమిటి మీరు ? దెబ్బకి దెయ్యం ఝుకుస్తుందండీ...ముద్దెట్టుకుంటానంటే, ముక్కంటుకుంటుంది !

రామ—(నొచ్చుకుంటూ) సరేలెండి. మిమ్మల్ని అనవసరంగా కష్టపెడుతున్నాను. క్షమించండి...(అని బయటికి వెళిపోతాడు.)

సూప—ఏం మనిషి. బొత్తిగా లోకజ్ఞానం లేదేం ?...(హె. వా. తో) అలిసిపోయా నితనితో మాట్లాడి...కాస్త కాఫీ తెమ్మని చెప్పు.

[తెర]

## రెండో రంగం

[జైలుకొట్లు. సింగిల్ సెల్సు. పక్కపక్కని మూడునాలుగు కొట్లు కనిపిస్తూవుంటాయి. ఒకదాంట్లో వెంకడు, మరోదాంట్లో మోహనరావు. యితరకొట్లలో కూడా కొట్టుకి ఒకడుచొప్పున మనుషులున్నారు.)

హెడ్డువార్డరు వెంకడున్న గదితలుపు తాళం తీస్తాడు. వెంకడికి నిజంగా నలభైయేళ్లు దాటలేదుగాని, అరవయ్యేళ్లమనిషిలా కనిపిస్తాడు. కొట్టులో అడ్డంగా పడుకునివుంటాడు. చప్పుడుకి కళ్లెత్తిమాస్తాడుకాని లేవడు]

హె. వా—ఏరా, వెంకా! మరీ పొగరెక్కిపోతోందే ? సూపరింటెంటుగారొచ్చినా కూడా లేవడం మానేశావే? (అని వెంకడిని ఒక్కతన్ను తన్నుతాడు) బయటికి రా !

వెంక—నెగనేకుండావున్నాను బాబయ్యా !

హె. వా—రోగమా ? లే !

వెంక—బొమికలు యిరగపొడిసేసినారు బాబయ్యా.

హె. వా—ఈ దొంగవేషాలకేమిట్లే? (అని కఱ్ఱతో ఒకటి కొడతాడు. వెంకడు 'అమ్మయ్యో' అని మూలుగుతూ లేవలేక లేవలేక లేస్తాడు.)

సూప—(రంపం చూపిస్తూ) ఇదేమిట్రా ?ఏమిటి కథ ?

వెంక—నానేం ఎరగను బాబయ్యా.

సూప—నువ్వెరక్కపోతే నీగదిలో ఎలా దొరికిందిరా, వెధవా ? నాలుగుమాట్లు జైల్లో వున్నావు. నిన్ను విడిచిపెట్టినా, మళ్లీ నేరంజేసి జైల్లోకొస్తావు గదా, పారిపోవాలని పాడుబుద్ధేం !

వెంక—మీపాదాలతోడు బాబయ్యా, నానేం ఎరగను !

సూప—ఇది నీ కెలా వొచ్చిందో చెప్పు! నిజం చెబితే శిక్ష కొంత తక్కువచేయిస్తా !

వెంక—నిజం బాబయ్యా ! నిజమే సెబుతుండా ! నా నేం ఎరగను.

సూప—అయితే నీఖర్మం ! పాతికకొరడా దెబ్బలు కొట్టి, చేతికీ కాళ్లకీ కలిపి సంకెళ్లు వెయ్యండి. (హె. వా. తో) తీసుకుపో వీణ్ణి.

వెంక—ఇప్పటికే శానా కొట్టేసినారు బాబయ్యా. మీపాదా లట్టుకుంటాను బాబయ్యా. ఇహ బతకను (అని సూప. కాళ్లమీద పడబోతూవుంటే ఓ వార్డరు ఒక్క తోపు తోస్తాడు. దాంతో వెంకడు 'వింగ్'లో వెళ్లి పడతాడు. వార్డరు వెంకడిని ఓతన్ను తంతాడు. "చచ్చాను బాబయ్యో" అని వెంకడు మూలుగుతాడు)

సూప—ఇలాంటి దెబ్బ లెన్ని తిన్నావో యిది వరకు. మరేమీ చావవు... పో.

(వెంకడిని వార్డరు బయటికి ఈడ్చుకుపోయాడు. దూరంనించి మూలుగుధ్వని... హె. వార్డరూ, సూప. మోహనరావున్న గదిదగ్గిర కొస్తారు. అతని గది తలుపు తీసి, అతనిని బయటికి తీసుకొస్తాడు వార్డరు)

సూప—తల గోడకేసి కొట్టుకుంటున్నావని వార్డర్లు ఫిర్యాదుచేశారు! ఏం, బుద్ధిలేదూ? తలతో రాతిగోడని బద్దలుకొట్టి పారిపోవాలని చూస్తున్నావేం?

మోహ—(వొణుకుతూ) నేనా? పారిపోవాలనా? నే నెక్కడికి పారిపోగలను?

సూప—మరి తల గోడకేసి ఎందుకు బాదుకోడం?

మోహ—రాత్రిళ్లు నిద్రపట్టడంలేదు. చీకటి పడేసరికి అన్నీ భూతాల్లా కనిపిస్తున్నాయి. "నా కీజన్మలో విడుదల కాదేమో; నే నీజైల్లో చచ్చిపోతానేమో" నన్ను భయం పట్టుకుంటోంది.

సూప—మరేం భయంలేదు. కాని జాగర్త! తల గోడకేసి కొట్టుకోడం జైలురూల్సుకి వ్యతిరేకం! ఇక్కడ డిసిప్లినుకి ఏ విధంగానూ భంగం రానివ్వకూడదు. మళ్లీ ఇంకో మాటు నువ్వు తలకొట్టుకున్నావని తెలిసిందా, నీకూ్కడా శిక్ష వెయ్యవలసొస్తుంది. తెలిసిందా?

మోహ—తెలుస్తూనేవుంది.

సూప—పో. లోపలికి పో.

(మోహనరావు 'బతికానురా జీవుడా' అనుకున్నట్టు తన గదిలోకి ఒక్కఉరుకు ఉరుకుతాడు. వార్డరు పైన తాళం వేస్తాడు. సూపరింటెండెంటూ, వార్డర్లూ మెల్లిగా నడిచి వెళ్లిపోతారు. ఒక్కనిమిషం నిశ్శబ్దం. స్టేజిమీద ఎవరూ వుండరు. పైన కొరడా దెబ్బల ధ్వని. నేలమీద కూచునివున్న మోహనరావు గాభరాపడిపోతూ లేస్తాడు. పులి బోనులో తిరిగినట్టు అటూ యిటూ తిరగడం ప్రారంభిస్తాడు. పైన మళ్లీ కొరడాదెబ్బ. "అమ్మో, అమ్మో" అని కేకలు. మోహనరావు అటూ యిటూ పరుగు ప్రారంభిస్తాడు. మళ్లీ పైన దెబ్బలచప్పుడు. "బాబోయి" అని పెద్ద ఆర్తనాదం. ఆ తరవాత పెద్ద మూలుగు. మోహనరావు ఇంక ఆపుకోలేకపోతాడు. అతని శరీరమంతా కంపించిపోతోంది. తల గోడకేసి బాదుకోడం ప్రారంభిస్తాడు.)

## నాలుగో అంకం

[ప్లీడరుగారి ఆఫీసు. సరిగ్గా మొదటి అంకంలోలాగే ఏర్పాట్లు. రామయ్య ఒక్కడూ కూచుని వ్రాసుకుంటూవుంటాడు. సుందరమ్మ మెల్లిగా లోపల ప్రవేశిస్తుంది. కట్టుకున్న చీర మాసింది; బహుపురాతనమయింది. స్థితి ఏమీ బాగూలేదని సూచించే దుస్తులు. రామయ్య తన రాతగొడవలో వుండి సుందరమ్మ రావడం కనిపెట్టలేదు. ఆవిడ కొంతసేపు నించుని, ఆయనదృష్టి మళ్లించడానికి చిన్న దగ్గు దగ్గుతుంది. రామయ్య తలెత్తిచూసి సుందరమ్మని గుర్తుపడతాడు.]

రామయ్య—నువ్వేనా? గుర్తుపట్టలేకపోయాను. చూసి రెండేళ్లు దాటిపోయినట్టుంది! కూర్చో. అందరూ కులాసాగా వున్నారా?

సుంద—ఆ. నేను ఇదివరకున్నచోట వుండడం లేదు.

రామ—కానిపని ఏమీ చెయ్యలేదుకదా!... మోహనరావుని ఈపాటికి విడిచిపెట్టేవుండాలికాదూ? నీకు కనిపించాడా?

సుంద—ఆ. నిన్న అకస్మాత్తుగా కలుసుకున్నాం!

రామ—కులాసాగా వున్నాడా?

సుంద—ఎక్కడా పనిదొరకడం లేదట. భయంకరంగా తయారయాడు. మీరేమైనా సహాయంచేస్తే...

రామ—నేనా? నే నేం చెయ్యగలను?...

సుంద—మళ్లీ ఈ ఆఫీసులో ఉద్యోగం దొరికితే.. అతన్నిగురించి మీకు తెలియనిదేమీ లేదుగా?...

రామ—(నిర్ఘాంతపోయి) ఈ ఆఫీసులోనే?

సుంద—(కన్నీళ్లుపెట్టుకొని) ఇంక ఎవరి దగ్గిరకీ వెళ్లడానికి అసలే లేదు. ఎప్పుడైనా చేస్తే మీరే సహాయం చెయ్యాలి!

రామ—ప్లీడరుగారితో మాట్లాడుతా ననుకో. కాని లాభముంటుందని తోచదు.

సుంద—నాతో వొచ్చి, పైన నించున్నాడు.

రామ—(గాభరాపడుతూ) వొద్దొద్దు. పిలిచేదాకా లోపలికి రావొద్దను. సంగతి సందర్భాన్నీ కనుక్కోకముందే ప్లీడరుగారి కంట బడితే మొదటికే మోసంరావచ్చు.

సుంద—మరిచిపోకండి. మీ మేలు మరచిపోను. (అని బయటికి వెళిపోతుంది. రామయ్య మళ్లీ రాసుకోడం ప్రారంభిస్తాడు. ఇంతలో మోహనరావు మెల్లిగా లోపలికొస్తాడు. మాసి, చిరిగిపోయిన చొక్కా. పంచెకూడా అదే స్థితిలో వుంది. పైనో పాతకుంకుమా తినొచ్చినట్టు తెలపడానికి ఓ చిన్న దగ్గు దగ్గుతాడు. రామయ్య తలెత్తి చూసి పెదివి విరుస్తాడు.)

రామ—వొద్దని చెప్పిపంపించినా, మాట వినిపించుకోకుండా వొచ్చేశావుగదా! సరేలే, రానే వొచ్చావు, కూచో.

మోహ—(భయంభయంగా ప్లీడరుగారి గదివైపు చూస్తాడు.)

రామ—ఇంకా రాలేదు. ఎలా వున్నావు?

మోహ—ఏదో ప్రాణాలతో వున్నా.

రామ—(పరధ్యానంగా) ప్రాణాలతో వున్నావూ? చాలా సంతోషంగా వుంది. ప్లీడరుగారితో నీ విషయం మాట్లాడతానని మాటిచ్చాను. నెమ్మదిమీద కార్యం కావాలి కాని తొందరపడితే లాభంలేదు.

మోహ—నాకు మరొక్క అవకాశ మివ్వండి. …లు. చేసిన తప్పుకు వెయ్యిరెట్లు శిక్ష అనుభవించాను. జైల్లో వున్నప్పుడు తూకం పెరిగానంటారు. మతిచెడిపోయినా, తూకం పెరిగితే చాలు వాళ్లకి.

రామ—నీకు అలాటి జబ్బేమీ పట్టుకోలేదు గదా, కొంపతీసి!…సరేగాని నీ కేదో వుద్యోగం దొరికిం దనుకున్నాను.

మోహ—దొరికిందిగాని, నన్ను పోలీసువాళ్లు బతకనిస్తేనా! వీళ్లు పదిమాట్లు నా చుట్టూ తిరిగేసరికి యజమానుడికి గాభరావేసి, నన్ను పొమ్మన్నాడు. దొంగని ఆఫీసులో పెట్టుకోడం ఎవరికైనా భీతిగానే వుంటుంది చూడండి.

రామ—అనవసరంగా తిట్టుకుని ఏం ప్రయోజనం…నిన్ను కనిపట్టుక వేధిస్తున్నాడోయ్…మీ వాళ్లెవరూ నీకు సహాయం చెయ్యరూ?

మోహ—మా అక్కకి ఒక రైకే కృయ. లేదనలేని స్థితిలో వుంది. రెండోదాని మొగుడు…

రామ—అవునవును. నే విన్నా…

మోహ—నే మొన్న వాళ్లింటికి వెళ్లేసరికి, వాళ్లప్పుడే భోజనానికి కూచున్నారు. నన్ను చూసి మా అక్కయ్య లేవబోయింది కాని మా బావ గుర్రుగా చూసేసరికి కూలబడవలసొచ్చింది. "ఎందుకొచ్చినట్టు" అన్నాడు మా బావ. మానాభిమానాలు చంపుకుని "భోజనానికి కూచోమనవేమోయి" అన్నాను. "దానికేం లే, మన మేదో నిర్ధారణకి రావాలి. నువ్వు నా కొంపమీదికి ఎలానూ వొస్తావని అనుకుంటూనేవున్నా. పాతిక రూపాయ లిస్తాను. తీసుకు రంగూనికి వెళ్లిపో" అన్నాడు దామకోదాత. "నీ పాతికరూపాయలూ నీ దగ్గిరే వుంచుకో. మళ్లీ నిన్ను బాధపెట్టనులే" అని వొచ్చేశాను. స్నేహమంటే అలా వుండాలండి!

రామ—(ఓదార్చినట్టుగా) పోనీలేగాని, ఆ సొమ్మే నిస్తాను, పుచ్చుకుంటావా?

మోహ—ఏం? పనిదొరికేటట్టులేదా?

రామ—నీ ఆకారం చూస్తూనే…

మోహ—వారం రోజులనించీ నిద్రాహారాలు తిన్నగా లేవు.

రామ—నిన్ను చూస్తే మా అందరికీ చాలా జాలిగానే వుంది!

మోహ—ఆ దేవుడికీ, అందరూ జాలిగా వుందని కబుర్లు చెప్పేవారేగాని నే దగ్గిర కొస్తే, ఏమయిపోతామోనని భయపడతారు, ఏం?

రామ—ధైర్యంగా వుండాలోయ్!

మోహ—చెప్పడం సులభమేనండి! చాలా అధోగతిపాలయినతరవాత ప్రయత్నించి చూడండి, కబుర్లకేం!

రామ—నువ్వేం ఏ సోమరిపోతువో అయిపోలేదు కదా! ధోరణి చూస్తే...

మోహ—(వికటంగా నవ్వుతాడు.)

రామ—నీమంచికోసమే చేశారుగాని, నీకు హానిచేయ్యాలని ఎవరి ఉద్దేశమూ కాదుగా! (అంటూ వుంటే, రాఘవయ్యగారూ, రాజారావూ లోపలి కొస్తారు. రామయ్య మొదట కొంచెం గాభరాపడతాడుకాని వెంటనే తేరుకుని)...జ్ఞాపకముందనుకుంటాను.. మన మోహనరావు...

రాజా—ఎలా వున్నావోయ్...

రామ—(రాఘవయ్యగారితో) మీతో ఒక్క నిమిషం మాట్లాడాలి. మోహనరావు! నువ్వు గదిలోకెళ్ళి కూచో అమ్మా. (మోహనరావు లేచి లోపలి గుమాస్తాలగదిలోకి వెళిపోతాడు.)

రాఘ—ఏం! మళ్లీ ఎందుకు రానిచ్చావిక్కడికి?

రామ—పాపం. చాలాబాధలు పడుతున్నాడు. ఎక్కడైన వుద్యోగం దొరికినా, పోలీసులు ఇతనివెంకబడ్డంవల్ల, వుద్యోగం వూడిపోతోంది. జైలునుంచి వొచ్చేసినతరువాతకూడా పోలీసులు ఎందుకు విడిచిపెట్టరో తెలీకుండావుంది! ఒక్కమాటు వాళ్ల నోటసులో పడితే...

రాఘ—ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు!

రామ—మనకి ఇతని సంగతంతా తెలుసుకనక, మనకి పోలీసుల భయమేమీ వుండదు. ఇప్పుడు మన కో గుమాస్తా కావాలిగా!

రాఘ—(నిర్ఘాంతపోయి) మన ఆఫీసులోనే...

రామ—మనమే సహాయం చెయ్యలేకపోతే... అతన్ని చూసేవాళ్లెవరూ లేరు ఈ లోకంలో. మాడి చచ్చిపోతాడు.

రాఘ—బాధ్యతంతా మనమీద వున్నట్టు మాట్లాడితే యెలా? నేరం చెయ్యమని మనమేమీ బతిమాలలేదుకదా!

రాజా—తొందరపాటుపడితే ఎలానాన్నా! పశ్చాత్తాప పడుతున్నాడుగా!

రామ—చేసిన తప్పుకి తగిన శాస్తిఅయింది. నిజంగా చాలా పశ్చాత్తాపపడుతున్నాడు పాపం!

రాఘ—ఇతను లేవదీసుకుపోదలుచుకున్న ఆడదేమయింది?

రామ—(బుర్ర గోక్కుంటూ) మీదగ్గిర దాపరికం పనికిరాదు. ఇంకా వుంది.

రాఘ—ఇప్పుడు మోహనరావుతోటే వుంటోందా?

రామ—వాళ్ళింటి వ్యవహారాలు మనకెందుకు? లోకంలో లక్షజరుగుతూవుంటాయి.

రాఘ—మన ఆఫీసులో పనికావాలన్నప్పుడు ఆసంగతీ మనకి కావాలి. దాని సంబంధం వొదులుకుంటేనేగాని, ఈ ఆఫీసులో కాలెట్టడానికి వీల్లేదు.

రామ—మోహనరావుని పిలవనా? మీమాట వినేటట్టు చెయ్యగలను!

రాఘ—నేనే చెబుతా. పిలు.

(రామయ్య గదిలోకెళ్లి, మోహనరావుతో తిరిగొస్తాడు)

రాఘ—(నిరుత్సాహమాటంగా) ఏమోయ్, ఇలా చూడు. మా అబ్బాయీ, నేనూకూడా నీకు మరో అవకాశం ఇవ్వాలనుకుంటున్నాం. కాని రెండు సంగతులు నీకు స్పష్టంచెయ్యాలి. లోకమంతా నీమీద కత్తుగట్టిందనే దురభిప్రాయం పెట్టుకుని బాధపడితే లాభంలేదు. నీ కేదో అన్యాయం జరిగిందన్న అనుమానం వొదులుకో. ఇష్టమొచ్చినట్టు అవినీతికరంగా ప్రవర్తించి, ఫలితం తప్పించుకుతిరుగుదామంటే కుదరదు. దాని యోగక్షేమాలు అది కట్టుంచేసుకోకపోతే ఇంక సంఘంకేసి చూసే దెవరు?

మోహ—అవును...కాని నేనో రెండుముక్కలు చెప్పొచ్చా?

రాఘు—ఊం.

మోహ—అన్నిరకాలవాళ్లూ వుంటారు. మొదటి సారిటు మమ్మల్ని కొంచెం దయగా చూసి, మా యోగ క్షేమాలు విచారించేవారి చేతికింద బెడితే జైల్లో కాకుండా, ఇప్పుడున్నవాళ్లలో పాతికమందయినా జైలుకి పోరు.

రాఘు—(పెదివి చప్పరించి) నాకేం నమ్మకం లేదు!

మోహ—(పడిన బాధలు జ్ఞాపకం తెచ్చుకుని, (ఉద్రేకంతో) నా ప్రాణం తినేసింది. నే నిదివరకటి మనిషినిగాను!

రాఘు—నీ ధోరణి మాకేం ప్రోత్సాహకరంగా లేదు.

రామ—అహహ. మాట్లాడే పద్ధతి తెలియక అడ్డదిడ్డంగా మాట్లాడుతున్నా డంటే.

రాఘు—పాతసంగతులన్నీ మరిచిపోయి, మంచి పేరు సంపాదించుకోడానికి ప్రయత్నించాలి. రెండోది: ఈ స్త్రీతో సంబంధం ఏమీ పెట్టుకోనని వాగ్దానం చెయ్యాలి. ఇదే నీ జీవితాన్ని పాడుచేసింది. ఈ లంపటం వొదిలించుకుంటేనేగాని, నువ్వు బాగుపడవు!

మోహ—కాని...ఇన్నాళ్లూ ఆవిడమీద ఆశతోటే నేను బతుక్కొచ్చాను. అదీ పోతే నేను బతికేం లాభం!

రాఘు—(కొంచెం మెత్తపడి) కష్టమేననుకో. కాని ఇలాటి ఆఫీసులో కళ్లుమూసుకుని ఏదేలా జరిగితే మాకేం అని వుండడానికి వీల్లేదు.

మోహ—నేను ఈ జన్మలో ఆవిడని విడిచి పెట్టను.

రాఘు—నీ క్షేమం కోరిన మనిషయితే, ఆవిడకే అర్థమవుతుంది! ఇంకా అధోగతికి ఈడవదు. నువ్వు పెళ్లిచేసుకోడానికి అవకాశముంటే, అప్పటిసంగతి వేరనుకో. పెళ్లికి వీల్లేదయ్యె...పెనిమిటి వున్న మనిషి.

రాజ—మహమ్మదీయమతంలో కలిస్తే సరి. విడాకులిచ్చేసుకుని వివాహం చేసుకోవొచ్చు.

రామ—తురకల్లోనే!...శ్రీ రామచంద్రా.

రాజా—తిరిగి హిందువులయిపోవొచ్చునోయ్.

రాఘు—ఆవిడనిపిలు. (మోహనరావు బయటి కెళ్లి సుందరమ్మతో కలిసి లోపలికొస్తాడు) నీతో ఓ సంగతి చెప్పాలని పిలిపించాను. మోహనరావుమీద జాలికొద్దీ అతనికి మళ్లీ ఉద్యోగమివ్వాలని వుంది. నీకు ఇతనంటే ఇష్టమేనా?

సుంద—ఆ!

రాఘు—ఇతని పురోభివృద్ధికి అడ్డుపడవుకదా!

సుంద—అవసరమయితే, ప్రాణమిస్తా.

రాఘు—అయితే ఇతన్ని విడిచిపెట్టి వెళ్లిపో. ఇదే నువ్వు చెయ్యగల గొప్పమేలు.

సుంద—(తెల్లబోతుంది.)

మోహ—నిన్ను నాప్రాణముండగా వొదలను.

రాఘు—మరోదారి లేదు.

సుంద—నాగతి ఇంతే అన్నమాట.

రాఘు— అతని పురోభివృద్ధికి నీ త్యాగం అవసరం!

(పైన అలుకుడు)

రాఘు—ఎవరక్కడ?

రామ—(సుం॥ మో॥లతో) మీరిద్దరూ లోపలికి వెళ్లండి. (ఇద్దరూ లోపలికి వెళ్లిపోతారు. వెళుతూవున్నప్పుడు, మోహనరావు తన ఖండువా మరిచిపోతాడు. అదెవరూ గుర్తించరు.)

(పోలీసు ఇనస్పెక్టరు ప్రవేశిస్తాడు)

పో. ఇ— ఇక్కడ ఇదివరకు అరెస్టయిన గుమాస్తా...

రాఘు—(ధీమాగా) ఏమిటతనిసంగతి?

పో. ఇ—ఈమధ్య కనిపించడం మానేశాడు!

రాజా—రోజూ మీకు కనిపిస్తూవుండాలా?

పో. ఇ—నేరస్థులందరి ఆచూకీ మాకు తెలిసుండాలి. ఈమధ్య ఎవరో దొంగసర్టిఫికెట్టుతో ఉద్యోగం సంపాదించినట్టు ఫిర్యాదొచ్చింది.

రాజా—అయితే?

పో. ఇ—పాతఫోర్జరీ నేరస్థుల్నందరినీ వాకబు చేస్తే దొంగ బయటపడొచ్చు.

రాజా—అంటే ఓసూటు నేరం చేస్తే ఇహ వాళ్లని నిద్రపోనివ్వరన్నమాట!

పో. ఇ—మేము చేసే దేముంది? తీసుకెళ్లి, ప్రశ్నించి, అనుమానం తీరిపోతే పంపించేస్తాముగా!

రాజా—వూళ్లో ఎక్కడ ఫోర్జరీ నేరం జరిగినా, ఇతనిమీదికి రావలసిందేనా?

పో. ఇ—మాపని మేం చేసుకోకపోతే ఎలా చెప్పండి! అతి నేమన్నా మీకు కనిపించాడా?

రాఘు—మేం ఇప్పుడు చాలా పనితొందరలో వున్నాం...తరవాత మళ్లీ కనిపిస్తే...

పో. ఇ—నేరస్థుణ్ణి దాచితే...

రాఘు—(కఠినంగా) నే నెవరినీ దాచలేదు. అనవసరప్రశ్నలకి జవాబు చెప్పగలసిన బాధ్యత లేదు.

(పోలీసుఇనస్పెక్టరుదృష్టి మోహనరావుఖండువామీద పడుతుంది. "సరేలెండి. మళ్లీ వస్తా" అని పైకి వెళ్తున్నట్టే బయలుదేరి అకస్మాత్తుగా వాళ్లున్న లోపలిగదిలోకి వెళతాడు.)

రామ—(గాభరాపడుతూ) అది గాదు దొరి... యిటు, యిటు.

(లోపలినించి "ఎవరు వారు" అని ధ్వని. అర నిమిషం అంతా నిశ్శబ్దం. మోహనరావుని చేతిలో ఇరికించుకొని పో. ఇ. పైకొస్తాడు.)

రాజా—ఈ మాటుకి వొదిలెయ్యండి!

పో. ఇ—నా కా అధికారం లేదు.

రాజా—మళ్లీ పట్టుకున్నారంటే అతని పనయి పోతుంది. జన్మాంతా ఇలా జరగవలసిందే.

మోహ—ఆ భయం లేదులెండి! మొదటిశిక్ష ఎప్పుడు పడిందో, అప్పుడే నాశనమయిపోయాను. (అని వికటంగా నవ్వుతాడు)

(పోలీసు ఇ. మాట్లాడకుండా మోహనరావుని పట్టుకుని ముందుకి సాగిపోతాడు. ఓ నిమిషం అంతా నిశ్శబ్దం. పైన "దబ్బు"న పడిన చప్పుడు. "రామరామ" అని పోలీసు ఇ. మాట వినిపిస్తుంది. రామయ్య బయటికి పరుగెడతాడు. రామయ్య, పో. ఇ. దెబ్బతిన్న మోహనరావుని మోసుకొస్తారు. బట్టలమీద రక్తం చిమ్మివుంటుంది.)

రాఘు—ఏమయింది?

పో. ఇ—కిందికి ఉరికాడు. తలకి బలమైన దెబ్బ తగిలింది.

రాజా—ఏంపని చేశావోయ్!

పో. ఇ—వెర్రితనం! పైగా-ఏమి ముంచుకుపోయింది? ఓవేళ శిక్షపడినా, ఓయేడో, రెండేళ్లో పడును. అంతేగా!

రాజా—అంతే అంటారా?

(ఈ గడబిడ విని లోపలినుంచి సుందరమ్మ బైటికొస్తుంది. ఈదృశ్యం చూసి నిర్ఘాంతపోతుంది.)

సుంద—అంతా అయిపోయింది. చివరికి చంపేశారూ?

రామ—చేతులారా నిండుప్రాణాన్ని తీసుకున్నాంగదా! మొదటే క్షమించి వూరుకుంటే ఇంతవరకూ రాకపోను.

(సుందరమ్మ కూచుని, మోహనరావుతల తన వొడిలో పెట్టుకొని ప్రాణ ముందో లేదో నని పరీక్ష చేస్తుంది. రామయ్య ఆదుర్దాగా చూస్తాడు. సుందరమ్మ పెదవివిరుస్తుంది.)

సుంద—అంతా అయిపోయింది! ఒక్క తప్పుకి ప్రాణం బలితీసుకుందే, ఏమి సంఘం! ఏమి న్యాయం!

[ తె.ర ]

# రాయలసీమ 'గడియారము'

*

## — శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి —

౧౯౪౩ సంవత్సరమునకుఁ బూర్వము 'గడియారము వేంకటశేషశాస్త్రి' యనిన పేరు తెలుఁగువారిలో వినిఁగినవారే కొందఱో. నామట్టుకు నేను వారినిగూర్చి విన్నవాఁడను గాను. ఎన్నఁడో నాపుట్టుకకుఁ బూర్వము ఆయన 'కవధానపంచానన' అని బిరుద మిచ్చి పండితులు మెచ్చుకొనిరఁట. ఆపేరైనను రాయలసీమ దాఁటిరాలేదు. మాడభూషివారు, దేవులపల్లివారు తిరుపతివేంకటకవులు ఆనాఁడు అవధానపు గారడీతో మాఱూరఁ బేరు గాంచిరి. వారిని జూచి, అందును విశేషించి తిరుపతికవులను జూచి కవిత చెప్ప నేర్చినవాఁడెల్ల అవధానము చేసినఁగాని ముక్తి లేదనుకొని ఆకళి నభ్యాసము చేసినాఁడు. అప్పటి యా తెలుఁగులోకము గతానుగతికము.

పలువురతోపాటు శేషశాస్త్రిగారును విద్యార్థులనమై పిమ్మట, సహజకవితలో మెఱుఁగులు దిద్దినతరువాత, శతావధానవ్యాయామము చేసిరి. ముత్తోకకవితోడు తీసికొనిగాని, అవధానములు సేయుట వాఁడు తప్పకర. అప్పటి యాచారప్రకారము తన గ్రన్నంట పరిసాటియగు శ్రీ దుర్భాక రాజశేఖరకవితో కలసి శేషశాస్త్రిగా రవధానముల నుపక్రమించిరి. అది ౧౯౨౦-౧౯౩౦ సంవత్సరముల నడిమికాలము. ౧౯౩౦ నుండి శేషశాస్త్రిగారికి ప్రొద్దుటూరు మునిసిపలు హైస్కూలులో పండితపదవి కుదురుపడినది. పలుగ్రంథానములు చేసినంతమాత్రమున, పాఠశాలలోఁ బండితు లైనంతమాత్రమున, అనుకరణధోరణిలో నవో ప్రబంధములు వ్రాసినంతమాత్రమున శేషశాస్త్రి గారి ప్రతిభోన్నతి తెలుఁగునకు మేలు మెఱుఁగును!— మఱుఁగకుండుటలో దానితప్పేమి!

వసంతమునఁగాని రసాలమువైపు తుమ్మెదలు వాసనఁ; కోకిలము గొంతెత్తదు. "వృక్షస్య సంపుష్పితస్య దూరాద్గంధో వాతి"— పేరుప్రఖ్యాతులకు దేశకాలములు ప్రధానకారణము.

౧౯౪౩ లో 'శ్రీశివభారతము' వెలువడినది. ఆ కృతి చూచి తెలుఁగుమహాకవులెల్లఁ దెలతెల్లవోయిరి. "ఇట్టి మహాకవి యీవఱకుఁ బుట్టలే"దని కాదు. ఇన్నాళ్లదాఁక నీకవితావసంతుఁ డేసందులో దాఁగి యుండెనని. క్రమముగా నేఁటికి గడియారము శేషశాస్త్రి నెఱుఁగని పండితుఁడు, తెలియని కవి, వినని తెలుఁగురసికుఁడు లేఁడన్నచో నమ్ముఁడు! ఆయన 'శివభారతి' కవిత సాహిత్యసభలలో గానము చేయుచున్నారు. హరికథలలోఁ బాడుచున్నారు. పురాణముగాఁ బారాయణము గావించుచున్నారు. నేను విన్నంతలో కన్నంతలో శేషశాస్త్రిగారి శివభారత మరసి శిరఃకంపము గావింపనివాఁడు లేఁడు. నేఁడు శాస్త్రిగారి యీడు అయిదవపదిలో నున్నది. శివభారత మించుమించు నాలుగువత్సరముల భారతీతపస్సు పంట. శతాబ్దుల, సహస్రాబ్దులు తెలుఁగువారి కడుపులు నిండించు రాయలసీమపంట. గ్రంథకర్తవిజ్ఞప్తి యిటు లున్నది:

"........ఈ గ్రంథరచనవలన నది యొక కవితాతపస్సు. మూఁడుపర్వముల ప్రాయముతో అరణ్యఅజ్ఞాతవాసముల సంస్కారముతోఁ బక్వమయిన భారతిగాథ అది. సోమయాజికవిత్వమున ఉత్తర గోగ్రహణముతో విధిగా నీ శివభారతిరచన యారంభమైనది. ఇంతయు ధర్మదేవతావరప్రసాదము. అప్పటి నా యితరకృతులు లోక మెన్నఁడో చదువవచ్చును. నాకవిత్వ మనుపేర నిప్పటికీ శివభారతము చాలును. ............"

ఈపలుకులు విలువఁగట్టలేనివి. శివభారతకృతి యెల్ల నొకయెత్తు. ఈ యితరములన్నియు నొక

యొత్తును. ఇది చిత్తశుద్ధిగా వ్రాసినమాట. వారి కృతి పూర్తిగఁ జదివిచూచి నాలో నే ననుకొంటిని:— "శేషశాస్త్రిగారూ! నన్నయమూర్త్యంతరమగు సోమయాజులా మీరు? కవిత్రియభారతమువలె 'జగము లున్నంతవఱకెల్ల జనులు చదివి తనియుటకు' శివాజీ ప్రబంధము రచించి శివభారత మని పేరుపెట్టుకొంటిరా! ఎంత గడుసుఁదనము! ఔను. తిక్కనభావనాశక్తి, తిక్కనపలుకుబడిసొంపు, తిక్కన కళావేత్తృత, తిక్కనరాజకీయపరిజ్ఞానము మీ రొక్కరే తక్కించుకొంటిరి కాఁబోలు! కానిచో, గ్రంథాదివిజ్ఞప్తిలో అటుల వ్రాసికొనుట కెన్నిగుండె లుండవలె?" అని.

శాస్త్రిగారు 'నాంది'లో నన్నయాదిప్రాక్తనాద్యతనాంధ్రకవుల నభినుతించినపిమ్మటఁ బ్రత్యేకించి సోమయాజి కీచంపకము కానుకనిచ్చిరి:

చ. హరిహరనాథశాంతమధు
రాకృతి లోపలిచూపునన్, బురా
చరితతపఃఫలం బుభయ
సత్కవిమిత్త్రిత వెల్గ, ధ్యానత
త్పరుఁడయి భారతాగమము
వల్కెడు తిక్కనవాక్కువెంటఁ ద
త్కరమునఁ దాండవించు వర
దాయిని లేఖిని నే భజించెదన్.

ఈ కవివరుఁడు తిక్కశర్మపలుకుఁబడి యొరవడిగ, ఒక్కొక్కయెడ నూతనభావములు మెఱవడిగ "ఉభయమార్గసమన్వయధోరణిసుగంధ్యోయముగ" భారతామ్నాయముదీటుగ శివభారతము సంతరించి 'మాతృపితృపూజాసుమప్రజంబు' చేసి కృతకృత్యుఁడైనవాఁడు. ఈ 'శివభారత'మన్నది యెనిమిదాశ్వాసముల మహాకావ్యము. మొత్తము, దీనిలో నించుమించుగ ౨౫౦౦ పద్యము లున్నవి. ఈ కృతి కుపోద్ఘాతము వ్రాసిన శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి హృదయరహస్య మిట్లు బయటఁబడినది:

"ఆధునికాంధ్రసాహిత్యమందు నాఁడు గల యల్పానుభవములో మహాకావ్య మనుపేరున కింత తగిన గ్రంథము నేఁ జూడలేదు......ఈ భారతభాష గొప్పశయ్యసొగసుతో ప్రసన్నమధురముగా ప్రవహించుచున్నది. పలుచోట్ల తెలుఁగు కింత లగువుబిగువు కలదా యని యాశ్చర్యపడునట్లు చేయు నుడికారము లిందుఁ గలవు......"

శాస్త్రిగారికి వశమైన కవితాకళ యెట్టిదో యీపద్యము స్పష్టపఱుచును:

చ. పరహిత, మాత్మనిర్వృతి య
పారయశోధన గౌరవాదివి
స్ఫురణము లందఁజేసి యిహ
ముఁ బరము స్వాలయించి మానవున్
ధరఁ జరితార్థుఁ జేయు కవి
తాకళ నావశమాటఁ బంచమ
స్వరమున నాలపించెద వ
సంతవనాంత రసాలశాఖలన్.

'శివభారతము' వసంతకోకిల పంచమస్వరాలాపము. దాని మధురిమ 'ఇదమిత్థ'మనుట వీలుకానిది. అయినను, సాహృదయుము విప్పక మానలేను.

'శివభారతము' ఆదినుండి తుదిదాఁక నొకే తీరుదీయము గల కవితలో సాగినది. గ్రంథమంతయు రస ఘుటిక. విశేషించి లుకజీ–జీజియాల సంభాషణము, దక్కనులో బహమనీరాజ్యములు, తత్పరిపాలనస్థితి, శివాజీ పునహాలో రాజ్యాంగశిక్షణము, దాదోజీచరమదశ, శివాజీచరమదశ, శివాజీకృతజ్ఞత, రామదాసదర్శనము, ధర్మోపదేశము, సయీబాయిసలహా, భవానీప్రార్థనము, శివాజీ పాదుషా కుత్తరము వ్రాయుట షాజీవిడుదల, శాజీప్రభుమరణము, శివాజీసానుభూతి షాజీమరణము, శివాజీవిచారము, శివాజీ పాదుషా కొలువున కేఁగుట, తానాజీప్రతిజ్ఞ, సింహగడము ల పట్టుట, సూర్యాజీ సింహగడము గెల్చుట, తాన నిర్యాణము, శివాజీసంతాపము, పట్టాభిషేక పూ రంగము, శివాజీ భవానికోవెల కేఁగి చేసిన విన్నపము— ఇవన్నియు బహురసపదఘట్టములు.

జాతీయపురుషులు వాడుటలో, దిక్కునిపలుక లేటికొని పాదుగుటలో, నై పువాటము లెటేఁగి పద్య ములు నడపుటలో, నడుమునడుమఁ జానకములో వి

# చిన్నవస్తువు నుండి ఎక్కువ ఉపయోగమును పొందుట

AC 9376



**సమస్య:—** తొమ్మిది అగ్గిపుల్లలతో 5 ముక్కోణములను ఏర్పరచుడు.



**జవాబు:—** అగ్గిపుల్లలను పటములో తెలుపబడినట్లు ఏర్పరచుడు. గీతగీచిన పుల్లలచే ఐదవ ముక్కోణము కలుగును.

ప్రస్తుతమందు ధరలనుబట్టి, ఆహారము, బట్టలు, విద్య విషయములో ఏదో ఒక పద్ధతి ప్రకారము కాకుండ, ఇష్టమువచ్చినట్లు ఖర్చుపెట్టుట మూలముగా కొద్ది ధనమునుండి ఎక్కువ లాభమును పొందుట సాధ్యము కాదు. కుటుంబ ఆదాయవ్యయములను తారుమారు చేయు అవసర సందర్భములకు గాను ముందుగా ఎందుకు ఏర్పాటు చేసికొనగూడదు? పట్టుదలతోను, క్రమముగాను దాచుకొన్నయెడల మీకు ఎప్పుడును నిలువధనము ఉండగలదు. ఈ దాచుకొన్న పైకముతో నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్లను, స్టాంపులనుకొనుట ఉత్తమమైన పెట్టుబడిమార్గము.

## నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్లు

### వీటివలన కలుగు ముఖ్యమైన లాభములు ఏవనగా:—

1. మీరు నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్లను 5, 10, 50, 100, 500, 1000, లేక 5000 రూపాయలకు కొనవచ్చును.

2. ఒక కుటుంబములోని ప్రతిమనిషియూ (ఈడువచ్చిన మనిషి లేక మైనరు) 5,000 రూపాయలవరకు కొనవచ్చును. ఇద్దరుకలిసి 10,000 రూపాయలవరకు కొనవచ్చును.

3. 12 సంవత్సరములలో వీటి విలువ 100 కి 50 వంతులు పెరుగును. పెట్టుబడిచేయు ఒక్కొక్క రూపాయ రూ. 1-8-0 లు అగును. ఇది గవర్నమెంటు పత్రముల మీద ఇవ్వబడు అత్యధిక వడ్డీ.

4. వచ్చే వడ్డీమీద ఇన్‌కంటాక్సు కట్టనవసరము లేదు.

5. 2 సంవత్సరములు దాటిన తరువాత వీటిని రొక్కముగకు మార్చుకొనవచ్చును. (5 రూపాయల సర్టిఫికేట్ల విషయములో 18 మాసములు దాటిన చాలును)

6. కొద్ది మొత్తములను దాచుకోగలవారు 1 రూపాయకు, 8 అణాలకు లేక 4అణాలకు సేవింగ్సు స్టాంపులను కొనవచ్చును. ఇట్లు కొనగా కొనగా, స్టాంపుల మొత్తము 5 రూపాయలైనపుడు, వాటికి బదులుగా ఒక సర్టిఫికేటును పుచ్చుకొనవచ్చును.

7. సర్టిఫికేట్లు, స్టాంపులుకూడ పోస్టాఫీసులలో గాని, గవర్నమెంటువారిచే నియమింపబడిన అధికారముపొందిన ఏజెంట్లవద్దగాని, సేవింగ్సు బ్యూరోలలో గాని దొరకును.

## మీ సేవింగ్సు గ్రూపులో మీరు ఇప్పుడే చేరండి!

యపుఁబలుకువలె సంస్కృతపదములు సంతరించుటలో, నాఁటి నేఁటి రాజ్యాంగరహస్యములు సమన్వయపఱచుటలో, ఔచితి పాటించుటలో శివభారతకవికిఁ గల జగజాణతనము మన తెనుఁగునేలలో నీనాఁడు పలుచగ నున్నదనుటకు సాహసింతును. ఉభయస్కంధముల బలిమితో సారస్వతసాగరములోఁతులు ముట్టి రసామృతకలశమును జేపట్టిన భావుకకవులలో మన శేషశాస్త్రిగారు ఒక భావుకమహాకవి. ఇందులకు శివభారతమే జెండాయెత్తి నిలఁబడును.

లకజీ తన్నుఁ జంపవచ్చినపుడు కూఁతురు జీజియా యనుచున్న మాటలు: —

కన్నుల హుంకరించి యడి
    కించెద, వాయుధ మెత్తినంటి వీ
వెవ్వరిపైన? నీయెడఁద
    కింత వివేకము చాలదయ్యెనే?
గువ్వలుఁ గూడఁ గాన్పులను
    గూరిమిఁ బెంచు జగంబునందు, నీ
వివ్వఁడవయ్య! యాదరణ
    కెక్కరె యల్లుఁడు నాఁడుబిడ్డయున్.

కనికర మింతలేని కొటి
    కాఁడవు నన్నిటు పెంచనేల? పు
ట్టినయపుడే గళమ్మును
    టించినఁ బోవదె? వెంటనంటి యి
య్యమువున వేఁటలాడ మన
    సయ్యెనె? కన్నని సుంగు మ్రింగువ
ర్తన మిది సర్పజాతికిఁగ
    దా! యొక మానవుఁ డిట్లు సేయునే?

అనురాగనిలయ నాజనని మాల్యాదేవి
    కడుపులోఁ గార్చిచ్చుఁ గవలఁజేసి
కన్నీటిబుగ్గ బుగ్గల జాఱఁ గుమిలిపో
    యెదునన్న 'జ క్లోజి' యెడఁదఁ ద్రుంచి
తల్లి యక్కల ప్రోపు తలఁగని సాంబాజి
    భావిజీవితనాశ భంగపఱచి
కమియఁగాఁగిన పండు గర్భపిండ మగల్చి
    కలుషఁగాఁకల దాలిఁ గ్రాఁగఁజేసి

యింత ప్రళయంబుఁ గలిగింప నేలనయ్య
కనికరము లేదొ! పాపసంకటము రాదొ!
కన్నతండ్రివి కావొ! యక్కసము పోదొ!
వలదు వలదయ్య పచ్చనియిలు రగుల్ప!"

(ప్రథమాశ్వాసము)

జీజియాబాయి చంటిబిడ్డ శివాజి కుగ్గుఁబాలతో, జోలపాటతో వీరచరితములు నూరిపోసినది. దాదోజి గురుత్వమున శివాజి చక్కఁగఁ జదువ వ్రాయను నేర్చి, అంకగణితము నెఱిఁగి రాజ్యాంగపు మెలఁకువలు తెలిసికొనెను. మాతృోపదేశము కరడుగట్టిన శివాజికి మతముమీఁద—దేశముమీఁద నున్నంత యభిమానము, పట్టుదల శాస్త్రముమీఁద. ఉంచకపోవుట వింత గాదు.

మ. కలఁతం జెందకు నాత్మదేశమతముల్
    గాపాడ, శస్త్రాస్త్రవి
ద్యలుఁ జాణక్యతపంబుఁ జదువు వి
    ద్వాంసుల్, మహారాష్ట్రవీ
రులు వేదాంగములెత్తియర్థముల మా
    ర్పుందీర్పు చర్చించు తా
తల తాటాకులమీఁదిగంటముల వ్రాఁ
    తల్ కోఁతలు స్మృత్తురే?

ఈ నాలుగుబంతుల పద్యములోను కవిగారికి దేశస్వాతంత్ర్య కాంక్ష యెంత కలదో వెల్లడియగుచున్నది. వేదములు, వేదాంగములు, కళలు అన్నియు నొక మెట్టు. ఆత్మదేశసంరక్షణ మొక మెట్టు. శేషశాస్త్రిగారీఘట్టమును శివాజీయై వ్రాసియుండిరి.

ఘనహోలో దాదోజి శివాజీకి రాజ్యాంగ పద్ధతులు శిక్షించినాఁడు. తత్క్రమ మిట్లున్నది:

సీ. ప్రత్యూషపవనముల్ పారాడఁ జలువలూ
    రిన వాలుకావితర్దికలయందు
ఫలితోపవనవాటికల శీతలచ్ఛాయ
    లలమిన హరితశాద్వలములందు
పరువంపు వెన్నెలల్ వాఱి చుక్కలు దేలు
    పఱపైన మేడయుప్పరిగలందు
పొగఁజోపి చిఱువత్తు లెగఁద్రోసి చమురుదీ
    పాలిడ్డ వీథిసోఫాలయందు

గీ. శిష్యగణముతో శివరాజుఁ జేర్చికొనుచు
భారతాదుల భావసంపదలఁ దెలిపి
ఘనుఁడు దాదోజి తన విమర్శనము లిచ్చి
నవ్యసాహిత్యమోఘసంతతుల నడిపె.

సీ. ఆవులించిననాఁటఁ బ్రేవు లెంచఁగ నేర్చి
నీటిలో జాడలు నెమక నేర్చి
పాలు నీరును వేఱుపఱుప నాలుక నేర్చి
కనుపాపనీడలఁ గాంచ నేర్చి
బాలెంత దెబ్బలిపాలు పిండఁగ నేర్చి
దళము లంటక తేనెఁ ద్రావ నేర్చి
యొంటిసోఁకుల విప్పి నెడలింపఁగా నేర్చి
శిలలను గిలిగింత గొలుప నేర్చి

గీ. పాత్రగుసఁగాక ప్రకృతిలోఁ బుటలువిప్పి
పదములనుగాక భావముల్ పట్టి తఱచి
యన్వయవ్యతిరేక దృష్టాంతగతుల
నరసి భావుకపండితుం డయ్యె శివుఁడు.

ఈ పద్యములలో 'నవ్యసాహిత్యమోఘసంతతులు నడిపె'—'భావుకపండితుం డయ్యె శివుఁడు' అనుటలో నెంతో యంతరార్థ ముున్నది. కవిగారి సాహితీదృష్టి కీపద్యములు రెండును రెండు కన్నులు.

సప్తమాశ్వాసమున శివాజీ పాదుషాకొలువున కేఁగినపుడు, వారి యమర్యాద సహింపక—

గీ. పాదుషా యొక్కఁ డొకమాట పల్కుకున్నఁ
గొదువ మా కేమి! తనకేమి గొప్ప కలదు?
నమ్మి కొలువున్న వారి మనంబులందు
మేలుకొనుఁగాక యీశ్వర మేలు, కీడు.

అనెను. అపుడు పాదుషా మండిపడి యెవఁడతఁ డనెను. సందుదొరికిన దని రామసింగు పాదుషాతో—

మ. అస్పృశ్యప్రాయదరీముకీవిపినస
ఞ్చారైకసంచారధీ
రమహారాష్ట్రనరేంద్రుఁ డీ యవనస
మ్రాడంచితాస్థానదు
ర్దమసమ్మర్దనిదాఘదాహలులిత
ప్రత్యగ్రధూమాయితాం
గములన్ గర్జిలసాఁగె శీతలకటా
క్షం బిందు సారింపుఁడీ!

వీరరసపరిస్ఫోరకము లైన యిట్టి దీర్ఘసమాసములు పొదులవలె నక్కడక్కడఁ బొదిగించిరి. తక్కిన పట్టుల నెక్కడఁ జూచినను జాతితెలుఁగునుడికారమే వీరి కవితలో గౌరవపదమున నున్నది.

తానాజీ సింహగడమునకు యుద్ధయాత్ర కట్టుట, కోటఁ బ్రాఁకి లోనికి జొర్బుట, అక్కడ వెనుదీయక ఘోరముగాఁ బెనఁగుట—మొదలగు ఘట్టములు పట్టిచూచినఁ దిక్కనసోమయాజి సాత్త్వికనామనస్సుకు తట్టకమానదు. తానాజీని ర్యాణానంతరము సూర్యాజీ పోరుసలుపును. ఆ ఘట్టము మఱీయు రమణీయతరము. తానాజీమరణము విని శివాజీ పలవించిన ప్రకరణము చదివి కటికవాఁడు కంట నీరిడును. భారతములో అభిమన్యువధ ఘట్ట మిట్టిది. ఇదిగో శివాజీ దుఃఖము.

సీ. పరతంత్రతాభుగ్న భారతోద్ధరణోద్య
మమున నా నాయకత్వము వరించి
యెనలేని నీసర్వసజనబలజీవి
తముల సగౌర్వపణ భావవోసి
రణరంగముల సంగరతుకతం బొంచి
కను లెప్పవోలె నన్నను సరించి
దుస్సాధతరదుర్గ దుర్గదేవశవ్రజ
పాతిమై బహుశాహవముల గెలిచి

యనుచరుండు-చమూనాథుఁ-డంగరక్షకుఁడు-బహిఃప్రాణ మనఁగ నన్ గొలుచు నిన్నుఁ
గోలుపోయినయపుడ నేఁ గోలుపోని
దొకటి యున్నదె? తానజీ! యొంటినైతి.

గీ. శివపతి యెవండు? తానజీ స్నిగ్ధహృదయ
బలముఁ ద్రావి పెంపొందిన భద్రమూర్తి
నిజము. తానజీ! యీనాఁడు నీవు లేని
శివపతి యెవండో! యొంటిలో పవలు — రేయి.

* * * * *

శా. తానా ! నీ విఁకఁ బల్కు; వీహృదయబా
ధల్ తీఱుతీరేది ? నీ
దీనానాథకుటుంబశోకదహనా
ర్తిం బాపు ప్రాపేది ? నా
పైనం బైకొను శత్రుసంహతులఁ గూ
ల్పం దెంపు పెంపేది ? య
న్నా ! నీయొక్కనిలేమి యెల్లెడలఁ దా
నైయెంత గుందించెడిన్.

శా. నా కీవంత-కాలంతపో దయిన, తా
నా ! నీవు ధన్యుండవు; వ
ట్టాకల్ లోకువ లన్నియున్ దులిపి వీ
రస్వర్గముం గాంటివి; వే
ఱైకస్థాన ముదాత్తవీరపురుష
త్యాగార్హభోగాంకమై
నీ కాహ్వనము వెస్సె; జేలుకొనుము తం
డ్రీ ! వీరభోగ్యంబుగన్.

(సప్తమాశ్వాసము)

అష్టమాశ్వాసములో శివాజీరాజు పట్టాభిషేకము, గాంగభట్టు ధర్మనిర్వచనము ఇత్యాదిఘట్టములు కవిగారి ప్రతిస్మృతి పురాణ నివిష్టమతిమత్తను స్ఫుటీకరించుచున్నవి. ఎట్టి సమ్మకాపయమైన కళగట్టించి కవితలో లలితమనోహరముగాఁ బెట్టఁగల నేర్పు తీర్పులు శేషశాస్త్రిగారి కతివేలముగా నున్నవి. నిజమునకు, శివాజీచరిత్రములో వచ్చు వ్యక్తుల కన్నిటికి కవిత కెక్కఁదగ్గ కళాశక్తి చాలదు. అయినను, వారెల్ల మన కవివసంతుని చేతిలోఁ బడి కుసుమించి పరిమళించిరి.

పట్టాభిషిక్తుఁడగు శివరాజు భవానికోవెల కేఁగి ప్రార్థించిన పద్యములలో నిది యొక్క స్థాలీపులాకము:

చ. చిఱునగ వూరు మోవి, వికసించిన చెక్కులు, సోఁగకన్నులున్
గురియు దయామృతం, బలిక
కుంకుమరేఖయుఁ జంద్రమఃకళా
పరిగతమౌళియు, న్నయన
పర్వముగా మది గోచరించి, నా

యరగలిఁ బాపు నీయభయ
హస్తమునీడ భజింతు శాంకరీ !

ఈ ప్రబంధమునకు 'భారత'మని పేరిడుటలో రెండుమూఁడు విశేషము లున్నవి. ఈ కృతి నెచ్చటఁ గాంచినను భారతగాథకు సంబంధపడిన యుపమలే కలవు. భారతస్వాతంత్ర్యసంపాదన మీ గ్రంథమునకుఁ బరమలక్ష్యము.

కిం బహునా !-శ్రీ శేషశాస్త్రిగారి జీవితప్రబంధమున శివభారతరచనము కీర్తనీయమైన కనకఖండము. దీనిని తొట్టతొలుతఁ జేర్కొనిగాని వారి చరిత్ర విషయములు మూర్కొనుటలో సొగసు లేదు.

శాస్త్రిగారు ౧౮౯౬ లో జన్మించిరి. శివభారతరచన నాఁటికి వారికి ఏఁబదికి రెండు కొఱఁత యగు వయస్సు. పదుమూఁడేండ్లు వచ్చినతరువాత 'నెమళ్ల దిన్నె'నుండి ప్రొద్దుటూరు వచ్చి, అచ్చట శ్రీ రూపావతారము శేషశాస్త్రిగారితో కావ్యనాటకాలంకార సాహిత్యము, తర్కవ్యాకరణ శాస్త్రనైపుణ్యము సంపాదించిరి. పిమ్మట వద్దెగనము వాసుదేవావధానులుగారిని సేవించి యజుస్సంహితామూలము, యజురారణ్యకోపనిషత్తులతో సప్రయోగ స్మార్తమంత్రపాఠము నభ్యసించిరి. జాతక-ముహూర్త-వాస్తు ప్రకరణములు చదువుకొనిరి. గురుకుల క్లేశము పడి సంస్కృతసాహితిలో గడిదేఱిన తరువాత, ఆంధ్రకావ్యములు చూచి, మహాభారతము పారాయణముచేసి, ఛందస్సు నెఱిఁగి, తొలిజన్మమున వలచి వెంటవచ్చిన కవితాసుందరిని గిలిగింతగొలిపి చేరఁదీసికొన్నారు.

౧౮౧౨-౧౩ సంవత్సరప్రాంతములో శ్రీ దుర్భాక రాజశేఖరకవితో ప్రకృతికవికి నేస్తము తటస్థపడినది. 'రాజశేఖర వేంకటశేషకవులు' అను జంట యేర్పడి కవితావ్యాసంగమున నుపక్రమించినారు. తపస్సున కొకఁడే యుండవలెను. అధ్యయనమున కిరువురున్నఁగాని నసిపడదు. ఈ కవకవులు ౧౮౧౫ లో బృందావనమున శ్రీగన్నవరాత్రమహోత్సవసందర్భములో జరిగిన కవిత్వపుఁబోటీలోఁ దొలిబహుమానము బడసిరి ఈ కవుల జంట విడనప్పుడు 'వీరమతీచరిత్రము' అను

పద్యకావ్యము, సీతాపహరణము, కీచకవధ అను నాటకములు సంఘటించియుండిరి. ౧౯౨౦ మొదలు ౧౯౨౮ దాఁక జతవిడక 'రాజశేఖర వేంకటశేష కవులు' పలుచోట్ల అష్టశతావధానములు చేసిరి. గుత్తిపురములో, కడపలో వీరికి సువర్ణకంకణములు కానుకనిట్టిరి. ఉయ్యాలవాడలో 'అవధానిపంచానన' బిరుద మిచ్చిరి. మఱొకచో 'కవిసింహ' బిరుద మిచ్చిరి. వేయిబిరుదము లిచ్చి నాలుగువేల సన్మానసభలు చేయనిండు-శేషశాస్త్రిగారికిఁ గల 'శివభారతకవి' అన్న బిరుదముతో సరిరావు.

శేషశాస్త్రిగారు జన్మభూమిలో నుండి పోతన వలె హాలికవృత్తిఁ జేసికొనుచు పిలుపడినపుడు పురములకుఁ బోయి యవధానములు ప్రదర్శించుచు భారవి, మల్లికామారుతము, పుష్పబాణవిలాసము తెలుఁగు పఱచిరి. హరికథలు రచించి తమ అన్నగారు వేంకటసుబ్బాశాస్త్రిగారిచే నాపరిసరమున అచ్చటచ్చటఁ గాలక్షేపము చేయించిరని వినికి. ౧౯౩౦ లో నెమ్మదిన్నె విడిచి ప్రొద్దుటూరు చేరికొని కన్యకాపరమేశ్వరీ సంస్కృతపాఠశాలలో అధ్యాపకత నిర్వహించుచు 'బ్రహ్మనందినీ' పత్త్రికకుఁ బ్రచ్ఛన్నసంపాదకత సాగించుచుఁ గాలము గడిపిరి. ౧౯౩౨ లో ప్రొద్దుటూరు మునిసిపలు హైస్కూలున ఆంధ్రోపాధ్యాయులుగాఁ బ్రవేశించి నేఁటికిని ఆ పదవియందే యున్నారు. వీరు వాస్తుజంత్రి, ఊర్మిళాలక్ష్మణము, అనర్ఘరాఘవము (ఆంధ్రీకరణము) మున్నగు రచనలు రచించిరని తెలియవచ్చెను. కొన్ని యసమగ్రములు; కొన్ని యప్రకటితములు; కొన్ని యుత్సన్నములును. నేఁటికి సంపూర్ణముగ రచితమై ప్రచురితమైనది ఒక్క 'శివభారతమే'. శేషశాస్త్రిగారి కీర్తి తెలుఁగునఁ గలకాలము నిలుపుటకీ కృతి యొకటి చాలును. ఇటీవల వారు రచించుచున్న 'శ్రీకృష్ణదేవరాయచరిత్ర' కావ్యము కూడ పూర్తియై ఆవిష్కృతమైనచో, తెలుఁగుబాస కది తొడవుపై తొడవు.



# అభిసారిక



= శ్రీ చెఱుకుపల్లి జమదగ్ని శర్మ =

[ఒకనాటి రాత్రి వెన్నెల్లోనూ, వెన్నెల పోయిన తరువాతా గోదావరిని చూచినప్పుడు —]

సిగపూదండలు చల్లు వెన్నెలలకున్ శ్రీగంధసంవాసనా
భుగభుగ్భోగములీ, న్నదంతసుషమా పూరంబు పారంబు వో
వగ వక్త్రంబు మునుంగ బాల, లతికా వ్యామోహ సమ్మోద పా
రగ దేహావృత శారదాంబరము జారన్ దారి నిల్లొంటిమై.

పోయెద వేడకో ముసుగుపోయిన దన్నదె చూడబోవు సం
దో యిది పెద్ద మార్గమొ యదో యది యెంచవు, వక్రరీతి నీ
రేయి పదంబు లెట్లు పడద్రిప్పెన నట్టులె; మందయాన వ
య్యో! యెటు నెట్టెదో తుద కయోమయ మయ్యెడి దీర్ఘయానమున్.

నీ యనురాగవాహిని జనించిన పావనభూమినుండి ని
మ్నాయత సీమలం దొరలునట్టులు నీహృదయమ్ము పొంగులై
చాయలుకట్టి కోరికల చాయలు, వెన్నెల చాలు, మల్లెపూ
దీయని తావిచాలు నయి దిద్దెను నీ నడయాడు త్రోవలన్.

ఈ యభిసారికాచరిత మెంతయు వింతగ దోచు లోకమం
దేయెడ గామినీమణు లభీష్టవరప్రదమూర్తులైన త్యా
గాయత హృత్సనాథ పురుషాళులకై చరియింత్రు కాని, వా
క్కాయములన్ జగద్ధితముకై పయనింతురె యెన్నడైననున్.

భవదగాధ హృదంతరాస్వాదనీయ - సాంద్రమధురానురాగ భాస్వన్నవాంశు
జాలముల వోని చంద్రికా జాలములను - మేను గుండెయు సర్వమ్ము మిళితమయ్యె!

**నీవు సుధాంశుపూరమున నిల్చి, కనుంగవ మోడ్చి, నాథు సం**
**భావన సేసినంత బరిపాండురమయ్యె భవచ్ఛరీర, మా**

శావధి దోచె దిక్కులు, సుహాసము బర్వె నభోంతరమ్ము, గో
పీ వివృతాధరోష్ఠములఁ వేణువు నూదె కషాయకంఠుడున్.

వెన్నెలలలోన నీహృది వెల్గువెల్గి - నిన్ను జేయును నవ్యచంద్రికల పాయ;
చీకటులలోన నీహృది లోకమెల్ల - నీవు లేవనునట్లుగా నిన్ను మార్చు.

అసితాంభోదము లంతరంగమున నాహ్లాదమ్ము పొంగించియున్
ముసుగై కప్పిన నీలశాటి బలిమిన్ పోద్రోయగాలేక, తా
మస వేణీభర మాశ్రయించి, యటనున్ మార్గంబు లేకుండుటన్
మసృణేందీవర లోచనద్వయిని సమ్మానించు దృక్కాంతులన్.

కనగా నేర దిదంప్రయత్నముల లోకంబెల్ల నీదారి, పో
యిన స్రోవం గని దుస్తరం బనుచు పోనేపోదు, నీవో! వినూ
తన మార్గాంతర సంయమత్వరిత సత్యప్రేమ భావోదయ
ప్రణానైక్యంబున గన్నుమూసికొని సంరక్షింతు వీ లోకమున్.

ఏవిభు పొందు గోరి చరియింతువొ నిత్యము వాడు నేడు నీ
కై వినువీధి కెక్కి కరమందున దివ్యయబూని కన్ను పో
ద్రోవల గాంచుచుండె, ననురూపసపర్యల జేసి, ఓసి! గో
దావరి! మెప్పునొందు మిట దాపరికమ్ము వృధాగదా యికన్.



# ఆంధ్రాభ్యుదయము - లలితకళలు*

= శ్రీ సురభి నరసింహం =

"శ్రీ పరాత్పరునినుంచి మానవుడు పొందే ఆవేశము యొక్క భావికానువాదమే కళ!" అని 'ఎరిస్టివు' ప్రవచనం. భగవంతుని ప్రతిబింబమైన ప్రకృతిలో ఏదో ఒక దృశ్యమో, భావమో గోచరించి, రసజ్ఞుని హృదయంలో ఒక కళాశక్తి పైకుబికి స్వరూపం దాలుస్తోంది: ఆ స్వరూపం ఒక ఆనందమయసృష్టి; ఆసృష్టి భాషాస్వరూపం అయితే కావ్యం, వర్ణప్రయుక్తం అయితే ఒక చిత్రం, ఒకమూర్తి దాలిస్తే శిల్పం, నాదమయం అయితే ఒక గీతం, అంగవిక్షేపమయితే నాట్యం అవుతుంది. ఈ సంగీత-కావ్య-శిల్ప-చిత్ర-నాట్యాలనే "లలితకళలు" అని వ్యవహరిస్తున్నాం. "లలితకళ"లనేది "Fine Arts" అనేదానికి అనువాద మనే అనుకోనక్కరలేదు. "గృహిణీ సచివ స్సఖీ మిథః ప్రియశిష్యా లలితే కళావిధౌ" అని రఘువంశకారుడు; "లలితే సుకుమారే-కలానాం గీతానాం-విధౌ అనుష్ఠానవిషయే-ప్రియశిష్యా" అని మల్లినాథసూరివ్యాఖ్య ఉండడంవల్ల, లలితకళాశబ్దం చాలా ప్రాచీనం, మన సొంతం అనడంలోనే ఔచిత్యం ఉంది!

## మానవుడు- లలితకళలు

కృషి, పశుపాల్యం, చౌర్యం మొదలైన అరువదినాల్గు కళలకంటె ఈ లలితకళలు భిన్నమైనవి; అవి లోకానికుపయోగమైనవి; ఈలలితకళలు మనోహరత్వం ప్రధానంగా కల్గినవి, ఇవి వేరు. సౌందర్యం కాంక్షించనివా రుండరుకదా! అందుకే మానవుని సంస్కృతి, నాగరికత, నానాట అభివృద్ధి అవుతోన్న కొలది, అందచందాలమీదికి (Fashion) బుద్ధి ప్రసరించింది: కేవల నివాసంకోసం, గుహలలోనో, ప్రూనుల్లోనో ఉండే నాటి మనిషి నేడు ఎంత పూరిగుడిసె కట్టుకున్నా, నాకొంప "తాజమహలు" లా ఉండాలి అని అంతరంలో కాంక్షిస్తాడు. చలిబాధ పోవడం కోసం నాడు ఆకో అలమో చుట్టపెట్టుకొనే మొరటులు, నేడెంత సాదాసుద్ద కొనుక్కున్నా "రంగులదా" "పువ్వులదా" "కలంకారీ అద్దకమా" "కాశ్మీరశాల్వా" అంటూ ఎంచుకొంటున్నారు! ఒకప్పుడు దారీ తెన్నూ లేని తెలుగుభాష ఇప్పుడు "దేశభాషలందు తెలుగులెస్స", "The Italian of the East" అని కితాబులు సంగ్రహించింది. కుక్కానక్కల వికృతారావాలు రసవత్తరంగా మారి, నాజూకైన పాటలు వచ్చాయి; ఈ సంగీతం శృంగార-భక్తి- వీరాలతో కలిసి, జావళీలు, కీర్తనలు, సైనికవీరగేయాలు పుట్టి అత్యంతోపయోగం అవుతోంది. తప్పెటాగి తందనాలాడే కోయనాట్యం, నేటి నాగరికుల పెళ్లివారి నడకలు, ప్రతీవ్యవహారంలోను- కదలికలోను "పోజు"గా (Pose) మారి తీర్చి దిద్దబడింది. ఇలా మానవుని దైనందినచర్యలన్నిటిలోను అందము, ఆనందము కారణంగా ప్రతీవస్తువు,—అరివేణికుండల మీది రంగురేఖలు, రకరకాల బుట్టలు, దారాల అల్లికలు, మంచిమంచి బొమ్మలు, నగలు నాణాలు, దుస్తులు, ఆటపాటలు శిల్పస్వరూపం దాలుస్తోంది. లౌకికకళలన్నిటిలోను మానవుని సహజలలితకళోపాసన తేటమరుగుగా కనిపిస్తోంది. మానవునితోపాటు లలితకళలు, లలితకళలతోపాటు మానవుడు పెరిగివచ్చేడు. కాలక్రమంలో మానవుడు లలితకళాస్వరూపాన్ని గుర్తించి, లౌకికోపయోగితనుండి దానిని వేరుపరచి, దాని కొక ప్రత్యేకత కల్పించి, విగళితవేద్యాంతరమైన ఆనందాన్ని, అంటే పార

---

* ఇది గడచిన డిసెంబరులో శ్రీ శ్రీపాద బ్రహ్మణ్యశాస్త్రిగారి అధ్యక్షతను జరిగిన రామచంద్రపురం- ఆంధ్రాభ్యుదయ-లలితకళాగోష్ఠిలో చదివిన వ్యాసం.

వశ్యమైన హాయిని పొందడం మొదలుపెట్టేడు. కళానిర్మాతలు బయలుదేరేరు. రాజుల ప్రాపకంకోసం తమతమ లలితకళాప్రజ్ఞలు రుచిచూపించారు; రాజులామోదించేరు. రాజపోషణవలన కళాతత్పరత హెచ్చింది. రూపభావానుకరణలు మూలపదార్థాన్ని సమీపించాయి; నకళ్లను అసళ్లుగా భ్రమింపజేసే శక్తి శిల్పకారులకు వచ్చింది; కనులు "అవును" అనేదాన్ని మనస్సు "కాదు" అనేలా భేదకంత్రం నేర్పేడు చిత్రకారుడు. ఇక్కడే అనుకరణప్రజ్ఞ కొక చిన్నకథ:—

## అనుకరణ శక్తికి కథ

ఒకప్పుడొక రాజుగారిచ్చే బహుమతికోసం, నలుగురు చిత్రకారులు వారివారి కళోపాసనాబలం అంతా వినియోగించి బొమ్మలు వ్రాసేరు. ఒకడు గులాబీపూగుత్తి రచించి రాజుగారి దగ్గర పెట్టిన కొద్దినిముషాలకే, దానిమీదకు తుమ్మెదలు ఝుంకరిస్తూవచ్చాయి; "సెబాస్" అన్నాడు రాజు. రెండవవాడు "ద్రాక్షగుత్తి" బొమ్మ వేసి రాజుకి కొంచెందూరంలో పెట్టేడు. "అక్కా, అక్కా" అంటూ చిలకలు వచ్చి పటంపైన రెండుపోట్లు పొడిచి రివ్వున ఎగిరిపోయాయి. రాజుగా 'హోహోహో' అని ముసిముసి నవ్వేరు; మూడవవాడు తాను చిత్రించిన కుక్కపటాన్ని గొలుసుతో కట్టి ఉన్న రాజుగారి కుక్కకు చూపేడు; అది "భౌభౌ" రావం చేయడం మొదలుపెట్టింది; ఇదంతా చూస్తూ, పాపం, నాలవచిత్రకారుడు వినమ్రంగా కూర్చుండిపోయాడు. ఇది చూచి రాజు, "తనబొమ్మ 'నాసి' కాబోలు; ఇత డిల్లా డీలగా కూర్చుండిపోయేడు" అనుకొని, కొంచెం హెచ్చరికగా "ఏదీ నీబొమ్మ? ఈయవేం?" అన్నాడు. అతడు చేతులు జోడించి, కొంచెందూరంగా చూపి, "ప్రభూ! ఏలినవారి పవిత్రహస్తాలతో ప్రారంభోత్సవం చెయ్యాలి; ఆ తెర ఒత్తిగించాలి: అంటే Opening Ceremony చేయాలి; ఆవెనుక నాబొమ్మ దృశ్యమౌతుంది!" అన్నాడు. ఆబొమ్మెంత బాగుందో, చప్పున చూడాలి-అనే తహతహతో రాజు తక్తు దిగి నడచి తెర ఒత్తిగించాలని చెయ్యి చాచేడు. అంత గతుక్కుమని వెనక్కి విరగబడి, "ఇది తెరగాదు, బొమ్మ!" అని నిశ్చేష్టుడైపోయేడు. ప్రక్కచిత్రకారులూ నివ్వెఱబోయి, రాజుమోజు యెలా తిరిగిపోతుందో అని కలవరపడుతున్నారు. అప్పుడు రాజు "వారివారి బొమ్మలు కీటకాలను, పక్షులను, జంతువులను భ్రమపెట్టాయి; నీ 'తెర' అధికజ్ఞానసంపన్నుడయిన మానవునే భ్రమింపజేస్తోంది; కనుక బహుమతి నీది!" అన్నాడు.

## లలితకళలలో భిన్నత్వ-ఏకత్వములు

ఇలా మానవుని ప్రతిభావ్యుత్పత్తులు అనుకరణశక్తితోపాటు మిన్నుముట్టి, కళానిర్మాణం జరగడం మొదలుపెట్టింది. లలితకళలయొక్క ప్రభావం రాజులూ, ప్రజలు గుర్తించారు. కళలో ఉండే అనుకరణశక్తి యెంతటి మూఢునికిని జ్ఞానోదయం చేస్తుంది; యెంతటి తెలివరిని మోసంచేస్తుంది; ఆబాలగోపాలానికీ తన్ను తాను తెలుపుకొంటుంది; రాజస-తమోగుణాలిని నశింపజేస్తుంది; శాంతంగా, సత్యంగా, శీఘ్రంగా, శాశ్వతంగా ప్రజల హృదయాలమీద పనిచేస్తుంది; ఇది విశ్వజనీనమైంది. ఆయా ద్రష్టలకు, శ్రోతలకు వేనాదవేలమందికి-మత్తుమందు చల్లినట్లు విద్యుత్ప్రవాహంలాగ, ఏకకాలతన్మయత కలిగిస్తుంది; అనుభోక్తల సంఖ్యనుబట్టి భోజనపదార్థాల్లాగ-ఇది తరగదు సరికదా, పైపెచ్చు కర్తకు గౌరవాధిక్యం చేస్తుంది. అస్త్రశస్త్రాల్లాగ, 'ఆటం' బాంబులాగ ప్రపంచనాశనం చేయదు-ప్రబోధం చేస్తుంది; చైతన్యం కలిగిస్తుంది: కనుక, దీనిని కేవలం ఆనందంకోసమే, వినోదార్థమే కాకుండా "మనజాతియొక్క రాజకీయ మత సాంఘికాభివృద్ధికి, మనజాతి కళ్యాణానికి ఏల ఉపయోగించుకోకూడదు?" అనే ప్రశ్నగుర్తు కొడవలిలాగ మానవుని హృదయఫలకంలో ఒకప్పుడు నిలిచింది! ఇది కారణంగా, అంధరాజాదరణఫలితంగా ప్రతిభావంతులైన శిల్పులు, చిత్రకారులు, కవులు, గాయకులు, నటులు బయలుదేరేరు. చేతఉలి దాల్చేడు శిల్పబ్రహ్మం! "ఏ విగ్రహాన్ని కావలిస్తే దానిని, ఏ భంగిమంలో కావలిస్తే అలాగు సంపూర్ణ స్వరూపంలో అనుకరించే ప్రజ్ఞ నాది; ఒక్క ప్రాణం

మాత్రం పోయ్యాలేనే!" అని నిట్టూర్చేడు. ప్రాణమే పోయగలుగుతే, "గారాబుకూతురైగా కానిపని చేయు వనజ సంభవుని నెమ్మనమువెలితి" మన శిల్పికి యేర్పడునేమో? వెనకటికి, 'సైప్రసు' దేశంలో "పిగ్మేలియను" అనే శిల్పి స్త్రీవిగ్రహాన్నొకదానిని అత్యంత మనోహరంగా తయారుచేసి, ప్రాణం లేకపోయిందే అని విచారించి, 'వీనస్'—అంటే మన రతీదేవివంటి దానిని ఆరాధించి, ఆలోపంకూడా పూర్తిచేసుకొన్నాడు! తీరా ప్రాణం పోశాక, తన విగ్రహాన్ని తానే మోహించేడట! - అంటే దీనినిబట్టి అనుకరణశక్తి శిల్పి కెక్కువ అని తెలుస్తోంది. ఇంక చిత్రకారుడు కుంచె చేతబట్టి, "శిల్పికంటె నేనే ఘనుడను! అతడు అనుకరణంలో పూర్ణుడైతే అనుకరణక్షేత్రంలో నేను భాగ్యవంతుణ్ణి; అత డేకైకవిగ్రహాన్ని తయారుచేస్తే, నేను దానికి తోడు దానిశోభ కుపాంగాలైన చెట్టుచేమ, సెలయేరుకొండల కౌగిలింత, ఆ కౌగిలిని తొంగిచూచే చందమామ మొదలైన వైవిధ్యం చూపుతా" నన్నాడు. ఇంక కవి అంటాడూ "నీ అనుకరణక్షేత్రమెంత, నీ వెంత? నా విహారోద్యానం అపరిమితమైనది; అది ఈ లోకంనుండి సర్వలోకాలకూ వ్యాప్తమైనది; అంచేత నా అతిథులకు మనోనేత్రం విప్పి, చిటుకకాలంలో సర్వలోకాలూ త్రిప్పి పరమేశ్వరునికూడా చూడగలిగే యోగసమాధిలో నాతోపాటు ముంచెత్తుతాను; చూడు నాతడాఖా!" అని కలం కదిల్చేడు! ఇక గాయకునిమాట—"ఎంత కష్టపడతారయ్యా! లేనిపోని కష్టం: అపారమైన అనుకరణక్షేత్రాలట: దానిలో సుఖదుఃఖనిరూపణట. తాము అనంతకాలం కష్టపడుతారట; ఎదుటివారిని కష్టపెడతారట; అబ్బా! ఈకష్టం, దుఃఖం అనేవే మాకు తెలీకిరావు! మేము కళాబొద్ధులం: అంతా శాంతిమయం, సంతోషమయం అయినది కావాలి: మేము కుంటీ, గ్రుడ్డీకూడా ఆనందించి తరించే ఉపాయం చూపుతాం. మావిహారంలో కష్టంలేదు: అసలు కష్టమే లేదు; విహారశ్రమ అంతకంటే ముందే లేదు.—ఒక్కమాటుగా, ఉవ్వెత్తుగా, ఇక్కడ ఆనందతరంగిణిలో ముంచితే అక్కడ ఆ ఆనందమయమూర్తిసన్నిధిని చేరడమే కాదు, వానిలో లీనంకూడా అయిపోతారు. మానవుడొక్కడే అన్నమాటేమిటి? క్రూరమైన పాములు చిత్రంగా పడగలువిప్పి నిలబడిపోతాయి; పులులు శిలావిగ్రహాలైపోతాయి; శిలలు ద్రవిస్తాయి; మోళ్లు చిగురిస్తాయి; ఇలా వినండి" అని శ్రుతిలో కంఠం కలిపేడు! ఆపైని నటరాజు—"ఎందుకోయి వారితో పైసవాల్? ఓహో, శాంతగాయకా! అందరూ కలిసిమెలిసి ఉంటేనే దేశ సౌభాగ్యం; ఆనందప్రపూర్ణత! కుంటి, గ్రుడ్డి, మూగ—అందరూ ఏ కొంచెమో ఆనందం పంచుకోవాలి. యేలోపం లేనివారు పూర్తిగా "హాయి హాయి!" అని సంబరపడాలి; నీ వెక్కడో ఉండే పరంధాముని దగ్గరకు వీరిని తీసికొనిపోవడం కాదు; ఆ పరంధాముణ్ణే యిక్కడ సాక్షాత్కరింపజేయాలి; సామాజికులను నీపాటి కష్టం పెట్టను: మీరందరూ నా కాప్తబంధువులు; మీరు నాతో చెట్టపట్టాలుపడితే "ఇదిగో తాండవరుద్రుడు, ఇదిగో మురళీకృష్ణ, ఇవిగో హర్షవిషాదగ్లానాదిచిత్తవృత్తులన్నీ నాముఖంలో ప్రతిఫలింపజేస్తా. చేతనాచేతనా వస్తుసముదాయభంగిమాలన్నీ నేనొక్కడనే నిరూపిస్తానుకూడా, చూడు!" అన్నాడు!

## లలితకళల లోకోపయోగిత

ఇల్లా కవిగాయకశిల్పిచిత్రకారనటాదులు లలితకళాదేవతను చేయిచేయికలిపి ఆరాధించడం మొదలుపెట్టేరు. ఆంధ్రరాజులుకూడా ఈ కళాప్రపూర్ణుల్ని తమతమ మతప్రబోధంకోసం, ప్రచారంకోసం ఉపయోగించడం మొదలుపెట్టేరు. ఈ లోకోపయోగిత, ఈ కళాప్రయోజనం కనిపెట్టి మొదట అమలులోనికి పెట్టినవారు బౌద్ధరాజులు. "Art is the weapon of the people" అనే చట్టోపాధ్యాయ ప్రవచనాన్ని వారు నాడే గ్రహించేరు! వారికి మనం తరతరాలా ధన్యవాదాలు సమర్పించాలిందే! వారు స్తూపస్తంభాల్లో, చైత్యవిహారాల్లో బౌద్ధగాథలు, బౌద్ధసాంఘికచిత్రాలు, బౌద్ధాశయాలూ శిల్పచిత్రరూపకంగా, చిరస్థాయిగా ఉండేలాగ నిర్మింపజేశారు. వారు త్రొక్కిన త్రోవనే వెయ్యేంతలు రాజమార్గంగా మలిచి హిందూరాజులు బహుముఖంగా, బ్రహ్మాండ

గుహలు దొలిచి నాట్యశక్తిని ప్రతిష్ఠాపించారు. వీరు పల్లవులను జయించి తూర్పున చోళులతో విరుద్ధాలంది దక్షిణమున తమ ప్రాభవం పెంచి, చాలా బలిష్ఠులై - నాటనాట ఆ మిశ్రమ సంస్కృతి సంపన్నమైన శిల్పం కుంభకోణం, చిదంబరం మొదలైన దక్షిణ పట్నాలలో నాటేరు. వీరు మొదట జైనులు - తర్వాత శైవులు. కనుక జైనశిల్పంలోంచి శైవశిల్పం శిల్పశాస్త్రబద్ధంగా, ఆంధ్రసంప్రదాయ ప్రయుక్తంగా నాట్యచ్ఛాయలతో ఒక ప్రత్యేకత దాల్చి, రాజమహేంద్రవరం, దక్షారామాది పంచారామాలు, సింహాచలాది క్షేత్రాలలో ఉచ్ఛస్థితిలో వెలిసింది గాంగులు ఈకాలంలోనే, కోనారకాలో దేవాలయమంతా ఒకేరథంగా, గుర్రాలతో సహా, అపురూపపు సున్నితాన్ని చూపుతూ ఉండేదాన్ని వెలువరించారు.

## తదితరశిల్పాలు

తరువాత పాలంపేట, హనుమకొండలలో రస ప్రవాహంలో మునకలెత్తే "కైశికీవృత్తి స్వరూప"మైన లలిత తిలలిత శిల్పకళను, రాజపుత్రశిల్పాన్ని మించిన దానిని, కాకతీయులు తమ రాజ్యమంతా పండించి వేశారు; మనోహర దేవాలయాలు ప్రసాదించారు.

ఇంక రాయలయుగంలో వెలిసిన శిల్పం ఉత్తమోత్తమమై, వస్తువిన్యాసరచనలో, శిల్పసామర్థ్యంలో 'నభూతో న భవిష్యతి' అనిపించుకొన్నది. నేడు భూగర్భంలోకి ఒరిగిపోయింది...! హంపీశిథిలాలు చూచే ఆంధ్రుడు కన్నీటి కాల్వల నాపుకోగల ధీరుడైతే నేటికీని ఎల్లోరాగంభీరిమ, ఓరుంగల్లులాలిత్యం, చాళుక్యకళాచమత్కృతి, ఆయాచోట్లకు పోనక్కరలేకుండా ఈశిథిలాల్లోనే చూడవచ్చు. మహాబలిపురఘట్టాని ఉన్న విరూపాక్షరథం; హనుమకొండ-సహస్రముంటపం, హంపీలో స్తంభగానం చెయ్యడం, కృష్ణదేవుని తులాస్తంభనిర్మాణం, రాజు స్నానం చేసే కమలాకరం, సార్వభౌమభవనం, గణేశుని గుడి, పంపాపతిగుడి, హజారరామునిగుడిలో చక్రవర్తిసింహాసన శిలావేదికాశిల్పం - ఇవన్నీ చూడవచ్చు.

తల్లికోట విజయనగరానికి సమాధికల్లికోట అయినాక (౧౫౬౫) రాయల సేనానాయకులైన "నాయకులు" తంజావూరు, మధుర, రామేశ్వరం, శ్రీరంగం మొదలైనచోట్ల గుడులు బ్రహ్మాండంగా కట్టి చోళ పాండ్యశిల్పానికి వన్నె పెట్టేరు. తిరుమలనాయుడు చేయించిన మధురవిమానం ఈయన ఏకశిలానిర్మిత రాజభవనం. ఒక్క మేకుకాని, కఱ్ఱకాని లేదట!— అద్భుతం!

కాకతి విచ్ఛిత్తిపిమ్మట విజయనగరప్రథమార్థం గజపతులు కొండవీడు - రాజమహేంద్రవరరాజ్యాలలో కాకతి - చాళుక్యశిల్పాల్ని బోధించి దేవాలయాలు వృద్ధిచేసేరు.

## ౨

ఇంక చిత్రలేఖనం—

శాతవాహనలనాడు అజంతాగుహలు నిర్మించి చిత్రించినవారాంధ్రులు! "'అజంతా' అంటే, ఆది అంత - 'అవ్యక్తా' కాదుకదా!" అని కె. టి. షా గారు చమత్కరించారు. అజంతా ఉత్తరఆర్యులకు, దక్షిణద్రావిడులకు కూడలి; ఆర్యద్రావిడ నాగరికతా సమ్మేళన మందిన ఆంధ్రులవే అచ్చటి చిత్రాలు! ఈరోజున ప్రాంగణాల్లు గా ఉంటాయి. అజంతా చిత్రలేఖనాన్ని పాశ్చాత్యులు వివిధంగా మెచ్చుకొన్నారు. "The artists who painted there were giants in execution" అని గ్రిఫిత్సుగారి ప్రశంస! దేవాలయనిర్మాణం, చిత్రలేఖనం జంటగా ద్విపదపంక్తులలాగ పెరిగాయి.

శిత్తన్నవాసల్ జైనగుహలలో పల్లవచిత్రలేఖనచ్ఛాయలు అజంతాసమలాలిత్యంతో నిలిచియున్నాయి! ఎల్లోరాచిత్రలేఖనం, అజంతాకనుజాతమైనదానిని, రాష్ట్రకూటకృష్ణ నిర్మిత కైలాసాలయంలో కానవచ్చు.

కాకతిచిత్రలేఖనం క్రీడాభిరామంలో ఈవిధంగా అభివర్ణితమై మాత్రమే ఉంది. గోవిందమంచన శర్మ టిట్టిభసెట్టితో యీ క్రిందివిధంగా అంటాడు.—

"కోలదాపునఁ గ్రొక్కొటిఁ గూడియున్న
గచ్చుచేసిన చిత్రింపు గద్దెపలక
వ్రాసినా రదె, చూడరా; వైశ్యరాజ !
శిల్పబ్రహ్మకు వీర నాశిరచరిత ! "

ఆనాటికే (౧౫ వ శతాబ్దిమన్యకు ముసుపే) ఓరుగంటిలో ఒక పలనాటి వీరుల ఆలయం-ఆ ఆలయంలో ఆయావీరుల చిత్రములూ ఉండి, "పలినాటి వీరపురుష, పరమదైవతిశిపలింగభవనవాటి!" వెలిసిందా! ఇంక మాచర్లం "ప్రతాపరుద్రపురణీకోపాత్త గోష్ఠీప్రతిష్ఠాపారీణ" ప్రవేశించిన చిత్రశాల "చిత్తజుని శౌర్య మెఱిగించు చిత్రశాల"యట !

రాయలకాలం నాటి చిత్రలేఖనం అజంతాకు కొంచెము తీసికట్టయినా - ఒక వైశిష్ట్యం కలిగి, లేపాక్షినగరంలో దేవాలయపు గోడలమీద కన్పడు తుంది.

## నేటి చిత్రకళ

నేడు మన ఆంధ్రభూమిలో శ్రీ దామెర్ల రామా రావుగారు చిత్రకళయందు ఒక నూతనశకం స్థాపించి మెఱిసిపోయేరు ! అవనీంద్రనాథ సంప్రదాయం అను సరించి కొందరు, బొంబాయిలో 'సాల్మన్' గారి సంప్రదాయాన్ని కొందరు, ప్రమోదకుమార చటోపాధ్యాయు ని సంప్రదాయాన్ని శ్రీ అడివి బాపిరాజుగారు, గుఱ్ఱం మల్లయ్యగారు వగైరా కొందరు అవలంబించి అద్భుత కళానైపుణ్యం చూపుతున్నారు; ఇంకా వివిధ పట్టణాలలో పోషకాభావాన్ని తృణీకరించి స్వయం పోషకులై, కళాధిదేవత నారాధించేవారు శ్రీ దుర్గ కరపు పర్వేశ్వరరావుగారివంటివారున్నూ ఉన్నారు.

## 3

ఆంధ్రశిల్పమైన అజంతాచిత్రాలలో వీణా మృదంగాది వాద్యా లుండడం, పాలంపుత్రిక-బృహత్కథలలో వాద్యవిశేషాల వర్ణన లుండడం, ఘంటశాల ... కొట్టూటాస్థానంలో ఆంధ్రపల్లవరాజులనాటి "కుడిమి యామలై" పర్వతశాసనంలో సప్తస్వరాలు, శ్రుతులు, కాకలి నిషాదముల ప్రశంస ఉండడం—సంగీతకళ ఆంధ్రుల కనాదిసిద్ధమయినదికాని, ఎక్కడో వెలువునొన్నది మాత్రం కాదని ఋజువుచేస్తోంది. ౧౬ వ శతాబ్దిలో కాతిగ్నాట, లేక కర్ణాటసంప్రదాయం స్థాపించి, విద్యానగరరాజుల కొలువు నలంకరించిన "స్వరమేళ కళానిధి" సంస్కృతగ్రంథకర్త రామామాత్యుడు; రాజమహేంద్రవాసి 'రాగవిబోధ' అని జన్య-జనక రాగవిభజన చేసిన ప్రథమాంధ్ర సంగీతగ్రంథకర్తగా వాసి గొన్న సోమనార్యుడు (౧౬౦౯); విజయరాఘవ నాయని కొల్వున విరాజిల్లి, తుందిలామృతబిందువులు చిందించే మువ్వగోపాలపదాలు రచించిన క్షేత్రయ్య; పరమభాగవతోత్తముడై ౧౮ వ శతాబ్దిని శ్రీరామసాక్షాత్కారంతో మహిమాన్వితం చేసిన త్యాగరాజు—మన కర్ణాటసంప్రదాయ సంగీతమహాదేవాలయానికి ఈ నలుగురూ నాలుగు స్వర్ణగోపురాలుగా తత్జ్ఞులు పరిగణిస్తారు ! ఇంకను వీరి బాణీ లలవర చుకొని వాగ్గేయకారులనిపించుకొన్న శార్ఙ్గదేవుడు, అహోబలపండితుడు మొదలైన ఆంధ్రులు-విశేషించి అక్బరుపాదుషాచేత సగౌరవంగా ఆహ్వానింపబడి సంగీతంలో 'దసిల్లాహి'వంటి సర్వసమ్మత సంగీతగ్రంథము రచించిన పుండరీకవిఠల్- లెక్కకు మిక్కిలి ఉన్నారు. నేడా సంగీతమహాలయానికి ప్రవేశ ద్వారం మన ద్వారం వెంకటస్వామినాయుడుగారు!

## ४

ఆంధ్రులు నాట్యంలో చాలా గట్టివారండీ ! వట్టిమాటలుకావు. ఇల్లా అజంతాచిత్రాలే యోగ్యతాపత్రం యిస్తున్నాయి. నందికేశ్వర విరచితమైన 'అభినయదర్పణం' తెలుగుల సొమ్ము. మనకు "కూచిపూడి" లాగ దక్షిణాదిని "ఊతుకూడి" అనే గ్రామంలో మన తెలుగు నాటకాలే నటించే భాగవతు లున్నారట ! (మన అరవసోదరులు ఊరిపేరుపహా అనుకరించేసేరండీ !) కంకంటివారి ఉత్తరరామాయణంలో—

సీ. "అభినయంబులు కోపు[1] లరదైశీరుపుల్
వెలయగా 'పదచాళి '2 విధ మొకర్తు

1. నాట్యముతీర్పు. 2. నాట్యభేదము (పెక్కణము)

లాగు మైసిరియు, బల్లటియు,3 కత్రియు4 చెక్క-
విలసిల్లు "జక్కిణి"5 విధ మొకర్తు
బుఱుకడు చంక బంగరు బుట్టి తగుజాతి
వినికిగాఁ 'గొరవంజి' విధ మొకర్తు
తీవఁ దాళము లుగ్గడింపుచోఁ దీరుచో
వింతగాఁ 'పేరణి'6 విధ మొకర్తు
నవరి విరిసింపఁ బతి మెచ్చునంత నేర్ప
రిరువు గనమంత్రము బరియూరుపరుపు ముప్ప
దిద్ద రరువదినలువురు హెచ్చుగాఁగ
బంతులై వంగులూని అయ్యంగులెల్ల."

ఇందులోని నృత్యపరిభాష, 'కోపు' 'పదచాలి' 'పల్లటి,' 'కత్రి', 'జక్కిణి' 'కొరవంజి' 'పేరణి' వగై లర్లాఉండగా, హల్లీసకాది నృత్యభేదాలు చేసేరట సీతారాములు-ఉద్యానవిహారము చేస్తూన్న సమయంలో. ఆ పారిభాషికపదాలు మన కిప్పా డర్థమవునా ?

## నా ట కా లు

ఇంక మన నాటకాలకు ఆదిపీఠాలు తోలుబొమ్మలాటలు, వీధినాటకాలు, యక్షగానాలున్నూ. తూర్పుఇండియావర్తకసంఘంవారు మొదట బొంబాయిలో ఆడిన నాటకాలు చూచి, పారశీకనాటకాలు, వాటి ననుకరించి నేటి మన తెలుగునాటకాలు వచ్చేయి. నేటి 'సినిమాలోకం' మన నాటకకళాలోక నాశనకారి కాదా ?

## ఆంధ్ర లలితకళల వలనలు

ఆంధ్రుల లలితకళాప్రథ తమ దేశపు పొలిమేరతో ఆగిపోలేదు. ఆంధ్రరాజుల ప్రతాప మెందాక వ్యాపించిందో, అందాక లలితకళలూ విజృంభించాయి! లోత్తుంగచోళుడు దక్షిణాదిని చిదంబరాది దేవాలయాలలో ఆంధ్రశిల్పం ప్రాకించాడు; (నన్నయభట్టారకరచిత భారతం-కూడా ఆన పితరుల నిధిగా దక్షిణాదికి గొంపోయి చూపకుండునా ?) కాకతీయుల శిల్పం మైసూరులోని 'హాళేబీడు'లో వలసస్థాపించుకొంది; ౭-౧౧ శతాబ్దులమధ్య నంబూదిరీ లను తెలుగు బ్రాహ్మణులు మలయాళం వలసపోయి, అచ్చటివారికి తెలుగుల 'కథకళీ' నాట్యకళ భిక్షపెట్టేరు; చాళుక్య కాకతీయశిల్పకళ, నాగరికత, సంస్కృతి జావాలోని బరూబదూరులో, బలిద్వీపంలో, ఇంకా ఇతరవలసలలో అలుముకొంది. "తెలుగురాజులు రేవురేవుల మెనసి లంగర్లు దింపినదినా"లలో తోలుబొమ్మలాటలు కూడా వారితో లాగుకొనిపోయి, వాటిద్వారా తమ తమ సంస్కృతిని అచ్చటి ప్రజలకు అందించేరు కాబోలు! జావాలో నేటికిని ఆ ఉపకళ 'గామేళా' పద్ధతిని అభివృద్ధిఅయిఉందని వింటున్నాం.

## లలితకళల అధ్యాపనదశ

ఇట్లు దేశదేశాల మన లలితకళాజ్యోతి తన చల్లనికాంతులు వెదజిమ్మ, తాను పుట్టిన చోటమాత్రం క్రీనీడలు పర్వుతోందా ?— నేడు మచ్చుకైనా, మందులోకైనా శిలా-దారు-లోహ-శిల్పం మన తెల్గునాట కానరాదే! ఇంక, చిత్రలేఖన సాంప్రదాయాలు వివిధమైపోయి, "ఎవరికి వారే యమునాతీరే" అన్నట్లున్నాయే ! —అయా చిత్రకళానిపుణులంతా కలిసి, సంప్రదించుకొని, ఏకైకాంధ్రసాంప్రదాయాన్ని సృష్టిస్తే ఆకళలో ఆంధ్రలోకప్రత్యేకత చారిత్రాత్మకం అవుతుంది; నన్నయభట్టు నిర్మించిన కవితోద్యానం యుగయుగాల రకరకాల సువర్ణకుసుమాలు పూచింది. నేడాంధ్రవిశ్వవిద్యాలయంపుణ్యమా! అని-చెప్పకండి-ఇంకా సజీవంగానే ఉంది; కాని యింకా పోషణ, దోహదం తగినంత లేదు ! సంగీత-నాట్యాలకు తెలుగుభూమి పుట్టిగడ్డ కాని తమిళకం తెలుగుల సంస్కృతి దాచుకొనే 'మ్యూజియం' అయిపోయింది!

అయితే-ఈ లోపాలన్నీ తీరి "ఆంధ్రాభ్యుదయానికి లలితకళ లేవిధంగా తోడ్పడేటట్లు చెయ్యాలి ?" అనే సమస్య ఒక్కటే మిగిలింది! ఈ సమస్యాపరిష్కారభారం ప్రభుత్వంమీదా, ప్రజమీదా కూడా ఉంది! మనకు ప్రత్యేకం ఆంధ్రలలితకళా

3. జక్కిణి సాధనవిశేషము. 4. 'జక్కిణి'-ను ఆటయొక్క ఒక అంగము. 5. ఒక దినుసుఆట. పేరణి-భాండోపరినృత్యము.

శాలలు కావాలి. అవి విశాలలక్ష్యాలమీద, ఆకర్షణీయ పద్ధతులమీద నిర్మాణం కావాలి: ఇందుకు ప్రత్యేకం ప్రత్యేకాంధ్రరాష్ట్రము కావలె. రాష్ట్రంలేక ఎన్నో లలితకళానిధులు అప్పుడే అదృశ్యమైపోయాయి; ఊరుకుంటే యింకా మాయమైపోతాయి. అయితే, రాష్ట్రం వచ్చేదాకా మనకు విశ్రాంతి అని కాదు. ప్రజలశక్తి విజృంభిస్తే రాష్ట్రం తనంత సాక్షాత్కార మవుతుంది. అసలైనరీతిగా ప్రజలశక్తి వర్ధకమయ్యే పనులు విద్యార్థుల చేతుల్లో ఉన్నాయి. ఊరూరా రామాలయాలున్నట్లే గ్రంథాలయాలు, చిత్రశాలలు లేవాలి; పండితులు, ఉద్యోగులు పల్లెటూళ్లు చేరాలి; ప్రజలలో విద్యాభివృద్ధి - విజ్ఞానాభివృద్ధి కావాలి: ఇందుకోసం ఎప్పుడో నిర్బంధపవిద్యాభిక్ష ప్రభుత్వం పెట్టేదాకా ఊరుకోవడం కాదు. మన ప్రాచీనసంస్కృతి నిధులైన ఉపకళలన్నీ పునరుద్ధరణ కావాలి! ప్రజాప్రభుత్వపురోజులు కనక నిజంగా ప్రజాజ్ఞానోదయానికి, ప్రజలకు తోడ్పడే మార్గాలు అన్వేషించాలి. నేటి బుఱ్ఱకథావృత్తాల్లో, యక్షగానాలకీ, తోలుబొమ్మలాటలకీ గతికవితలో, భాష పల్చగా, భావం సుగమంగా, స్వభావంగా, రంజకంగా ఉండే లాగ, యిప్పటి చరిత్రసమస్యలు గ్రామీణులకు ప్రబోధం కావాలి; మన దేశం పల్లెలమీద ఆధారపడిఉంది కనక, వారికి కావలసిన వెన్నెన్నో "క్రొత్తసీసాలలో ప్రాతపానీయాలు" అన్నట్లు విద్యార్థులు క్రొత్తదనం సృష్టించాలి. మన పెద్దపులిఆటలు, పీర్లవేషాలు, పగటివేషాలు, గొల్లసుద్దులు, భాగవతాలు, విప్రవినోది వీథిగారడీవిద్యలు పెంపొందాలి! క్రొత్తక్రొత్త ఊడుపుపాటలు, పెళ్లాడే బొమ్మపాటలు, ఆటపదాలు, సెమ్మ - రామభజనలు - వీటినన్నిటిని క్రొత్త దేశీయ గాథలతో వెలువరించేటందుకు పూనకోవాలి! నన్నయ్య "జగద్ధితంగా" భారతం తొలి వ్రాయలేదా? తిక్కన్న భాషావిప్లవం తెచ్చి తెలుగు పలుకుబడికి ఒరవడిగా కైత చెప్పలేదా? మధ్యయుగంలో ద్విపదకవిత మొలకెత్తిన దెందుకు? ప్రజలను శివభక్తింపచేటందుకే! ఆ ఏకవీరాదేవికథ, ఆ పరశురామవిజయం, ఆ మాహూరమ్మ - కామేశ్వరీకథలు జాతర్లలో ఉపయోగించేటందుకే వెలిసినాయి. అంచేత కవి రాజ్యం నిర్మించాగలడు; నాశనమూ చేయగలడు; పెంచనూగలడు. ఇందుకు పూర్వగాథలే ప్రమాణాలు. కనక కవితాది లలితకళలలో అభిరుచి పరిపగా నిరూపణ అయితేనే మన జాతిసభ్యత చిరస్థాయిగా ఉంటుంది. దానికి ప్రభుత్వప్రోత్సాహంతో పాటు ప్రజల కేలూత కళాభిజ్ఞులకు కలగాలి! ఆనాడే సర్వతోముఖమైన ఆంధ్రాభ్యుదయము!



మహాంధ్రోదయము
బద్ధముగా

# 1946వ

పూర్తియయిన కొత్త వ్యాపారము

# 5·70

రూ॥ కోట్లు మించినది

# 1945వ

లో 5·50 కోట్లు

# నేషనల్

ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్

7, COUNCIL HOUSE STREET, CALCUTTA

మద్రాసు బ్రాంచి: నేషనల్ ఇన్సూరెన్సు బిల్డింగు,
362, చైనాబజారు రోడ్డు, ఎస్ప్లనేడ్, మద్రాసు.
సబ్ ఆఫీసులు: బెంగుళూరు మరియు మధుర.

N.I.F-705

# లంకాదహనం



= శ్రీ ఖండవిల్లి లక్ష్మీరంజనం =

ఎవరోహో! ఎవరోహో!
అమావాస్య నడిరాతిరి
లంకాపురి నిష్పంటించిరి
భగ్గుభగ్గు మంటలూ
గుప్పుగుప్పు పొగలరవలు
ఆకాశమందు యెఱ్ఱమంటలూ
పాతాళమందు నీలిమంటలూ
ఉత్తరాదిమంటలూ
దక్షిణాదిమంటలూ
తూర్పుదిక్కు జ్వాలలూ
పడమటిదిక్కు కీలలూ
వాడవాడ మంటలూ
యింటయింట మంటలూ
మంటలంటె మంటలా
మృత్యుదేవి కంటికెంపులా
ఎవరోహో, ఎవరోహో.

సీత

ఏమి చేయుదాననూ
ఎవరు తోడుగాననూ
ఒంటరికత్తెకు సాగునా
మంటలార్ప బూననా
ఊరక ఊరక మిన్నకుందునా
మా-అయోధ్య మిథిల కాదటందునా

రాక్షసులైతే మంట కాల్చదా
రాక్షసులైతే మంట పేల్చదా
బలములేని చేతులూ
అబల రెండు చేతులూ
ప్రళయవహ్ని భయదసంభ్రమూ
విలయకాల జిహ్వాచాందమూ
పారమంట యీదునా
మధ్య మున్గిపోదునా
జనకరాజ తనయనా
వెనుకముందు చూస్తానా
మంటలార్ప లేక ముగ్గిపోనా
ఆహుతగుటకంటె అందముండునా
ఎవరోహో! ఎవరోహో.

ఎవరానవ్వులు ఎవరానవ్వులు
ఎవరాకిచకిచలూ, గుసగుసలూ
పెండ్లియిల్లువోలె సందడైన లంక
సంజజిలుగువెలుగు చక్కనైన లంక
అగ్నిపరిష్వంగంబున నాక్రందించి
కాలి కమరి కుమిలి కన్నులు మూయగ
లంకాదహనంబున శంఖము లూదుదురా
లంకకాడు వెట్టి రాజ్యము లేలుదురా!
ఎవరోహో! ఎవరోహో.

### హ నుమంతుడు

అమ్మా అమ్మా జానకమ్మా
భూమిపుత్రిక, పుణ్యరాశి
అంజనసుతుడను - వందనమమ్మా
నవ్వుచు కేరుచు నాట్యంసల్పే
సమయం యిప్పుడు సంతసముడిగి
విన్నబోయిన చిన్నమోముతో
చింతాహూనము దాల్చితి వెందుకు
అదుగో అదుగో అక్కడ జూడుము
కన్నులపండువు కాంచగరాదా
లంకానగరము నిప్పంటించితి
వాయుదేవుడూ - పూజ్యపాదుడూ
కొడుకుపనికి కుమ్మకుఅయినాడూ
వానరమిత్రులు వార్ధిని యీది
పంజరబంధము లంకకు గట్టిరి
పోతుటీగా బయటికిపోవదు
మిన్ను మన్ను మంటలు లేచెను
రాక్షసమూకల భక్షణసేయును
అవుగో అవుగో! ఆవులు లేగలు
తోకమట్టలు మీదికి యెత్తి
అంబా యనుచు ఆర్చుచు గెంతగ
మంటల మధ్యకు గెంటుదురమ్మా
రాక్షసవనితలు వక్షములదరగ
చంటీ వెంటీ సందిట నిదుకొని
బెదరి చూచుచు కుమిలి యేద్చుచు
పారిపోవగ కట్టి త్రోతురు
మగువలముందర మగలను గూల్తురు
మగలముందర మగువల గూల్తురు
మేలీముసుగులు చించివైతురు
కుంకుమబొట్టులు కొంకక తుడుతురు
తాళిబొట్టులు త్రెంచివైతురు
గాజులు బందులు ముక్కలుచేతురు
కోమటి కోమటి ముల్లె తెమ్మని
నెత్తిమొత్తి నేలకు దెత్తురు
మేలు భళా! మేలు భళా
వానరవీరులు - వానరధీరులు
రాముని పగను సగముతీర్చిరి
సీతాశోకము సగముమాన్పిరి
ఎవరోహో, ఎవరోహో.

### సీ త

పాపము పాపము పవనతనయుడ
ఘోరము ఘోరము కూడదు తండ్రీ
రామచంద్రుడు కరుణాసాంద్రుడు
నిరపరాధుల నీఱుగ గాల్చున
సత్యసంగరుడు చాటున పొడుచున
నిత్యశాంతుడు పగ సాధించున
రాముని దండము - రావణు దండమేనా
రాముని కోపము ధర్మకవచము
రాముని శోకము లోకము నవ్వ
రాముని దైవము ప్రజలుకారా
లంకజనములు రాముని ప్రజ కారా
రాముని పూజ ప్రజల కొల్చుట కాదా!

తనువు నల్లనైతే తప్పా తండ్రీ
మనసు నల్లనైతే మరి మాన్పవయా
తనువుగూల్చిన ధర్మము నిలుచున
తనువుగాల్చిన ధర్మము మొలచున
పందిరి నేలవ్రాలినా పాదు ప్రాకునయ్యా
పాపము గూల్చి పాపి నిల్పవయా

పచ్చని లంకను బూడిదచేసిన
మచ్చదేహాము మైథిలి కెందుకు
చిచ్చు దూకికొందూ
మెచ్చు స్వర్గపు పొందూ
ఎవరోహూ, ఎవరోహూ.

హనుమంతుడు

రామకుటుంబిని జానకితల్లి
లోకమాతవు ప్రేమరూపిణివి
తప్పులు కావుము తనయులమమ్మా
హింసను పుట్టి హింసను పెరుగుదుము
ద్వేషపు వహ్నుల రోసపునేతిని
ఆహుతిచేసెదు అజ్ఞులమమ్మా
చిచ్చుల నార్పగ చితుకుల వేతుము
శత్రులకొరకు కన్నీ రొల్కెడు
కరుణామూర్తివి ధరణీపుత్రిక
సజ్జనశోకము ముజ్జగహాని

ఒక్క బొప్పము ఉర్విని వ్రాలిన
అగ్నులు మూడును అప్పుడె యడగును
అరుగో అరుగో వానరవర్యులు
తప్పును తెలిసి తాపము చెంది
ఏతామెత్తి సంద్రము తోడి
మంటల నార్పిరి లంకను నిల్పిరి
సీతాశోకము చిత్రముసల్పెను
వానరరాక్షసవైరము లుడిపెను
గర్భశత్రులు గాఢమిత్రులు
ఏడ్పు లుడిగెను నవ్వులు చెలగెను
పొయ్యిలో పిల్లి లేచెను లంక
ఆవులు కురిసెను అందరు త్రాగిరి
భూమి యీనెను బువ్వ లందరకూ
ఎవరోహూ – ఎవరోహూ

అమావాస్య నడురాతిరి
లంకాపురి నిష్పంటించిరి.





# వెలుగునీడలు

[కథానిక]

●

'అమరేంద్ర'

"మీ నాన్నని వాకిట్లో అరుగుమీద పడుకోమని చెప్పండి. ఇదుగో ఈ చాపా, దిండూ కూడా యిచ్చిరండి." అంది సరళ. ఈ మాటలు వినే సరికి శ్రీధరకి కోపంతో చురుక్కున చరిచిన ట్లనిపించింది. భార్యమాటలు తండ్రికి ఎక్కడ వినపడ తాయో అని, బదులు చెప్పకుండా, చాపా, దిండూ చేత పుచ్చుకుని మెట్లుదిగిపోయాడు. భార్యమాట యేకవేళ తండ్రికి వినబడితే ? తను ఏముఖంతో తండ్రికి ఎదురు పడతాడు ? ఇంత ఇల్లూ, ఇన్ని గదులూ, ఇన్ని మంచాలూ, ఇన్ని పరుపులూ వుంటే తన తండ్రిని వాకిట్లో అరుగుమీద ఒంటిచాప పరుచుకుని పడుకోమని చెప్పటానికి నోరెల్లా వస్తుంది! సరళని తను పెళ్ళాడి నాలుగేళ్ళు దాటింది. ఈనాలుగేళ్ళలో తండ్రి తన యింటికి రావటం యిదే మొదటిసారి. మొదటిసారే సరళ మామగారిని ఈవిధంగా సత్కరించదలిచింది. తలుచుకోగానే శ్రీధర ఆపాదమస్తకమూ కంపించిపోయాడు. తన ఇంటికి రాకరాక వచ్చిన తండ్రిని పరదేశిలాగా వీధి వాకిట్లో పడుకోమని ఏముఖం పెట్టుకుని చెబుతాడు ? ఈ సత్కారాన్ని చూసి తండ్రిమనసు ఎంత నొచ్చుకుంటుందో! పోనీ, ఎవరైనా నౌకరుచేతి కిచ్చి చాపా, దిండూ పంపితే ? అప్పుడు తండ్రికి తనమీద మరీకోపం రావచ్చు. ఆయనమనసు మరింత కష్టపడవచ్చు. పెళ్ళిలో తనకు జరిగిన అగౌరవాన్ని మనసులో పెట్టుకుని ఇంతకాలమూ కొడుకుయింటిగడప తొక్కలేదు. అంత అభిమానం గల మనిషి. అటువంటి మనిషి యీనాటికి చుట్టపుచూపుగా యింటికి వస్తే ఇంట్లో చోటులేనట్లు వీధివాకిట్లో పడుకోమని పురమాయించటమా ? ఇంతమాత్రం తెలుసుకోలేకపోయిందా సరళ? తెలిసి చేయాలనే చేసింది. ఆవిధంగా పురమాయించటంలో తన వంశంమీదా, తనవారిమీదా ఆమెకున్న నిరాదరణని వెల్లడించింది. అతని గతజీవితమంతటినీ ఆమె అగౌరవించింది. ఆమాటల్లో వున్న అనాదరం శ్రీధరగుండెల్లో పరాభవజ్వాలల్ని రగిలించింది.

ఒక్కొక్క మెట్టూ దిగుతుంటే ఏదో పాతాళంలోకి దిక్కుతెలియని చీకటిలోకి అణగారిపోతున్నట్లనిపించింది. మోయలేని బరువుతో కుంగిపోతోంది శ్రీధరమనసు. తీరా దిగి కిందికి వచ్చేసరికి తండ్రి కనబడలేదు. 'నాన్నా' అని పిలిచాడు. మారులేదు. చుట్టుపక్కలంతా కలయజూశాడు. జాడలేదు. సరళ మాటలు ఆయనకి వినబడినయ్యేమో ? వినటంతోనే అభిమానం వచ్చి వెళ్ళిపోయాడేమో ? ఎన్నడూ గడప తొక్కని మనిషి యింటికి వస్తే చేయవలసిన సత్కారమిదేనా ? పోనీ, సరళకి మర్యాదచేయటం తెలియదా? తెలియకేం ? మొన్న వాళ్ళ మేనమామ వస్తే ఎన్ని ఉపచారాలు చేసింది! ఎంత రాజభోగంతో ఆయన్ని గౌరవించింది!! ఏఅతిథి వచ్చినా ఎంతో ఆదరిస్తుంది. అటువంటి సరళ తన తండ్రిని ఈవిధంగా చూడటం దేనికి ?

కారణం శ్రీధరకి వెంటనే స్ఫురించింది. శ్రీధర అంతరాళంలో బడబాగ్ని జ్వాలలు భగభగ రగిలినయ్.

అవును. అందుకే. అదే కారణం. అవును. ఆవిషయం ఎన్నోసార్లు మాటిపోటీమాటలతో చెప్పనే చెప్పింది. ద్వేషాన్ని ఆమె ఎన్నడూ దాచలేదు. తన మాటలవల్ల భర్తగుండెల్లో ఎటువంటి మంట అంటుకున్నా, ఎటువంటి తుపాను చెలరేగినా ఆమెకి భయంలేదు. ఈ విషయంలో భర్తమనసుని గాయపరచటంవల్ల సరళకి ఆనందంకూడా కలగవచ్చు.

లేకపోతే సరళ ఇంత బహిరంగంగా ఎందుకు నిరాదరణని వెల్లడించాలి? అక్కడికికాని ఆమెకి తృప్తి కలగదుకాబోలు. అక్కడే చతికిలపడిపోయాడు శ్రీధర. తండ్రికోసం ఎదురుచూసిచూసి నిరాశ చెందాడు. ఆయన వెళ్లిపోయాడేమో ననుకున్నాడు. ఎక్కడి కయినా వెళ్ళి పొద్దుపోయి వస్తాడేమోనని ఇందాకటి నుంచీ కూచున్నాడు. అక్కడే చాపవేసుకుని శ్రీధర మేనువాల్చాడు. ఇంత పరాభవంతో, యింటికి వచ్చిన తండ్రి తిరిగివెళ్ళిపోయా డనే వ్యథ అతన్ని కాల్చివేసింది. కళ్ళు భగ్గుమంటున్నయ్. పసిపిల్లవాడిలాగా ఒక్కసారి గొంతెత్తి 'నాన్నా' అని ఏడిస్తేకాని ఈ బాధ చల్లారదేమోననిపించింది. ఎందుకో కన్నీళ్ళు చిందినయ్. ఇన్నాళ్ళకి తల్లి జ్ఞాపకంవచ్చింది. చిన్నప్పుడు తను పెరిగిన పల్లె కళ్ళకుకట్టింది. తెమ్మెర్లు, చెల్లెళ్ళూ అంతా కళ్ళల్లో గెంతులువేశారు. ఒక్కసారిగా గతజీవితంలోకి రెక్కలుకట్టుకుని ఎగిరిపోవాలని అతని మనసు తహతహలాడింది. 'నాన్నా' అన్న పిలుపు గొంతుకలో కొట్టుకుంటోంది. తను చిన్నప్పుడు కిందాపగరేసిన పూరిగుడిసే, తను కోతికొమ్మచ్చులాడిన పున్నాగచెట్లూ, అన్నీ గొంతెత్తి శ్రీధరని పిలుస్తున్న ట్లనిపించింది. ఆనాటి జీవనం వదిలించుకోలేని బంధాలు వేసి శ్రీధరని గుంజుతోంది.

అక్కడే దిండుమీద తలవాల్చి కళ్ళు మూశాడు శ్రీధర. నౌకరు వచ్చి 'బాబుగారూ' అని పిలిచాడు. శ్రీధర కళ్ళు తెరిచాడు. "బాబుగారూ, నాన్నగారు ఇంటికి వెళ్ళిపోయారు. మీతో చెప్పమన్నారు—" అన్నాడు నౌకరు.

"ఎప్పుడూ? నీతో ఇంకేమయినా చెప్పారా?"

"లేదు బాబూ. వారు మీతో ఏమైనా మాట్లాడదా మనుకున్నారేమో. మేడమెట్లెక్కారు. మధ్యలోనే కిందికి దిగివచ్చేశారు. నన్ను చూసి మా అబ్బాయితో నేను వెళ్ళానని చెప్పమన్నారు."

ఈ మాటలు వినేసరికి శ్రీధరప్రాణాలు ఎగిరిపోయినయ్. ఇంకేముంది? తండ్రి సరళమాటలు విన్నట్లే—అందుకే క్షణమైనా వుండకుండా వెళ్ళిపోయాడు. ఆమాటలకి ఆయన ఎంత నొచ్చుకున్నాడో! ఆయనమనసు ఎంత చిన్నబుచ్చుకున్నదో...ఆబాధని కనబడకుండా దాచుకోటానికి! "ఇంకేమీ చెప్పలేదా నీతో?" అని అడిగాడు నౌకర్ని. వాడు లేదని చెప్పి వెళ్ళిపోయాడు. అక్కడే కూలబడిపోయాడు శ్రీధర.

మేడమీదినుంచి కేక పెట్టింది సరళ. "ఇదుగో, మిమ్మల్నే. పాప లేచి ఏడుస్తోంది మీకోసం." ఆరాత్రంతా అక్కడే జాగారంచెయ్యా లనుకున్నాడు. కాని సరళ పిలుపు వినబడగానే అతని సంకల్పం సడలిపోయింది. ఇందాకటినుంచీ తాను విహరించిన లోకం నుంచి బలవంతాన ఈలోకంలోకానికి గుంజుకుపోతున్నట్లనిపించింది. అక్కడ శ్రీధరని కాళ్ళూ చేతులూ కట్టేసి బందీని చేస్తారు. ఆ బందిఖానాతాళంచెవులు సరళ చేతుల్లోనే వున్నయ్. కాని ఆబందిఖానాలోకి పోకుండావుండలేదు శ్రీధర. అదే అతని స్వభావంలో వున్న లోపం. ఎంతో ఎదురుతిరగా లనుకుంటాడు; సరళని కాదని దూరంగా పారిపోవా లనుకుంటాడు. కాని తీరా జరిగేదేమంటే - శ్రీధర లొంగిపోవటం, సరళ విజయంతో పొంగిపోవటం!

అయినా ఆరాత్రిమటుకు శ్రీధరకి ఎక్కడలేని ధైర్యమూ వచ్చింది. సరళ హేళనలనీ, వెక్కిరింపులనీ సహించే ఓపిక లేదు. ఈ సంగతి సరళ గ్రహించలేదు. ప్రపంచంలో నోరులేకుండా అన్నిటినీ భరించేవా రుంటారు. కాని వారి సహనానికి కూడ ఒక హద్దువుంది. ఒక మితివుంది. ఆ మితిమీరినప్పుడు వారి సహనంలోంచి అసహనం అగ్నిపర్వతంలాగా బద్దలవుతుంది.

"అప్పుడే వచ్చారేం, పాపం! ఇంకాస్సేపు తండ్రీకొడుకులు చెవులు కొరుక్కోకపోయారూ? ఆయనతో ఏంమంతనాలు చేస్తున్నారు? వాటి కొక అంతూ పొంతూ లేదూ?" అని సరళ రుసరుసలాడుతూ, ఏడుస్తున్న పాపని రెక్కలుపుచ్చుకుని తెచ్చి శ్రీధరమంచంమీద కూలవేసింది. "అరుగో నమ్మా, వచ్చారు మీనాన్న. పాపం, బెంగపడిపోతావు నిమిషం కనిపించకపోతే!" అంటూ నాలుగేళ్ళ ఆశని శ్రీధరపక్కలో పడేసింది. శ్రీధర సరళకేసి చూడకుండానే ఆశని ఒళ్ళోకి తీసుకుని జోకొట్టాడు. ఇందాకటినుంచీ వెక్కివెక్కి ఏడ్చిన ఆశ ఒక్కనిమిషంలోనే కొట్టినట్లు నిద్రపోయింది. కొంచెంసేపు ఊరుకుని సరళ మళ్ళీ అందుకుంది. "ఏంరహస్యాలు మాట్లాడారు తండ్రితో? చెప్పకూడదా?" అప్రయత్నంగా శ్రీధర అన్నాడు—"అవసరంలేదు. చెప్పవలసిన అవసరం లేదు." భర్త ఇటువంటి సమాధానం చెబుతాడని సరళ అనుకోలేదు. వినగానే క్షణంసేపు విస్తుపోయింది. ఒక్కమాటయినా తనమీద ఉంచుకోటం సరళ స్వభావానికే విరుద్ధం. దెబ్బకి దెబ్బకొడితేగానీ సరళకి శాంతి వుండదు. కోపంతో మండిపడుతూ అడిగింది—"ఏం? ఎందు కవసరంలేదు? ఈ ఇంట్లో నాకు తెలియకుండా ఏదీ జరగటానికి వీల్లేదు. చెప్పండి, ఏంమంతనాలు జరిపివచ్చారో" గడపలోకి వచ్చిన తండ్రిని అగౌరవ పరచటంతోటి సరళకి తృప్తిలేదుకాబోలు. "నీఅమర్యాదని సహించి ఇక్కడ ఆయన క్షణమైనా వుండలేదు. వెంటనే వెళ్ళిపోయారు. ఇంటికి వచ్చిన అతిథిని బైటికి పంపేశావు" అని నూటిగా సరళకి చెప్పివెయ్యాలనుకున్నాడు. చెప్పివేసేదాకా అతనిలోపలి మంట చల్లారదు. కాని అంతటితో ఊరుకోక సరళ తనముందరే తన తండ్రిని ఇంకా చులకనచేసి మాట్లాడుతుందేమో? అది తాను సహించగలడా? సహించక తాను చెయ్యగలదేముంది? అయినా తాను బదులుచెప్పకుండా వూరుకుంటే సరళ అంతటితో అప్రసంగాన్ని కట్టిపెట్టి నిద్రపోతుంది. అందుకనే శ్రీధర మారుపలకకుండా మంచంమీద వాలి ఆశని జోలకొడుతూ కళ్లు మూశాడు. సరళ లోపల రగిలిపోతోంది. భర్త ఇంత పెంకిగా, తన మాటకి మారుచెప్పకుండా, తనని చులకనచేసి నిద్రపోటం ఆమె సహించలేకపోయింది. ఎన్నడూ తనమాటకి ఎదురాడి ఎరగడు భర్త. తను గీసిన గిరిలోనుంచి కదిలిఎరగడు. అటువంటి మనిషి ఇవాళ ఎందు కింత గర్వంగా మాట్లాడాలి? "నీకు చెప్పాల్సిన అవసరం లేదు." అని తనముఖాన అనివేశాడు—ఇంత తెగువ ఎక్కడినుంచి వచ్చింది? తన భర్తకి అతని తండ్రి ఏవో ఎక్కులు పెట్టివుంటాడు. లేకపోతే ఇంత నిర్లక్ష్యంగా శ్రీధర ఎన్నడయినా తనతో ప్రవర్తించాడా? తలుచుకున్నకొద్దీ సరళకి లోపల రగిలిపోతోంది. అభిమానంతో ఎంతసేపటికీ కంటిమీద కునుకురాలేదు.

కళ్ళు మూసుకున్నాడేకాని శ్రీధరకీ నిద్రపట్టలేదు. అతని హృదయం సరళని నూటిగా ఒక్కప్రశ్న అడగదలుచుకుంది. సరళమాటలవల్ల తను పొందిన బాధనంతనీ ఆ ప్రశ్నలో నింపుతుంది. కాని నూటిగా అడగగలనా? అని అతని మనస్సే తటపటాయిస్తోంది. "వద్దు. అడగను. ఇన్నాళ్ళనుంచీ సహించలేదా? ఇల్లాగే కాలం వెళ్ళదీయటం కష్టమా?" అనుకుంటాడు. మరుక్షణంలోనే "అడుగుతాను. ఏమయినాసరే, అడిగివేస్తాను. సరళా, ఎవరిచ్చారు నీకీ అధికారం అని నూటిగా అనేస్తాను. ఏంబదులుచెబుతుందో వింటాను. తరువాత ఏం చెయ్యాలో ఆలోచిస్తాను" అనుకుంటాడు. మనసులో మల్లాగుల్లాలు పడుతూ తెల్లవారుస్తాడుకాని తెగించి అడగలేడు. నెలకు రెండువేల జీతం సంపాదించే మామగారు, ప్లీడరుబోర్డు కట్టి చిల్లిగవ్వ సంపాదించలేకపోతున్న తనూ, తనతో సమానంగా కాలేజీలో చదివిన తన భార్య సరళా తలపుకువచ్చేసరికి అతని నోరు నొక్కుకుపోతుంది. తనని చదివించలేక తల్లిదండ్రులు ఏనాడయితే ఈ రెండువేల జీతగానికి అల్లుడిని చేశారో ఆనాడే తన నోరు కట్టుబడిపోయిందికాబోలు. ఆనాడే అతని స్వేచ్ఛ అంతమొందిందికాబోలు. అప్పటినుంచీ వేరొకరికి చెప్పుకోలేని మూగబాధ ఒక్కటే అతనికి మిగిలిందికాబోలు. తన అసహాయతని తలుచుకోగానే అతని మనసు చివుక్కు

మంటుంది. ఈ బతుకిలా తెల్లవారవలసిందేనని నిస్పృహ కలుగుతుంది. ఒక్కొక్క సమయంలో అతనికి తల్లిదండ్రులమీద మితిలేని కోపం వస్తుంది. "తనూ అందరిలాగే బతకలేకపోయేవాడా? మిగిలిన ముగ్గురు తమ్ముళ్ళతోపాటూ తనూ పెరిగేవాడు కదా? బిచ్చమెత్తుకుని అయినా స్వేచ్ఛగా బతికేవాణ్ణి కామా? నన్ను ఈ ఇంట్లో ఎందుకు తెచ్చి పడేశారు? ఎందుకు నా కాళ్లూ చేతులూ విరిచి కట్టేశారు?" అని తల్లిదండ్రుల మీద అతని మనసు దుడ్డోరా చేస్తుంది. చివరికి "వారేం తప్పు చేశారూ?" అని వాళ్ళని క్షమిస్తాడు. "నాకు ఈ ఇంట్లో ధనంతోపాటు సుఖం దొరుకుతుందనుకున్నారు. శాంతి దొరుకుతుందనుకున్నారు. నన్ను గురించి తాము ఇక దిగులుపడనక్కర్లేదనుకున్నారు. దారిద్ర్యపు యాతనలో నా బతుకు తప్పించుకోవాలనుకున్నారు. వారి దేం తప్పుంది?" అనుకుంటాడు.

నిద్రపోతున్న ఆశ అటూ ఇటూ కదిలింది. "తాతయ్య...అరిటిపళ్లు పెట్టాడు" అని కలవరించింది. వెంటనే శ్రీధరకి గుర్తుకివచ్చింది. తన తండ్రి మనమరాలి చేతుల్లో అరిటిపళ్ళు పెట్టాడు. తనముందే సరళ వాటిని "జబ్బుచేస్తుందమ్మా, ఆశా, తినద్దు." అని వారించి దాసీదానికిప్పించివేసింది. తన తండ్రి తెచ్చిన పేదకానుకని తన భార్య ఈవిధంగా చులకనచేయటం తెలుసుకోగానే శ్రీధర కడుపులో దేవినట్లయింది. అప్రయత్నంగా తనకి చిన్నప్పుడు తల్లి చెప్పిన కుచేలుని అటుకులకథ గుర్తుకువచ్చింది. వెంటనే అతనికి తెలియకుండానే లోపలినుంచి "అమ్మా" అని ఆక్రోశం వెలువడింది. ఆశని దగ్గరికి తీసుకుని జోలకొడుతున్నాడు.

ఆశకలవరింత వినగానే సరళ తనని సంబాళించుకోలేక పోయింది. లేచి కూచుంది. మొన్న తన తండ్రి పట్నంనుంచి వస్తూ మనమరాలికి ఎన్నో పళ్ళూ, బొమ్మలూ, ఆటవస్తువులూ తెచ్చాడు. ఆమధ్య తన తమ్ముడు కలకత్తానుంచి మేనకోడలికోసం రకరకాల బొమ్మలు తెచ్చిపెట్టాడు. వాటినిగురించి ఆశ ఎన్నడయినా కలవరించిందా? అటువంటిది పల్లెటూరినుంచి పేదతాతగారు తెచ్చిన ముష్టి అరిటిపళ్ళకోసం కలవరించటం వినగానే సరళకి కోపం వచ్చింది. తన ఇంట్లో తనకి విరోధిశక్తి లేవో దూరి చాటుగా పనిచేస్తున్నయ్. అవి ఒకనాడు తన కాపురాన్నే తారుమారుచేసి వెయ్యవుగదా?

"ఇదుగో, మిమ్మల్నే, నిద్రా?" అని సరళ భర్తని పిలిచింది. అప్పటికి కలతనిద్రలో వున్న శ్రీధరకి ఈ పిలుపు వినబడలేదు. వినబడికూడా పలకలేదేమో ననుకుని సరళ కోపంతో పక్కమీద వాలి బలవంతాన నిద్రతెచ్చుకోవాలని కళ్ళుమూసింది.

కాని సరళకి నిద్రపట్టలేదు. కలతనిద్రతోనే తెల్లవారింది. ఎందుకో సరళమనసులో ఆందోళన బయలుదేరింది. తన పెళ్ళిఅయినదగ్గరనుంచీ ఈనాటి వరకూ తను పడిన శ్రమ అంతా నిష్ఫలమయిపోతుందేమో! ఇన్నాళ్లనుంచీ సరళ ఒక ప్రయత్నంలో మునిగివుంది. తన భర్త బీదవారి బిడ్డ. తాను ధనికుల బిడ్డ. తమఇద్దరికీ పెళ్ళి జరిగింది. అప్పుడు అంతా 'ఇదేమి సంబంధం' అన్నారు. 'ఈ పౌరోహిత్యపు సంబంధ మెక్కడ దొరికింది? నిక్షేపంలాంటి పిల్ల! బి. యే. దాకా చదువుకున్న సరళకి ఇంతకంటే మంచిసంబంధమే దొరకలేదా' అని ఆక్షేపించారు. కాని వరులకోసం వెదకి వేసారిన సరళ తండ్రికి శ్రీధరకంటే మంచివరుణ్ణి తేవటం తలకుమించిన పని అనిపించింది. ఆయన శ్రీధర పేదరికాన్ని సరకుచెయ్యక పెళ్ళిఅయినదగ్గరనుంచీ అల్లుణ్ణి తెచ్చి తన ఇంట్లోనే వుంచుకున్నాడు. పెళ్ళిలో బంధువులు చేసిన హేళనలూ, ఆక్షేపణలూ సరళ విన్నది. అప్పటినుంచీ సరళ ఒకవిధానాన్నే అనుసరిస్తూ వచ్చింది. శ్రీధర బీదఇంటి బిడ్డ అనే సంగతి తను మరిచిపోయింది. లోకాన్ని ఆవిషయం మరిచిపోయేట్లు చేయాలి. శ్రీధరనికూడా ఈవిషయం మరిచేట్లు చేయాలి. అతని గతజీవితాన్ని మరిపించాలి. మునుపటిచోటునుంచి వేళ్ళతో పెళ్ళగించివేయాలి. అతని తల్లిదండ్రులతోనూ, అక్కచెల్లెళ్ళతోనూ, బంధువులతోనూ ఏమీసంబంధంవుండకుండా చెయ్యాలి. అప్పటికిగాని శ్రీధర కొత్తపరిసరాలలో పాతుకోడు. అప్పటికిగాని సరళకి భర్త కాదగిన హోదా అతనికి రాదు. అప్పటికిగాని పెళ్ళిలో బంధువులు

హేళనచేసినప్పుడు తన మనసులో రగిలిన మంట చల్లారదు. ఈ విషయంలో సరళవిజయానికి ఇంకో విషయం కూడా తోడ్పడింది. పెళ్ళిలో శ్రీధర తల్లిదండ్రులకీ, బంధువులకీ తలవంపు కలిగింది. సరళతండ్రిగారి రెండు వేలజీతంతో వియ్యం పొందటానికి శ్రీధరతండ్రి సమర్థుడు కాడని పెళ్ళికివచ్చినవారు ప్రతి అంశం లోనూ వెల్లడించారు. శ్రీధరతండ్రి ఏమీ చెయ్యలేకపోవచ్చు. కాని అభిమానంమాత్రం జాస్తి. అందుకనే శ్రీధరతరఫు బంధువు లెవ్వరూ ఇంతవరకూ సాపోగడుప తొక్కలేదు. కాని ఇప్పుడు సరళ కిందుకో భయం... తనపట్లు తప్పిపోతే? తన శ్రీధరా, తన ఆశా తన చెయ్యి జారిపోతే? ఉహూం, జరగదు. అట్లా ఎన్నటికీ జరగనివ్వదు... కాని...

*   *   *   *

కొన్నాళ్ళకి టపాలో శ్రీధరకి ఉత్తరంవచ్చింది ఇన్నాళ్ళకి తండ్రి తనకు ఉత్తరం రాసినందుకు శ్రీధర పొంగిపోయాడు. కవరు చింపుతుంటే సంతోషంతో అతని చెయ్యి వణికిపోయింది. చింపి చదువుతుంటే అతనికే తెలియకుండా కళ్ళలో నీరుతిరిగింది. నిజానికి ఆ వుత్తరంలో విచారపడవలసిన సంగతే లేదు. పైగా సంతోషపడవలసిన విషయం. అందులో తండ్రి రాసిం దేమంటే: శ్రీధరతమ్ముడిపెళ్లి నిశ్చయమయింది. "మీ అమ్మ పోయినతరువాత మన యింట్లో ఇదే మొదటి శుభకార్యం. నువ్వూ, కోడలూ తప్పకుండా రావాలి. ఇది మీచేతులమీదుగానే జరగాలి. ఇది చెప్పాలనే మొన్నవచ్చాను. కాని తొందరపనిమీద వెంటనే ఇంటికి వెళ్ళిపోయాను." అని తనని మరీమరీ రమ్మని రాశాడు. తన మనసు నొచ్చుకుంటుందని తండ్రి పని మీద వెళ్లిపోయా నని అబద్ధమాడుతున్నాడు. పిలవాలని తను మేడమెట్లెక్కినసంగతీ, తన కోడలిమాటలు విని వెంటనే దిగివెళ్ళిపోయినసంగతీ దాచివేస్తున్నాడు. ఆవిషయం శ్రీధరకి తెలియదని ఆయన ఊహించివుండవచ్చు. కాని విషయమంతా తెలిసిన శ్రీధర తండ్రి ఉత్తరానికి తట్టుకోలేకపోయాడు. తండ్రి ఎంత బాధ పడ్డాడో? అభిమానంతో ఎంత కుమిలిపోయాడో? దీనికంతకీ తనేకదా కారణం? అవును, నువ్వే నువ్వే అంటోంది అతని మనస్సు. నీ తండ్రిని నీకళ్ళముందు సరళ అవమానిస్తుంటే నువ్వు చూస్తూ నిలబడ్డావు. ఇదివరకన్నిసార్లో ఆమె నీ తల్లిదండ్రులనీ, నీ గతజీవితాన్నీ చులకనచేసి హేళన చేసినప్పుడు సహించి వూరుకున్నావు. నీపెళ్ళి జరిగిన వేసవిలో నీతల్లి చనిపోయిందని మీరందరూ నీలగిరిలో వున్నప్పుడు కబురు తెలిసింది. అప్పుడు నిన్ను ఇంటికి పోనివ్వకుండా తను రాకుండా సరళ అడ్డుపెట్టినప్పుడు నువ్వు చేతకానివాడివై చూస్తూ వూరుకున్నావు. ఇప్పుడు మాత్రం నువ్వేం చేస్తావు? ఏం చెయ్యదలిచావు? ఏం చెయ్యగలవు? అంటూ అతని మనస్సే అతన్ని పొడుస్తోంది.

ఏమయినాసరే, సరళ వెంటవచ్చినా రాకపోయినా వెళ్లితీరాలిసిందే. తనచుట్టూ వున్న ఈవలయి పటపటా తెంపి బైటపడాలిసిందే. "ఆ తరవాత ఏం జరుగుతుందో ఆలోచించుకున్నావా?" అని అతని లోని పిరికితనం హెచ్చరించింది. "ఏం జరగాలో అది జరుగుతుంది. నేనుమాత్రం వెళ్ళితీరాలిసిందే" అనుకుంటూ గదిలోకి వెళ్లాడు.

"ఎక్కడినుంచి వుత్తరం?"

"మానాన్న రాశాడు."

"ఏమని?"

చెప్పటమా చెప్పకపోవటమా అని శ్రీధర క్షణంసేపు సందిగ్ధంలో పడ్డాడు. ఈసారికూడా సరళ తనవారిని తనముందు చులకనచేస్తుందేమో? అప్పుడు తను ఇదివరకులాగా సహించి వూరుకోవటమేనా? చివరికి "మాతమ్ముడి పెళ్ళిట. మనిద్దరినీ తప్పక రమ్మని రాశారు" అని క్లుప్తంగా చెప్పాడు. కొంచెంసే పూరుకుని సరళ అడిగింది—"అయితే మొన్న ఆయన వచ్చినప్పు డెందుకు చెప్పలేదు?" అని. వెంటనే సరళకి చురుక్కున తాకేట్టుగా "దానికి నువ్వే కారణం." అనేశాడు శ్రీధర.

నివ్వెరబోయింది సరళ. "నేనా? ఆమాట ఆయన రాశారా? ఏదీ?" అని శ్రీధరచేతిలోంచి వుత్తరం తీసుకుని ఒక్క గుక్కలో చదివేసి, నిర్లక్ష్యంగా గిరాటువేసింది. ఇది చూసేసరికి శ్రీధర పట్టలేకపోయాడు.

సరళ తన సర్వస్వాన్నీ హరించినట్లు లోపల రగిలి పోయాడు. ఇది గమనించలేని సరళ శ్రీధర కేసి చూస్తుండగానే అంది. "ఇంటికి వచ్చి భోజనం చేసిపోవటానికి తీరిక వుండదట. పెళ్ళికి పిలవటానికి మాత్రం తొందరపాటు అడ్డొచ్చిందట పాపం"—ఈ దెబ్బకి శ్రీధర తల గిరగిర తిరిగింది. కొంచెంసేపు నోట మాట రాలేదు. పెదవులు వణికిపోయినయ్. ముఖం కంది పోయింది. సమాధానం కోసం ఎదురుచూస్తున్న సరళ శ్రీధర ముఖాన్ని చూసి కంపించింది. ఇంతలో తనని నిలవరించుకుని శ్రీధర కంపించే స్వరంతో "నీయింట్లో భోజనానికి ఆశపడి మా నాన్న ఇంత దూరం వచ్చాడనుకున్నావు. ఆయన అంత నీచుడు కాదు. ఆయన చెప్పకుండా వెళ్ళిపోవటానికి ముమ్మాటికీ నువ్వే కారణం." అని గబగబా మెట్లు దిగిపోయాడు.

సరళ నిశ్చేష్టురాలయిపోయింది. అంతా అర్థం కాని అయోమయంగా వుంది. శ్రీధరని ఎవరో తనదగ్గరి నుంచి దూరంగా లాక్కుపోతున్నారనే భయంతో వణికిపోయింది. తన హృదయం దృఢంగా బంధించాలని ఇన్నాళ్ళూ తాను పడిన ప్రయాస అంతా వ్యర్థమేనా? ఇంతలో ఆశ గదిలోకి వచ్చింది. తల్లి కోపంగా గిరాటువేసిన ఉత్తరం ఆశ ఏరి చేతపుచ్చుకుంది. తల్లి దగ్గరికి వచ్చి "ఓరు లాశాలే ఉత్తలం?" అని అమాయకంగా అడిగింది. సరళ పట్టలేని కోపంతో "ఎవరా? దేవుడు!" అంటూ ఆశ చేతుల్లోంచి ఉత్తరాన్ని లాగి, ముక్కలుచేసి కిటికీలోంచి కిందికి పారేసింది. తల్లి కసురుకునేసరికి ఆశ బిగ్గరగా ఏడ్వటం మొదలుపెట్టింది. కిందిగదిలో కూచున్న శ్రీధర ఆశ ఏడుపు విని పైకివచ్చాడు. తండ్రిని చూడగానే ఆశ తల్లి మీద నేరం చెప్పింది. "ఏదీ ఉత్తరం? ఇవ్వ నాక్కావాలి." అని శ్రీధర సరళని గద్దించిఅడిగాడు. "నాకు తెలియదు. మీ ఉత్తరాలన్నీ దాచేటందుకే కూచున్నానా యేమిటి?" అని పెంకెగా జవాబు చెప్పింది. "ఉత్తలం చింపిపాలేచింది నాన్నా" అని ఆశ తల్లి మీద కోపంతో చెప్పేసింది. "నిజమేనా? చెప్పు. మాట్లాడవేం?" అన్నాడు శ్రీధర. సరళ మరీ బిర్ర బిగిసి "అవును, నిజమే. చింపాను. పారేశాను. ఏం చేస్తారో చెయ్యండి" అంది. ఆ ధోరణి చూసేసరికి శ్రీధరకి చిందులు తొక్కేటంత శివమెక్కింది. తన తండ్రి పంపిన శుభలేఖని సరళ ముక్కలుచేసిందని వినేసరికి అతనికి పట్టరాని దుఃఖంకూడా వచ్చింది. కొంచెంసేపు రాయిలాగా నిలబడిపోయాడు. ఆశ వచ్చి తండ్రిదగ్గర నక్కింది. తండ్రిముఖంకేసీ, తల్లిముఖంకేసీ చూసి బిక్కమొహం వేసింది. వారిద్దరిమధ్యా ఆవరించిన మౌనం ఎంతబరువైనదో ఆ పసిగుండెకు కూడా తెలిసింది కాబోలు దాన్ని భంగం చెయ్యటంకోసమే ఆశ ఎవరో కొట్టినట్లు ఏడవటం మొదలుపెట్టింది. ఆశని సముదాయిస్తూ శ్రీధర తన వేదననంతా అణుచుకుని ఇలా అన్నాడు - "సరళా, ఒకమాట జ్ఞాపకం పెట్టుకో. దీనికంతకీ నువ్వు పశ్చాత్తాపం పడవలసిన రోజు వచ్చి తీరుతుంది." సరళ మారుచెప్పకముందే శ్రీధర ఆశని ఎత్తుకుని తన గదిలోకి వెళ్ళిపోయాడు.

శ్రీధర తనని తిట్టినా, కొట్టినా సరళకి అంత బాధ కలిగేదికాదు. కాని శ్రీధరనోటినుంచి వచ్చిన ఈమాటలు రెండూ ఆమెని చెప్పలేనంతగా కదిలించి వేస్తున్నయ్. ఆమాటల్లో ఏదో అశుభం దాగి సరళని భయపెట్టింది. అయినప్పటికీ ఆమె అభిమానంమాత్రం ఎదురుతిరుగుతోంది. నేను ఏం చేశానని? నేను ఎందుకు పశ్చాత్తాపపడాలి! అటువంటి అవసరం ఎన్నడూ రాదు. రాదు. ఇది శ్రీధర కోపంతో అన్నమాట. తను చెయ్యని నేరం ఆరోపిస్తున్నాడు. చేసినదానికి చింతించవలసిన సమయం వస్తుందని బెదిరిస్తున్నాడు ఇదంతా మగవారి ఆట. దీనికి నేను లొంగను. నేనెన్నటికీ పశ్చాత్తాపపడను...అటువంటి అవసరమే రాదు అనుకుంటూ అక్కడే కూర్చుండిపోయింది సరళ.

ఇంతలో తన గుడ్డలన్నీ పెట్టెలో వేసుకుని శ్రీధర పైకి వచ్చాడు. సరళ అతని హడావిడి చూసి ఆశ్చర్యపోయింది. ఎన్నడూ లేని ఉత్సాహం అతని ముఖంలో చిందులుతొక్కుతోంది. అతని ప్రతి అడుగులోనూ అపూర్వమైన ఆనందం కనిపిస్తోంది. ఇది చూసేసరికి సరళమనసులో భయం తలెత్తింది. ఏమిటీ సన్నాహమంతా? ఎందుకీ ఆనందమంతా? ఏం జరగబోతున్నదో?

ఆశ గబగబ పరిగెత్తుకొచ్చింది మేడమీదికి తన గౌనులు రెండు చిన్న తువ్వాలలో మూటగట్టి మోసుకొచ్చి "అమ్మా, నేనూ వెల్తున్నా ఊలికి" అని సంతోషంతో చెప్పింది. ఈ మాట వినేసరికి సరళ ఉలిక్కిపడింది. ఊరికి పోవాలని ఆశ పడుతున్న ఆరాటం చూసేసరికి ముద్దువచ్చింది. అమాంతం దగ్గరికి తీసుకుని "నన్నుకూడా తీసుకుపోతావా" అంది సరళ. కాని వెంటనే నాలుక కరుచుకుంది. ఈ మాట విని శ్రీధర పొంగిపోయాడు. తనతోపాటు తమ్ముడి పెళ్ళికి సరళ

కూడా వస్తుందనే ఆశ ఒక్కసారి మెరిసింది. తనూ, సరళా, ఆగా పెళ్ళికివస్తే తండ్రి ఎంత పొంగిపోతాడు! బంధువులంతా ఎంత సంతోషిస్తారు! తన పెద్దకొడుకుచేతిమీదిగా పెళ్ళి జరిగిందని స్వర్గంలో తల్లి ఎంత ఆనందిస్తుంది!

"అమ్మని తీసుకుపోదామా నాన్నా" అని ఆశ తండ్రిని ముద్దుగా అడిగింది.

"మీ అమ్మ వస్తుందా?" అని శ్రీధర సరళకి విన పడేట్లు అన్నాడు. తండ్రిప్రశ్నకి ఏం చెప్పాలో తెలియక ఆశ తల్లిముఖంకేసి చూసింది. సరళ ఇక పట్టలేకపోయింది. "ఎక్కడికి ప్రయాణం?"

"మాతమ్ముడి పెళ్ళికి."

"అయితే పెళ్ళికెళ్ళాలా రేమిటి?"

"ఆ. తప్పక వెళ్ళితీరాలి. నువ్వుకూడా వస్తే అందరికీ సంతోషంగా వుంటుంది."

"నేనెందుకు? నేను రాకపోతే పెళ్ళి ఆగిపోతుందా? నేను వస్తాననే పిలుస్తున్నారా?" అని తల్లి అనేసరికి ఆశ చిన్నముఖం వేసింది. "నేనూ రాను నాన్నా" అని తల్లి కొంగు పుచ్చుకు మారాం చెయ్య సాగింది. సరళ ఆశ వీపుమీద ధబ్బున చరిచింది. ఏడుస్తుం టేనే బలవంతంగా కిందికి ఎత్తుకు వెళ్ళిపోయింది. శ్రీధర అక్కడే నిలబడిపోయాడు. ఆ దెబ్బ అతని గుండెలో ఫిరంగి దెబ్బలాగా తాకింది. ఏమిటి చెయ్యటం? ఇక తనకా తెలుసిన పనేలేదు. సరళ వస్తుందని ఎప్పుడూ అనుకోలేదు. రాకపోతే కొత్తగా కలిగే ఆశాభంగమూ లేదు.

రైలువేళయింది. బండి కదిలి వాకిట్లో నిలబడింది. వెళ్తున్నానని శ్రీధర సరళకి చెప్పాడు. సరళ మాట్లాడలేదు. ఆశ తండ్రికాళ్ళని చుట్టుకుని విడవ లేదు. బండి సాగిపోయింది. దోవపొడుగునా ఆశ తనతో వస్తానని ఏడ్చిన ఏడుపే చెవుల్లో గింగురు మన్నది. స్టేషనువైపుకు పరిగెత్తిపోతున్న బండికేసి కిటికీలోంచి చూస్తూ నిలబడింది సరళ. బండి కనుచూపు మేర దాటి మలుపు తిరిగిపోతోంది. దూరంనుంచి శ్రీధర సిల్కు ఉత్తరీయంమాత్రమే కనిపించింది. ఎందుకో తెలియదుకాని అక్కడినుంచి కదలలేదు. చూపులు మరలించలేదు. మళ్ళీ ఎప్పటికి తిరిగివస్తారో అని ఆమె హృదయం అడుగుతోంది. ఏమో! ఎవరికి తెలుసు?

ఏడ్చిఏడ్చి ఆశ తల్లిఒడిలోనే నిద్రపోయింది. ఏమీ తోచక సరళ అటూ ఇటూ పచార్లుచేసింది. తనకి ప్రియమైన వస్తువు పట్టుజారిపోతున్నట్లు భయపడి పోసింది. ఆమెకి తెలియకుండానే శ్రీధర తనకి దూరమై పోతున్నట్లు తోచసాగింది.

నౌకరు గబగబ పైకి పరిగెత్తుకొచ్చి "నాన్నగారొచ్చారు." అని చెప్పాడు. ఆనాడే సరళ ఆశని తీసుకొని తండ్రితో కలిసి పుట్టింటికి వెళ్ళిపోయింది. ఈసంగతి శ్రీధరకి తెలపటం అవసరమని ఆమెకి తోచలేదు.

*  *  *

శ్రీధర పెళ్ళికి వచ్చాడని బంధువులంతా సంతోషించారు. తండ్రిసంతోషానికి మేరలేదు. కాని అందరి మనసుల్లోనూ శ్రీధర ఒంటరిగా వచ్చాడెందుకన్న ప్రశ్న మెదులుతూనేవుంది. భార్యనీ, పిల్లనీ తీసుకు రానికారణం అందరికీ కష్టంగానే వుంది. పెళ్ళివాడు భోజనాలయిపోయినాక ఒంటరిగా వున్న సమయాన తండ్రి అడిగాడు—"నాయనా, ఒక్కడివే వచ్చావేం? కోడల్నీ, పిల్లనీకూడా తీసుకురాకపోయావు?" అని. శ్రీధర బదులు చెప్పలేక తలవంచేసుకున్నాడు. అతని కనుకొలుకుల్లో వెచ్చటి కన్నీరు తొణికింది.

రాత్రి పందిట్లో శ్రీధర ఒక్కడే కూచుని వున్నాడు. అతని చెవుల్లో ఇంకా ఆశ గొంతుచించుకుని ఏడ్చిన ఏడుపు మోగిపోతోంది. అతని కళ్ళెదుట ఇంకా ఆ దృశ్యం కట్టవచ్చినట్లు కనిపిస్తోంది. దుఃఖంతో పాటు అతని మనసులో ఆనందంకూడా గంతులువేస్తోంది. తను సంకెళ్ళని పటపట తెంపి వేశాడు. ఊపిరిసలపని చీకటికొట్లోంచి బైటపడ్డట్లుంది. ఈ గాలీ, ఈ వెలుతురూ...ఇప్పుడు తనేం చెయ్యాలి? ఇకముందు తను ఏబాటలో అడుగు పెట్టాలి?

"బావా" అన్న పిలుపు శ్రీధరఆలోచనలకి అడ్డు పడింది. వెనక్కి తిరిగిచూశాడు. అవునవును. అదే మెరుపు ముఖంలో. అదే వెలుగు ఆ చిలిపికళ్ళలో. అదే చురుకుతనం ఆ ఉంగరాల ముంగురులలో. శ్రీధర తన కళ్ళని తనే నమ్మలేకుండా వున్నాడు. ఇక్కడికి కల్లా వచ్చింది? ఈ సమయంలో ఎల్లా వచ్చింది? శ్రీధర బదులుచెప్పకమునుపే "ఏంబావా, మరిచిపోయావా?" అని అడిగింది లలిత. "అల్లా అంటావేమిటి లలితా? ఇంతలోనే మరిచిపోతా ననుకు

న్నావా ?" అన్నాడు శ్రీధర. "ఏమో, నాలాంటి అభాగినిని నీ కింకా గుర్తుంచుకోవలసిన అవసర మేముంది ? నిజంగా నువ్వు నన్ను మరిచిపోలేదా ? బావా, ఎంత దయ నామీద ?" అంది లలిత. అంటుండగా ఆమె కంఠం వణికింది. ఆమె కంట కన్నీరు తొణికింది. వెంటనే శ్రీధర చూపు లలిత నుదుటిమీదికి పోయింది. విచారంతో అక్కడే నిలిచిపోయింది. ఇది గమనించి లలిత దీనంగా తలవంచుకుంది. మంగళచిహ్నమైన కుంకుమ లేని ఆమె నుదుటికేసీ, అంచులు లేని తెల్ల ఖద్దరువలువలో వున్న ఆమె రూపంకేసీ శ్రీధర చూడ లేకపోయాడు. అతని గుండె చివుక్కుమన్నది. లలితని ఏ విధంగా పలకరించాలో అతనికి తెలియటం లేదు. మూగగా లలితకేసి చూస్తూ నిలబడిపోయాడు. "వెళ్ళివస్తాను బావా. ఇంకా వుంటావా రెండురోజులు ? ఓసారి తీరిక చేసుకుని మాబడికి వచ్చి చూసివెళ్ళాలి." బడి ఏమిటనీ, ఎక్కడ వుందనీ అడగకుండానే "ఓ, అల్లాగే వస్తాను." అనేశాడు శ్రీధర.

లలిత వెళ్ళిపోయింది. శ్రీధర అక్కడే కూర్చుండిపోయాడు. అతని మనసు తెలియని విచారంతో బరువెక్కిపోతోంది. చిన్నప్పటినుంచీ లలితా, తనూ ఆటపాటల్లోనూ, చదువుసంధ్యల్లోనూ ఒకళ్ళనొకళ్ళు విడిచివుండేవాళ్ళు కారు. అతని మేనమామకి చిన్నప్పటినుంచీ లలితని శ్రీధర కిచ్చి పెళ్లి చెయ్యాలని వుండేది. అందరూ అల్లాగే ఆశపడేవారు. కాని చివరికి జరిగింది వేరొకటి. శ్రీధర సుఖపడతాడనీ, చదువుకోటానికి అత్తవారు సాయంచేస్తారనీ, అతని భారం వాళ్లే భరిస్తారనీ, శ్రీధరతండ్రి సరళసంబంధాన్ని ఒప్పుకున్నాడు. శ్రీధరతల్లికి చిన్నప్పటినుంచీ లలితనే చేసుకోవాలని వుండేది. కాని దారిద్ర్యబాధ పడిపడి వున్న వారి ప్రాణాలకి సరళ అదృష్టదేవతగా కనిపించింది. చివరికి ఇంచుమించు తాంబూలాలు పుచ్చుకోవటం దాకా వచ్చిన లలితని తోసేసి సరళని కోడలు చేసుకోవలసివచ్చింది. లలితమీద శ్రీధరకి మక్కువ లేకపోలేదు. కాని సరళ కూడా తెచ్చే అదృష్టాన్ని తృణీకరించి లలితతో వచ్చే పేదరికాన్ని పెళ్ళాడే నిబ్బరం అతనికి లేకపోయింది. ఈ పెళ్లి తప్పిపోయినందుకు అంతా నొచ్చుకున్నారు. కాని తప్పుమాత్రం తమది కాదని ఎవరికి వారనుకున్నారు. ఎన్ని నేరాలు చేసినా నోరెత్తకుండా భరించే విధిసత్తినే ఈ బరువునికూడా వేసి అందరూ తృప్తిపడ్డారు.

అయిపోయిందనుకున్న సంబంధం తప్పిపోయింది. తరువాత లలితకు సంబంధం దొరకటం కష్టమయిపోయింది. ఆదిగులుతోనే లలితతల్లి స్వర్గంచేరింది. ఆ దిగులుతోనే లలితతండ్రికి ఇంచుమించు మతిపోయింది. చివరికి ఆ నిరాశలో ఎవరు కనబడితే వారికే లలితనిచ్చి తన బరువు వదిలించుకోవాలనే స్థితికి వచ్చాడు. ఒకరోజున షష్టిపూర్తికోసం ఎదురుచూస్తున్న ముసలి పెళ్లివాడికి లలితనిచ్చి పెళ్ళిచేశాడు. మునుపటి రెండు సంబంధాలకీ ఆయనకు పదిమంది పిల్లలు. మొదటిసంబంధం కూతుళ్ళకి లలితకంటే పెద్దపిల్లలు కూడా వున్నారు. తండ్రిమనసు కుదుటపడుతుందనే ఆశతో లలిత ఈ పెళ్లికి ఒప్పుకుంది. కాని పెళ్లిఅయిన ఆరు నెల్లకే ముసలిపెళ్ళికొడుకు మృత్యువుతో నాలుగో పెళ్ళి చేసుకున్నాడు. ఈదుఃఖంతో ఏడాది తిరగక మునుపే లలితతండ్రి ప్రాణంవదిలేశాడు.

ఈ ఘటనల వివరమంతా శ్రీధరకి తెలీదు. కాని కుంకుమ లేని లలిత నుదుటికేసి చూడగానే అతను బెదిరిపోయాడు. అభాగినిగా లలిత తనముందు నిలబడింది. ఆమెముందు శ్రీధర దోషిఅయినట్లు చిన్నబుచ్చుకున్నాడు. తను చేసిన తప్పటడుగుఫలితమంతా లలితలో మూర్తీభవించినట్లనిపించింది. ఆమెజీవితంలోని దుఃఖానికి తను కొంతవరకైనా బాధ్యుడయినట్లు లోలోపల వణికిపోయాడు.

మర్నాడు లలిత మళ్ళీవచ్చింది. ఆమెతో కలిసి బడిచూడటానికి శ్రీధర బయలుదేరాడు. దోవలో ఒక్కమాటకూడా మాట్లాడలేకపోతున్నాడు. లలిత శ్రీధరమౌనానికి చకితురాలయింది. "బావా, ఇంత మౌనం మా అక్కదగ్గర నేర్చుకున్నావా ! మునుపు ఎంత మాటకారివి! ఇల్లా మారిపోతావని కలలోనైనా అనుకోలేదు." అంది లలిత. బదులుగా శ్రీధర చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

లలితబడిని చూడగానే శ్రీధరకి పట్టలేని సంతోషం వేసింది. పిల్లలంతా రాట్నాలు గిరగిరా తిప్పుతూ హిందీపాటలు పాడుతున్నారు. వారి కలకలంలో అతని మనసులోని దుఃఖం దూరంగా పారిపోయినట్లుగా వుంది. ఆ పిల్లల ఆనందం ఎంతటి కష్టాన్నయినా, ఎంతటి విచారాన్నయినా మరిపించివేసేట్లున్నయ్. లలితకూడా తన దుఃఖాన్ని ఈవిధంగా పారదోలుకున్న దనిపించింది. దిక్కులేని లలిత ఇంతమంది పిల్లల

ఆటపాటల్లో తన ఒంటరితనాన్ని మరిచిపోతున్న దనిపించింది.

బడివిడిచినాక పిల్లలంతా వెళ్ళిపోయారు. 'అక్కా, వెళ్లొస్తాం' అని ఒక్కొక్కరూ వచ్చి శెలవుతీసుకు వెళ్లిపోయారు. అంతా వెళ్ళిపోయాక శ్రీధర "లలిత" అని పిలిచాడు. "ఏమిటి బావా?" అంది లలిత. "నన్నుకూడా నీబళ్లో చేర్చుకుంటావా" అని అడిగాడు.

"నువ్వు మాపల్లెటూరిబళ్లో ఎందుకు చేరతావులే! ఊరికే అంటావుగాని."

"కాదు లలితా. నిజంగా అంటున్నాను. ఈ పిల్లల ఆటపాటల్లో అన్నీ మరిచిపోవాలని వుంది. ఈ కాస్సేపటిలోనే నా మనస్సు ఎంతో తేలిక పడింది."

"మా అక్కనికూడా తీసుకొస్తే ఇంకా బాగుంటుంది. బడిని ఎంతో పైకి తీసుకురాగలం. ఏం బావా, మాట్లాడవేం?" ఏం చెప్పాలో తెలియక శ్రీధర తలకిందులైపోయాడు. లలిత సరళనిగురించి అడిగినప్పుడల్లా అతని మనస్సు ఎందుకో తికమకపడిపోతోంది. శ్రీధర మాట్లాడకపోయేసరికి లలిత మళ్లీ అంది: "మాట్లాడవేం బావా? మాఅక్కకి ఈపల్లెటూరు రావాలని లేదా? అంత చదువుకున్న మనిషి. అటువంటివాళ్లు ఒకళ్లున్నా చాలు—పల్లెటూళ్లు ఎంతో బాగుపడతాయ్." నిజమనిపించింది శ్రీధరకి. కాని ఏం చెప్పాలో పాలుపోలేదు. ప్రసంగం మార్చి "నిజంగా నన్ను చేర్చుకుంటావో లేదో చెప్పు." అన్నాడు. "ఎందుకు చేర్చుకోను బావా? కళ్లకద్దుకుంటాం. మాపిల్లలకి ఇంగ్లీషు చెబుదుగాని. మాస్టరు లేకపోవటంవల్ల హిందీ ఒక్కటే చెబుతున్నాను." అంది లలిత. "బాగుంది. అయితే నాకు హిందీచెబితేనే నేను నీబళ్లో చేరతాను." అన్నాడు శ్రీధర. "నాకు ఇంగ్లీషు నేర్పితే నిన్ను బళ్లో చేర్చుకుంటాం." అని లలిత నవ్వుతూ బదులుచెప్పింది.

* * * *

శ్రీధరజీవితంలో ఇటువంటి మార్పు వస్తుందని కలలోకూడా ఎవరూ అనుకొనివుండరు. పెళ్లికి వచ్చినవాడు వెంటనే వెళ్లిపోతాడని అంతా అనుకున్నారు. అటువంటి తొందరేమీ శ్రీధరలో కనిపించలేదు. ఆ పల్లెటూరిలోనే తాను ఉండిపోదలచినట్లు తెలపగానే అంతా ఆశ్చర్యపడ్డారు. అతనికీ, అత్తవారికీ తెగతెంపులైనట్లనుకున్నారు కొందరు. అతనికీ, భార్యకీ మనసులు కలవక విడిపోయారని ఊహించారు కొందరు. ఎవరికి తోచినట్లు వారూహించారే కాని యథార్థం ఎవరికీ తెలియదు.

కాని శ్రీధరకిమాత్రం బడితప్ప ఇంకో ప్రపంచమే లేదు. అప్పుడప్పుడు ఆమెనికూడా ఈ బళ్ళో వేస్తే ఎంత బాగుంటుంది అనుకునేవాడు. ఎప్పుడూ ఆమె కోసమే అతని మనసు కలవరించేది. ఆమెకోసమే అతనికి ఇష్టం లేకపోయినా సరళకి ఎన్నో ఉత్తరాలు రాశాడు. ఒక్కదానికీ జవాబులేదు. ఆఖరికి ఒకనాడు స్వయంగా బయలుదేరి ఇంటికి వెళ్లాడు. దిగిన బండిలోనే మళ్లీ ఎక్కవలసివచ్చింది. ఇంటికి తాళం. నౌకరుకూడా లేదు. తెరిచిన కిటికీలోంచి తను రాసిన తెరవని కవరు మట్టిలో పొర్లాడుతూ కనిపించినయ్. అతనికి పట్టరాని కోపం వచ్చింది. గిర్రున వెనక్కి తిరిగి పల్లెటూరికి దోవపట్టాడు. ఆమెని చూడాలనే ఆరాటాన్నికూడా అణుచుకుంటాడు. కాని తనమాత్రం ఇక మామగారి గుమ్మం తొక్కడు. సరళ తనదగ్గరికి రావలసిందేకాని తనుమాత్రం సరళకాళ్లదగ్గరికి పోడు—ఏం జరిగినాసరే.

కోడలినీ మనమరాలినీ తీసుకురాకుండా శ్రీధర ఒంటరిగా తిరిగిరావటం చూసి అతని తండ్రి నివ్వెరపోయాడు. "ఏం జరిగింది నాయనా?" అని అడిగాడు తండ్రి. శ్రీధర బలవంతాన కన్నీళ్లు నాపుకుని "జరిగేదేముంది నాన్నా. ఏమైనాసరే, ఇక నేను పోదలుచుకోలేదు. ఏదోవిధంగా ఇక్కడే కాలం వెళ్లదీస్తాను." అన్నాడు. శ్రీధరలోపలిబాధని తండ్రి వెంటనే గ్రహించి ఇక ఆవిషయం ప్రస్తావనతీసుకురాలేదు.

కొన్నాళ్లు పోయాక శ్రీధరకి తెలియకుండా తండ్రి రెండోకొడుకుని పంపాడు. వదినెగారిని తీసుకురావటానికి మరది వెళ్లాడు. కాని అనుకున్నట్లే జరిగింది. శ్రీధరమామగారు "నువ్వెవరివో నేనెరగను పో" అని తిప్పిపంపేశాడు. మరది పుట్టెడు అభిమానం మూటగట్టుకుని ఇంటికి తిరిగివచ్చాడు. సరళ అతన్ని గుర్తుపట్టింది. కాని పలకరించలేదు. అందుకే మరది మనస్సు మరీ కష్టపడింది. తరువాత ఈ సంగతి శ్రీధర విని మరీ మండిపడ్డాడు. ఈఘటనవల్ల అతని మనస్సు మరీ గట్టిపడింది. ఇక ఏమయినాసరే ఆగడప తొక్కను, తొక్కను అనుకున్నాడు.

కొన్నాళ్లు శ్రీధర భార్యదగ్గిరనుంచి ఏమైనా తరంవస్తుందేమోనని ఎదురుచూశాడు. చివరికి ఆ ఆశకూడా వదిలేశాడు.

బళ్లో పిల్లలందరినీ తన పిల్లలమాదిరే చూసే వాడు. వాళ్లందరూ అతన్ని నిమిషమైనా విడవకుండా చుట్టేసేవాళ్లు. అతనికి దూరమైన కూతురు ప్రతిపిల్లలోనూ కనిపించి అతన్ని ఊరడించేది. అతని కళ్లకి అందరూ ఆశలాగే కనిపించేవాళ్లు.

ఇదివర కెప్పుడూ లేని ఆనందం శ్రీధరజీవితంలో నలుమూలలా వెన్నెలలాగా వ్యాపించింది. ఇంతకాలమూ అతని జీవితంలో సరళ రోహిణికార్తెలోని ఎండలాగా అధికారం చలాయించింది. ఇంతికాలమూ చీకటికోణంలో అతని హృదయం బందీ. ఇప్పుడో శరత్కాలంలోని చల్లటివెన్నెలలాటి స్నేహంతో అతని హృదయాన్ని లలిత కమ్మివేసింది. తొలకరివానకు చిటలువారిన కేదారం ఏ విధంగా పులకించిపోయి సుగంధాన్ని వెదజల్లుతుందో ఆమాదిరిగానే లలిత పరిచయంవల్ల శ్రీధరజీవితం నెదనీరి కొత్తఆనందంతో గంతులు వేస్తోంది. లలిత అతని దుఃఖాన్నంతటినీ మరిపించివేస్తోంది. ఇదివరకెన్నడూ తొక్కని యెరగని సీమలకి దారులుచూపుతోంది. ఇదివరకెన్నడూ విని యెరుగని మాధురులతో అతని హృదయం మోగిపోతోంది. ఇప్పటి శ్రీధర ఉత్సాహం విరుదలబొందిన ఖైదీ ఆనందం. ఇప్పుడతని జీవితం మునుపు చవిచూడని స్వేచ్ఛలో మత్తెక్కిపోతోంది. అందుకే ఆనాడు శ్రీధర లలితకి ఇంగ్లీషుపాఠం చెప్పటం మరచిపోయి "లలితా, నాచీకటిలో వెలుగు చూపించావు. నీ మేలు ఎన్నటికీ మరిచిపోను." అన్నాడు. లలిత విని కూడా విననట్లుగా "ఇవాళ పాఠం లేదా?" అంది. "లేదు లలితా, నీ దగ్గర నేను నేర్చుకోవలసిన పాఠాలెన్నో వున్నయ్." అని శ్రీధర లలితముఖంకేసి చూస్తూవుండిపోయాడు. "అదేమిటి బావా. నువ్వుమాట్లాడేదేమిటో నాకు అర్థమవుతోందా?" అని కొంటెగా అడిగింది లలిత. కుణం నేనుండి శ్రీధర అందుకున్నాడు—"లలితా, నువ్వు మరిచిపోయావేమోగాని నేను మరిచిపోలేదు. మరిచిపోలేను. ఆనాడు మీనాన్న ఎంతో దీనంగా అడిగాడు. నీ జీవితంలో వెలుగు లేకుండాచేసి చీకటితోనింపిన పాపిని నేను. అటువంటి అపరాధిని చీకటిలోంచి వెలుగులోకి తీసుకొచ్చావు. ఉపకారంద్వారా నామీద పగసాధించ లేదావుకాబోలు."

ఈమాటలు విని లలిత కంపించిపోయింది. తల ఎత్తి మునుపటిలాగా శ్రీధరముఖంకేసి చూడలేకపోయింది. మునుపటిలాగా చనువుగా 'బావా' అని పిలవలేకపోయింది. ఛటుక్కునలేచి వెళ్లిపోయింది. తనతో శ్రీధర ఈ మాదిరిగా మాట్లాడటం వింతగావుంది. అతను అన్నమాటల్లో అబద్ధమేమీ లేదు. కాని అటువంటి మాటలని శ్రీధర నోటినుంచి వింటానని మాత్రం లలిత కలలోనైనా తలపోయలేదు.

లీలా అన్నతరవాత శ్రీధర సిగ్గుతో ముగ్గిపోయాడు. లలిత ఇక తనతో ఎన్నడూ మాట్లాడదేమోనని బెదిరిపోయాడు. తను అన్నదానిలో అక్రమమేమీ లేదు. కాని వాటిలో తప్పులేకపోతే లలిత ఆ విధంగా ఎందుకు వెళ్లిపోవాలి? ఆమాటలు వినేసరికి ఆమెముఖం ఎందుకు కందిపోవాలి? ఇక తన హృదయానికి చల్లటి నీడ ఎక్కడ దొరుకుతుంది? ఇక తనమీద అంతకాయి నిచ్చే సుఖాన్నీ, స్నేహాన్నీ, సానుభూతినీ ఎవరిస్తారు? తనమాటలవల్ల నిజంగా అటువంటి ఉపద్రవమే వస్తే ఇక తన కేదిదారి?

* * *

వారాలు గడిచినయ్. నెలలుగడిచినయ్. ఏడాది గిర్రున తిరిగిపోతోంది. కాని శ్రీధరకబురులేదు. జాడలేదు. నాన్న, నాన్న అని ఆశ ఒక టేకలవరింపు. తోడిపిల్లలు తండ్రులని గురించి చెబుతుంటే ఆశ "అమ్మా, నాన్న ఎప్పుడొస్తాడే" అని దీనంగా అడిగేది. ఏం చెప్పాలో తెలియక సరళ తికమకపడిపోయేది. ఏదో చెపితేకాని ఆశ ఊరుకోదు. అందుకని "వస్తారమ్మా రేపొస్తారు" అనేది. కాని అటువంటి రేపులెన్నో వెళ్లిపోయినయ్.

పుట్టింట్లో భర్తని ఎడబాసి తమ్ముడూ, కూతురూవున్న ఈ ఏడాదిలో ఎన్నో అనుకోని మార్పులు జరిగినయ్. సరళకి అడుగడుగునా దెబ్బతాకే సంఘటనలే. అదేమి చిత్రమోకాని తాకిన దెబ్బమీదే మళ్లీ దెబ్బతగులుతుంది. ఈ ఏడాదిలోనే తండ్రి ఉద్యోగం మాని పింఛను పుచ్చుకోవటం జరిగింది. తమ్ముడికి భార్య కాపురానికివచ్చింది. తాళంచెవి తండ్రిచేతుల్లోంచి తమ్ముడిచేతుల్లోకి పోయింది. పేరుకి తమ్ముడుగాని పెత్తనమంతా కారదే. అందువల్లనే సరళపని మరీ ఇరుకునపడింది. ఇంట్లో ఇన్నాళ్లమాదిరిగా స్వతంత్రమూపోయింది. గౌరవమూ తగ్గింది. మాటిపోటి మాట

లతో సరళమీద తార దాడి ఆరంభించింది. ఇంత కాలమూ అక్కగారంటే పువ్వుల్లో పెట్టి పూజించే వాడు తమ్ముడు. ఇప్పుడు తనముందరే తార అక్కని మాటలంటున్నా నోరు మెదపకుండా చూస్తూ ఊరు కునే పరిస్థితివచ్చింది. మనదలు మాటలవల్ల కలిగిన తల వంపుకంటే తమ్ముడు మెదలకుండా ఊరుకోవటమే సరళ సహించలేకపోయింది. ఇక ఈ యింట్లో ఎక్కువకాలం వుండటం అసంభవమని సరళ మనసులో నిశ్చయించుకుంది. కాని ఎక్కడికి పోవటం ? ఏడాది అవుతుంటే తన అతీ గతీ కనుక్కోని శ్రీధరని వెతు క్కుంటూ వెళ్లాలా ? అతనుంటున్న పల్లెటూరికీ, అతని పూరిగుడిసెకీ తిరిగిపోవాలా ? అక్కడ అడుగు పెట్టటమే ప్రాణసంకటంకదా ? కాని తనకి వేరేదారి ఏముంది ?

ఇల్లావుండగా ఒకనాటి పొద్దున్నే సరళ తండ్రి సామానంతా సర్దుకుని కూతురుకోసం కబురంపాడు. "ఎక్కడికి నాన్నా ప్రయాణం ?" అని ఆదుర్దాగా అడిగింది సరళ. ఎన్నాళ్లనుంచో తనకి యాత్రలు చెయ్యాలని వుందనీ, ఉద్యోగంనుంచి విరమించిన దగ్గరనుంచీ ఏమీ పొద్దుపోవటం లేదనీ, అందుకని యాత్రలు చేసివద్దామని బయలుదేరాననీ తండ్రి చెప్పాడు. తనని కూడా వెంట రమ్మంటాడేమోనని ఆశపడింది సరళ. కాని తండ్రి ఆమాటలేమీ లేకుండా "అమ్మా, అతని సంగతేమయినా తెలిసిందా ?" అని అడిగాడు. సరళ లేదని తలవూపింది. "ఇదుగోనమ్మా, తీసుకో, మీ అమ్మ పోతూపోతూ నీ కిమ్మని చెప్పి పోయింది. ఇవిగో నాలుగువేల రూపాయలు. తీసుకో. అతనికి ఉత్తరంరాసి ఎక్కడున్నాడో కనుక్కో. ఇక ఏదయినా ఉద్యోగంలో చేరటం మంచిదని చెప్పు. బండికి వేళయింది, వెళ్లొస్తా" నని చెప్పి సరళ బదులు చెప్పేలోపుగానే బండి ఎక్కాడు.

ఈఘటన ఫిరంగిదెబ్బలాగా తాకింది సరళకి. ఇక ఎవరి అండ చూసుకుని తనూ, తన కూతురూ ఆయింట్లో వుండాలి? ఇక తమని వెనకేసుకొచ్చేవా ళ్లెవరు ? తమని ఆప్యాయంగా ఆదరించేవాళ్లెవరు ? వెళ్లి తీరాలిసిందేనా ? వేరేమార్గంలేదా ? ఆ దేవుడిచ్చే తప్ప తనకి పోదగినతావు లేదా? అని దరీ తెన్నూ లేని అఘాతంలోపడి తన్నుకుంటోంది సరళ. ఆశ పరిగెత్తు కుంటూవచ్చి "అమ్మా, ఉత్తరంవచ్చిందే, నాన్నరా శాడే" అంటూ పట్టలేని ఆనందంతో గంతులువేసింది. సరళ ఆశ్చర్యం పట్టలేక ఆశని అమాంతం ఎత్తుకుని చేతుల్లోంచి ఉత్తరం తీసుకుంది. "నాన్న రాశారని ఎల్లా తెలుసే ?" అంది సరళ. కారణమేమీ చెప్పకుం డానే "నాకు తెలుసుగా." అంది ధీమాగా ఆశ. పట్ట లేని ముద్దువచ్చింది సరళకి.

అది చాలా చిత్రమైన వుత్తరం. ఉత్తవాళ్లని కూడా తలకిందులుచేయగల వుత్తరం. అందులో సరళ చిక్కుకున్న పరిస్థితుల్లో ఆ ఉత్తరాన్ని చదివి తట్టు కోలేకపోయింది. "నీభర్త నీకు దక్కాలనుకుంటే నువ్వు ఈనిమిషంలోనే బయలుదేరిరావాలి. చేతులు కాలి నాక ఆకులుపట్టుకుని లాభంలేదు.— ఇట్లు, నీప్రియ మిత్రురాలు హితకారిణీదేవి." అనివుంది.

ఎందుకనో మొదటినుంచీ అశుభమే శంకిస్తు న్నది సరళహృదయం. అందులో ఈ ఉత్తరాన్ని చదివే సరికి ఆమెని తట్టుకోలేని భీతీ, ఆందోళనా ఆవరించి నయ్. శ్రీధర ఏదైనా ప్రమాదంలో చిక్కుకున్నా డేమో ? అతని కేమైనా జబ్బుచేసిందేమో ? అత నిక తనకి దక్కడేమో ? తన అవివేకానికి ఎంతో విచా రంవేసింది. అతను ఆనాడు 'నువ్వు ఒకరోజు పశ్చా త్తాపపడతా' వన్నమాటలు మాటిమాటికీ గుర్తుకొచ్చి సరళ జలదరించిపోతోంది. ఏమో, ఏం జరుగబోతు న్నదో ? తల్లి తత్తరపాటుని చూసి ఆశ "ఏం రాశా డమ్మా ? నాన్న ఎప్పుడొస్తాడు ? చెప్పవే ? ఎప్పు డొస్తాడే ?" అంటూ తల్లిని చుట్టుకుంది. క్షణంసేపు ఊరుకుంది సరళ, ఏం చెప్పాలో తెలియక. చివరికి అప్రయత్నంగా అనేసింది. "మనమే వెళ్దాం తల్లీ, నాన్నదగ్గరికి"

"ఎప్పుడమ్మా ? ఎప్పుడు ?"

"ఇవాళే వెళ్దాం. ఈరాత్రి రైల్లోనే వెళ్దాం. పద బట్టలు సర్దుకుందాం" అని బయలుదేరింది.

సరళప్రయాణంమాట విని తార పొంగిపోయింది. ఎన్నడూ లేని ఆపేక్ష ఒక్కసారిగా వచ్చిపడింది! నోటినిండా 'వదినా' అని పిలిచింది. ఎన్నడూ లేనిది ఆశని దగ్గరికితీసి "మీఇంటికి వెళ్తున్నావా ?" అంది. రోజూ తార చూపే నిరాదరణకంటె అమాంతం కలి గిన ఈ ఆదరణే మరీ దుర్భరమైంది సరళకి. తను వెళ్లి పోతున్నందుకు తారమనసులో కలిగిన సంతోషమే ఈ ఆదరణగా బైటపడింది. ఇది గ్రహించగానే సరళ గుండె మండి, ఇక ఏమయినాసరే ఈ గడప తొక్క

నే నిశ్చయంతో బయలుదేరి వెళ్ళిపోయింది. ఇక ...ందు తన జీవితంలో ఏ ఆపద వచ్చినా, ఏదుఃఖం ...చ్చినా ఇంకెక్కడికయినా పోవచ్చునుకాని తమ్ముడి ...ంటికిమాత్రం తలదాచుకోటానికి రానని గట్టి పట్టు ...గే వెళ్ళిపోయింది.

దారిపొడుగునా ఆత "ఇంకా ఊరెంతదూర ...మ్మా" అని అడుగుతోంది. నాన్నని తలుచుకుంటూ ...వో కబుర్లు చెబుతోంది. సరళకిమాత్రం మనసు ...నసులో లేదు. ఇన్నాళ్లనుంచీ ఆమె మనసుని కమ్మిన ...బ్బులన్నీ విడిపోయినయ్. ఇంతకాలమూ ధనమూ, ...రిద్రమూ అని అంతరాలు కల్పించుకున్నందుకు ఎంతో ...గ్గపడుతోంది. అసలు ఇంతకాలం ఎందుకు తను ...నరకి ఎడంగా వున్నానని ప్రశ్నించుకుంది. మనస్సు ...న్నో కారణాలు చెప్పింది. కాని అన్నిటినీ సరళ ...ంచివేసింది. ఇంతకాలమూ ఎవరో తనని పెడదారిలో ...డిపించారు. తాను గుడ్డిగా నడిచింది. ఇప్పుడు కళ్ళు ...రిచింది. తన తాహతు ఏమిటి? తన ధన మేమిటి? ...నరసైపు వాళ్లకు లేనిదేమిటి? ఇంతమాత్రానికే తాను ...ాకందరినీ వెలివేసినట్లు చూడటమేమిటి? ఒక్కొ...క్కటే తలుచుకుంటుంటే సరళకి తనమీద తనకే ...ట్టలేని కోపం వస్తోంది. తను ఈ జన్మలో శ్రీనర ...ట్టిన పల్లెటూరి పూరిగుడిసెలో అడుగుపెట్టనని ఇదివర ...కన్నోసార్లు బడాయీలుకొట్టింది. కాని నిజం చెప్పా...ంటే ఇవాళ ఆ పూరిగుడిసె ఎప్పుడు కళ్లపడుతుందా ...ని ఎంతో కొట్టుకుపోతోంది సరళ. శ్రీనరకి ఏంప్రమా...ం జరిగిందో అని భయపడిపోతోంది. అతను సుర...క్షితంగా వుండాలని ఎంతో ఆరాటపడుతోంది.

దోవలో పెద్ద రైల్వేజంక్షను. అక్కడ బండి చాలాసేపు ఆగుతుంది. ఆతకి కాఫీ అయినా ఇప్పిద్దామని సరళ ఆతని చెయ్యిపుచ్చుకుని నడిపించుకుపోతోంది ప్లాట్‌ఫారంమీద. రెండడుగులు వేసిందో లేదో వెనకనించి ఎవరో "హలో మైడియర్ సరళా" అని ఈలవేసి పిలిచారు. సరళ నిలబడిపోయింది. ఆ మనిషిని చూడగానే సరళ వెలవెలబోయింది. ముఖాన కత్తివేసినా నెత్తురు చుక్కలేదు. అడుగు ముందుకి పడలేదు. ఆపుకోలేకుండా లోపలినుంచి గజగజ వణుకొస్తోంది. ఆమనిషి గబగబా అడుగులువేస్తూ సరళ దారికి అడ్డంగా నిలబడ్డాడు. అతని సూటూ, బూటూ, దొరటోపీ, నోట్లో పైపూ చూసి ఆత బెదిరి తల్లి చాటున నక్కి కొంగు గట్టిగా పట్టుకుంది. వీలయితే ఆమనిషిని దులుపుకుపోవాలనుకుంది సరళ. కాని మిలిటరీ వేషంలో వున్న వ్యక్తి సరళకి షేక్‌హాండ్‌కోసం చెయ్యిజాపి "ఎంత అదృష్టం! అబ్బా, ఇన్నాళ్లకి ఇక్కడ కలుసుకున్నాం" అన్నాడు. సరళ అతని చేతిని అందుకోలేదు. అతనికి బదులుచెప్పలేదు. కాని ఆవ్యక్తి వెనక్కి తగ్గలేదు. ఒక్కగుక్కలో ఆరేళ్లకిందట తను యుద్ధంలో డాక్టరుగా చేరినదగ్గరినుంచి జరిగిన ఘటనలన్నీ చెప్పుకుపోయాడు. సరళ వింటోందా లేదా అన్నది అతనికి పట్టలేదు. యుద్ధంలోంచి సుఖంగా తిరిగివచ్చాడట. స్వంతంగా ప్రాక్టీసు పెడతాడట. సరళ ఇదంతా విన్నదో లేదో - కాని ఈ వ్యక్తి యుద్ధంనుంచి తిరిగి రాకపోయినా ఆమెకి చీమకుట్టినంత బాధకూడా వుండేది కాదు. ఇప్పుడు సుఖంగా తిరిగివచ్చినందుకు లేశమయినా సంతోషమూ లేదు. అంతా విని "మంచిది. నేను వెళ్తొస్తా"నని ముందడుగువేసింది. ఆమనిషి తల్లివెనక నక్కిన ఆతని బలవంతాన చేతుల్లో ఎత్తుకుని "హల్లో మై లిటిల్ సరళా" అని ముద్దుపెట్టుకోబోయాడు. ఆత అతని ముఖాన్ని చేతుల్తో దూరంగా తోసేసి అతనితో పెనగులాడి కిందికి జారిపోయింది. "అచ్ఛా గుడ్‌బై" అని ఆ వ్యక్తి ఎంత ఆకస్మికంగా ప్రత్యక్షమయాడో అంత హఠాత్తుగా అదృశ్యమైపోయాడు. అతను వెళ్లిపోయినాక ఎంతోసేపటిదాకా ఆతభయం పోలేదు. తల్లికొంగు విడవలేదు. రైలు కదిలాక ఇక భయంలేదనుకుని కాబోలు "ఎవరమ్మా, బూచాడా?" అంది. వెంటనే సరళ అవునంది. కాని ఆమనిషిని చూసిన దగ్గరనుంచీ సరళమనస్సు వికలమయిపోయింది. కొన్నాళ్లకిందట వచ్చిన పీడకల మళ్లీ వస్తే ఎంత భయపడతామో అంత బెదిరిపోయింది సరళ అతన్ని చూసి. అతన్ని ఈజన్మలో చూస్తాననుకోలేదు. చూడాలని కోరుకోనూలేదు. కాని భర్తకోసం ఆరాటపడుతూ పోతున్న ఈ తరుణంలో ఆవ్యక్తి హఠాత్తుగా ప్రత్యక్షమయేసరికి ఆమెకి పిడుగుదెబ్బ తాకినట్లయింది. గడచిన ఘటనలెన్నో మెరుపులాగా తళుక్కుమన్నయ్. తనూ, అతనూ కాలేజీలో కలిసిచదువుకోటం, తమ ఇంటికి అతను వస్తూపోతూవుండటం, తమ పరివారానికి తండ్రి సంతోషించటం, అతని కిచ్చి పెళ్లిచెయ్యాలనుకోవటం, అతనితో కలిసి విచ్చలవిడిగా తను కారులో షికార్లు చెయ్యటం, అప్పుడు లోకంలో అపవాదు లొకసారి తుపానులాగా రేగటం, తనని నడిసముద్రంలో ముంచి ఆ మోసగాడు ఎవరికీ చెప్పకుండా యుద్ధంలోకి పారిపోవటం, ఆ అపవాదువల్ల

తనకి ఎన్నాళ్ళకీ పెళ్ళికాకపోవటం, చివరికి డబ్బు ఆశతో శ్రీధరని తన తండ్రి వలలో వేయటం...అన్నీ ఒక్కసారి గిర్రున తిరిగినట్లు. తలచుకుంటుంటే సరళకి తెలియకుండానే కళ్ళు తడిసినట్లు. నిజంగా ఆవ్యక్తి కదా తన సర్వనాశనానికి కారణం ? అతనికంటే తనకి పరమశత్రువు వింకెవరూ లేరు. అతను ఎదుటపడేసరికి ఆమె సహించలేకపోయింది. తన గతజీవితమే ఆవ్యక్తి రూపంలో ఎదుటపడి వెక్కిరిస్తున్న ట్లనిపించింది. ఆ పేదనంచి తలదాచుకోటానికి చోటులేదా ? ఆ పీడకల వదిలిపోయి సుఖంగా కాలంగడిపే అవకాశం లేదా ? పీటన్నిటినీ మరిపించి చల్లటి నీడనిచ్చే హృదయం లేదా ? అక్కడికి ఎగిరిపోవటంకంటే, అక్కడ గూడు కట్టుకోవటంకంటే తనకు వేరే కోరిక ఏమున్నది ! అని సరళ ఆలోచనల్లో సుడితిరుగుతోంది. ఊరు వచ్చింది తల్లిబిడ్డల్ని నిద్రపోతున్న ఆశని లేపి క్రిందికి దిగింది.

అక్కడినుంచి సరళ వెళ్ళాల్సిన ఊరు అయిదు మైళ్ళకి తక్కువుండదు. సరళ బండీ మాట్లాడుకుని ఎక్కబోతుండగా వెనకనుంచి "అమ్మాయీ, కాస్త ఆగు తల్లీ!" అని ఎవరో పిలిచారు. ఒక విధవావిడ—ముసలిది మోయలేనంత పెద్దమూటని ఈడ్చుకుంటూ వచ్చి "మాతల్లి కాదూ, నీకడుపున పుడతాను. నీకు పుణ్యముంటుంది. నన్నుకూడా బండీ ఎక్కనియ్యి తల్లీ" అంటూ రొప్పుతూ. తను వెళ్ళాల్సిన ఊరే వెళ్తోంది ముసలమ్మకూడా. తోడు దొరికిందనేకాకుండా గ్రామసంగతులుకూడా వినవచ్చనే ఆశతో సరళ ముసలమ్మకి బండీలో చోటిచ్చింది. బండీ నాలుగడుగులు సాగిందో లేదో ముసలమ్మ కుశలప్రశ్నలు ప్రారంభించింది. సరళ ఎక్కడి నుంచి వస్తోందో, ఎవరింటికి వెళ్తోందో అడిగి తెలుసుకుంది. "నువ్వేనా తల్లీ. మా శ్రీధరాయి పెళ్ళానివా ? ఒక్కసారయినా మావూరు రాకపోతివి. కలవారింటి బిడ్డవనీ, పెద్దచదువులు చదువుకున్నావనీ విన్నాం కాని మాబంగారుతల్లిని ఇన్నాళ్ళకి చూశాను. నా పుణ్యం ఏం చెప్పను." అని అంతటితో ఆగక సరళ గడ్డాన్ని మునివేళ్ళతో తాకి ముద్దాడింది. సరళ రానంటున్నా బలవంతాన లాగి ఒళ్ళో కూచోబెట్టుకుంది. కొంచెంసేపు మెదలకుండా కూచుని ముసలమ్మ ఒక్కసారి "అమ్మోయ్ తల్లీ, నాబంగారుతల్లీ, నిన్ను చూస్తే నాకడుపు తరుక్కుపోతుందమ్మా, ఇంత చిన్నతల్లికి ఎటువంటి కష్టం వచ్చిపడిందే" అని వెక్కివెక్కి శోకాలు పెట్టసాగింది. ఇది వినగానే సరళకి చేతులు చల్లబడి రక్తం ఆగిపోయినట్లు చైతన్యం తగ్గిపోయింది. శ్రీధరకి ఏదో ప్రమాదం జరిగిందన్న భయం మరీ వణికించసాగింది. కారణం చెప్పకుండా ముసలమ్మ శోకాలుపెట్టేసరికి మరీ బెదరిపోయింది. "ఏం జరిగిందో చెప్పండి మామ్మగారూ" అని సరళ విన్నవించుకున్నది. మారుగా ముసలమ్మ "ఏం చెప్పే తల్లీ ! నానోరు రావటంలేదు. ఏం జరగాలో అదే జరిగిందమ్మా. ఒక్కసారి నానోరు పడిపోరాదమ్మా" అంది. ఇది విని సరళ మరీ కంపించిపోయింది. "మామ్మగారూ, వారికేమయినా ఆపదవచ్చిందా ? ఏమిటో చెప్పండి. నన్ను చంపకండి. చెప్పండి" అని దీనంగా అడిగింది. ముసలమ్మ దుఃఖాన్ని ఒక్కసారి దిగమింగేసింది. సరళని తన గుప్పెట్లో చిక్కించుకున్నది. ఇక ఏడుపుతో పనిలేదు. సావకాశంగా చెప్పనారంభించింది. అంతా చెప్పి "వాడిని అనవలసిన పనేముంది తల్లీ ! ఆ జిత్తులమారి వలలో వేసుకుంది. నా బంగారుతల్లికి ఇంతద్రోహం తలపెట్టింది. దాని కిక ఏడుజన్మలైనా ఫుట్టగతులుంటయ్యా ?" అని ముగించింది. అంతా విన్న సరళ వెలవెలబోయింది. ఇటువంటి ప్రమాదాన్ని సరళ కలలోకూడా శంకించలేదు. ఆమెకు దరీ తెన్నూ కనిపించలేదు. ఇక తను అక్కడికి వెళ్ళవలసిన పనేముంది ? వెనక్కి బండీ తిప్పమంటే ? తిరిగి గుర్రైలులో వెళ్ళిపోతే ? కాని ఎక్కడికి తిరిగివెళ్ళటం ఆశని ఎల్లా మరిపించటం ? అయినా ఇదంతా నిజమేనా ? ఏమో ? ఏం., ఎందుకు నిజంకాకూడదు అవును. తను అతని మనసుని కష్టపెట్టిన ఘట్టాలూ బాధపెట్టినసమయాలూ వందలు వేలు కళ్ళకు కట్టుకున్నయ్. తనకీ అతనికీ మధ్య ఉన్న సంబంధం ఎంత బలహీనమైనదో సరళకి వెంటనే గోచరించింది. ఇంతకాలమూ తను తాళం చెవి చేతులో వుంచుకుని అతన్ని చీకటిగోట్లో పడేసి వుంచింది అతను తను చేసిన పనులన్నీ ఎందుకు క్షమిస్తాడు అతని సహనాన్ని తను ఎంత క్రూరంగా పరీక్షించింది ? అవును. శ్రీధర నిజంగా ఇంకో స్త్రీకి హృదయం అర్పిస్తే అందులో అతని తప్పేమీ లేదు ముమ్మాటికీ లేదు. అతనిమీద ఎంత నిందమోపాలన్నా సరళకి సాధ్యంకావటం లేదు. అతను లేశమైనా దోషం లేనివాడిలాగా చిరునవ్వుతో సరళహృదయంలో ప్రతిబింబిస్తున్నాడు. అయినా అతనికిటువంటి ప్రమాదం సంభవిస్తుందని తను ఎన్నడూ భయపడలేదు. అదీ తన తప్పే. బంగారుపంజరంలో పెంచినంతమాత్రాన చిల

తికాళాన్నీ, తోటల్నీ మరిచిపోయి పంజరాన్నే ప్రేమిస్తుందా? కత్తివేటులాటి ఈ వార్తతో సరళ ఒక్కసారి కళ్లు తెరిచింది. మునుపటి సరళపనులన్నిటినీ ఇంకెవరో చేసినట్లుగా ఇప్పటి సరళ నిర్దాక్షిణ్యంగా ఖండించివెయ్యగలుగుతోంది. కాని ఏదో నిరాశా, నిస్పృహా వచ్చి ఆమెమనసుని కమ్మివేస్తున్నయ్. తను శ్రీధరదగ్గిరికి వెళ్తే అత నేమంటాడో? తనని ఏవిధంగా చూస్తాడో? ఒకటిమాత్రం నిజం. తన మనసుని ఏ మాత్రం చిన్నబుచ్చినా తాను సహించదు. అక్కడ తానొక నిమిషంకూడా నిలవలేదు. ఆళని అతనికి అప్పగిస్తుంది. ఈమెభారం నీదేనని చెబుతుంది. తానుమాత్రం అక్కడినుంచి మాయమైపోతుంది. ఎక్కడికి పోవాలో అప్పుడే నిశ్చయించుకుంటుంది.

దారిపొడుగునా క్షణంలో ఎండా, క్షణంలో మబ్బూ. రైలుదిగిన దగ్గరనుంచీ ఆళ తల్లిఒడిలో తల పెట్టి నిద్రపోతూవుంది. సరళ ఎడతెరిపిలేని ఆలోచనలలో గిరగిర తిరిగి పోతోంది. ముసలమ్మ తాను చెయ్యవలసింది ఇంకేమీ లేదనుకునికాబోలు మెదలకుండా రుద్రాక్షతావళం తిప్పుతూ రామనామజపం చేస్తోంది.

ఊరిబైటే ముసలమ్మ దిగిపోయింది. బండి సరాసరి శ్రీధర బడివాకిటిముందు వచ్చి ఆగింది. తిరిగి వెళ్లిపోదామనే ఉద్దేశంతో బండీవాడిని సామానులు తీసి ఎద్దుకు మేత వేసుకోమని చెప్పింది. బండీ ఆగగానే ఆళ ఎవరో కొట్టిలేపినట్లు లేచింది. ఆఇల్లు తను ఇదివరకునుంచీ ఎరిగున్నట్లుగానే లోపలికి ఒక్కపరుగుతీసింది. సరళ సంకోచంతో వీధివాకిట్లోనే నిలబడివుంది. ఆళ పరుగు తీసి 'నాన్నా' అంటూ లోపలికి పోయింది. వచ్చీ రావటమే తండ్రిపక్కమీదికి ఎక్కి కూచుంది. "అమ్మవచ్చిందా?" అన్నాడు శ్రీధర. "వచ్చింది." అని చెప్పింది. చిక్కిపోయిన చేతులతో ఆళని గుండెలకదుముకుని శ్రీధర విడవలేదు. ఆళమాటలు విని లలిత గబగబా వాకిట్లోకి వెళ్లి "లోపలికి రా అక్కా. నీ ఇంట్లోకి నువ్వు రావటానికి బిడియపడతావేమిటి? లోపలికి రా" అని సరళ చెయ్యి పుచ్చుకుని గుంజుకుపోయింది. "ఎంత నటన! ఎంత కపటం! నాకేమీ తెలియదనుకుందికాబోలు." అని సరళ లోపల అనుకుంటోంది. లలితచెయ్యి విదిలించేసుకోవాలనిపించింది. కోపంతో లలితముఖంకేసి చూసింది. మారుగా లలిత కళ్ళల్లో చిరునవ్వులు మెరిపించింది. "కోపమెందుకక్కా? నీ ఇంట్లోకి నువ్వు రాక వెనకాడుతుంటే బలవంతాన లాగుకొచ్చాను. అందుకేనా కోపం?" సరళ బదులుచెప్పలేదు. ఇంత మాటలు నేర్చిన మనిషి ఎందరి హృదయాలనైనా వలలో వేసుకుంటుంది. అందులో అనుమానమేమీ లేదు. ఇంత నేర్పరి ఎందరినైనా కీలుబొమ్మలుగా చేసుకుంటుంది. అనుకుంటుండగా మళ్ళీ చెయ్యిపుచ్చుకుని లాగుతూ "బావా, ఇదుగో వచ్చింది అక్క. నువ్వు పిలిస్తేకాని లోపలికి రాదు. అవునుమరి. పిలూ." అంటూ శ్రీధరమంచందగ్గిరికి గుంజుకుపోయింది. సరళ తలవంచుకుని నిలబడింది. "ఎందుకు వచ్చాను ఇక్కడికి?" అని తనని తాను లోపల నిందించుకుంటోంది. స్టేషనుకు తిరిగివెళ్ళిపోతే ఎంత బాగుండేది? ఇప్పుడు నేనిక్కడ ఎల్లా నిలవగలను? ఇప్పుడు శ్రీధరని ఎల్లా పలకరిస్తాను? ఇక శ్రీధరమీద తన కేమి అధికారముంది? ఇంకొకరి చేతిక్కిన సొత్తు నాది అనుకున్నంతమాత్రంలో మనస్సుకి క్షోభ తప్ప కలిసివచ్చేదేముంది? అయినా ఆళ ఎంత నిశ్చయంగా వెళ్ళి తండ్రిమీద కూర్చుందో? ఆళకిమాత్రం అక్కడ చోటుందా? అనుకుంటుండగా శ్రీధర సరళముఖంకేసి చూసి ఆమెకి తెలియకుండానే తలతిప్పుకున్నాడు. ఏంమాట్లాడాలో అతనికి అంతకంటే తెలియటంలేదు. పోనీ, సరళ మాట్లాడుతుందేమోనంటే అదీ కనబడటంలేదు. ఈ మౌనం అక్కడున్నవారినందరినీ మోయలేని బరువుతో కుంగదీస్తోంది. అందరిమాటా అటుంచి లలితకి మరీ దుర్భరంగావుంది. "మా బావా, బావా, పందెంలో నేనే గెలిచాను." అంది లలిత. "ఏమో, నాకు నమ్మకంలేదు" అన్నాడు శ్రీధర. ఈమాటల అర్థం తెలియక సరళ ఒకసారి లలితని, శ్రీధరనీ చూపులతో గాలించింది. ఏమీ బోధపడలేదు. తండ్రిగుండెని దిండుగాచేసుకుని ధీమాగా పడుకున్న ఆళ "నాన్నా, ఎప్పుడూ ఇక్కడే వుంటాను నాన్నా. ఇక తాతయ్యగారింటికి పోవద్దమ్మా. ఇక్కడేవుందాం." అంది. సరళ ఏమీ మారుచెప్పకుండా నిలుచుని శ్రీధర ముఖంకేసి చూస్తూ వుండిపోయింది. చిక్కిపోయిన అతని ముఖంలో ఒక ఆనందరేఖ తళుక్కున మెరిసింది. శ్రీధర ప్రయత్నంమీద అడిగాడు-"నువ్వు కులాసాగా వున్నావా?" అని. సరళకి ఈ ప్రశ్న చురుక్కున తాకింది. ఇంతసేపటినుంచీ తను భర్తక్షేమాన్ని గురించయినా అడగలేదు. అతను మంచంపట్టి చిక్కిపోయి, పాలిపోయి కనబడుతున్నా తను నోరుతెరిచి అడగలేదు. 'నా యోగక్షేమాలతో మీకు అవసరమేముంది?' అనాలనుకుంది. కాని నోరుపెగలలేదు. చివరికి తలమాత్రం ఊపింది కులాసాయే అన్నట్లు.

ఇంతలో లలిత కాఫీ కాచి తెచ్చి ముందు పెట్టింది. ఎంత బలిమాలినా సరళ వద్దంది. లలిత ఇది కనిపెట్టి "నువ్వు చెబితేగాని తాగదు బావా. అక్కని తాగమని చెప్పు." అంది. శ్రీధర వెంటనే మంచంమీద లేచి కూచుని "తాగు సరళా, నీ ఇంట్లో నువ్వు బలిమాలించుకుంటావా?" అన్నాడు. ఆమాట వినగానే సరళ కన్నీళ్ళు నాపుకోలేకపోయింది. కాఫీకప్పు [illegible] కాని ఒక్క [illegible] వెయ్యలేక పోయింది. వేళ్ళు [illegible] ఇది నా ఇల్లా? [illegible] చెప్పండి. ఈ ఇంట్లో నాకు అడుగుపెట్టే అధికారముందా అని సూటిగా అడగదలచింది. కాని ఆ ఉద్వేగంలో కాఫీ ఒలికిపోవటం చూసి సిగ్గుపడింది. నోట మాటరాలేదు.

సరళమనోభావాన్ని లలిత వచ్చినదగ్గరనుంచీ కనిపెడుతూనేవుంది. ఆమె సమయంకోసం వేచివుంది. ఇంకా సమయంరాలేదు. నిజంగా రాలేదు.

ఆనాడంతా సరళ పెడపెడగా వుంది. శ్రీధర దగ్గిరికి పోలేదు. ఒక్కమాటయినా మనసారా మాట్లాడలేదు. అతనికి వేళకి జావా, కాఫీ అన్నీ లలిత యంత్రంలాగా అందిస్తోంది. క్షణమైనా అతనికి ఆలస్యం జరగనివ్వదు. పగలంతా బడిపనిలో తీరిక చేసుకుని మధ్యమధ్య వచ్చి ఏంకావాలని అడిగిపోతుంది. రాత్రి అతనికి నిద్రపట్టకపోతే అతనిపక్క దగ్గర కుర్చీ వేసుకుని కూచొని విసురుతూ తను చదివిన హిందీపుస్తకాల్లోని కథలన్నీ కళ్ళకికట్టినట్లు చెబుతుంది. వినివిని శ్రీధర నిద్రపోతాడు. అప్పుడు వచ్చి పడుకుంటుంది. రాత్రి మెలకువ వచ్చినప్పుడల్లా లేచివెళ్ళి శ్రీధరనిద్రపోతున్నాడో లేదో చూసివస్తుంది. ఇల్లా శ్రీధరకు జబ్బుచేసిన దగ్గరనుంచీ జరుగుతూవుంది. సరళవచ్చిననాడు కూడా ఆగాదిరిగానే లలిత క్షణం ఏమరకుండా శ్రీధరకి సేవచేస్తున్నది. ఇది చూస్తుంటే సరళకి మరీ రూఢిగా తేలిపోయింది. శ్రీధరమనసులో తనకి చోటులేదు. తన సేవవల్ల ఈ స్త్రీ అతన్ని పూర్తిగా వశపరచుకుంది. ఇక తనకి అక్కడ ఆశ్రయం లేదు అని బాగా నిశ్చయించుకుంది. శ్రీధర కథలు విని నిద్రపోయాడు. లలితకూడా నిద్రపోయింది. తండ్రి పక్కలో ఆశకూడా గాఢంగా నిద్రపోతోంది. చప్పుడు చెయ్యకుండా పిల్లిఅడుగులు వేసుకుంటూ సరళ శ్రీధరమంచం దగ్గిరికి వెళ్ళింది. క్షణంసేపు అక్కడ నిలబడింది. ఆశ తండ్రిగుండెలమీద [illegible] నిద్రపోతోంది. [illegible] అప్రయ[illegible]త్నంగా సరళకళ్ళు చెమ్మగిల్లినయ్. ఇక అక్కడ తనకి నిలబడే అదృష్టం లేదు. అవకాశం లేదు. తను వెళ్ళిపోవలసిందే. ఎక్కడికి వెళ్ళాలో తెలియదు. కాని అక్కడ నిలవటానికిమాత్రం మనసొప్పటం లేదు. మసకచీకటిలో మెల్లిగా అడుగులువేస్తూ వెనుదిరిగి ఆశకేసీ, శ్రీధరకేసి చూస్తూ గుడిసెబైటికి వచ్చింది. ముందుకి పోవటానికి కాళ్ళాడలేదు. ఎవరో వెనక్కి [illegible] నీదగ్గరున్నదేమిటి? [illegible] పిరికిపందలాగా పారిపోతావా? శ్రీధర హృదయసామ్రాజ్యాన్ని పాలించే అధికారం నీదికాదా? అక్కడ ఇంకొకరి విజయపతాకం ఎగురుతుంటే చూస్తూ ఊరుకుంటావా? ఇంతమాత్రం చేతకాదా? అని సరళలోపలినుంచి ఎవరో ఖంగున మ్రోగే కంఠంతో చెబుతున్నారు. అవును, నేను ఓటమిని ఒప్పుకోను. ప్రయత్నిస్తాను. అన్నివిధాలా ప్రయత్నిస్తాను. అప్పటికిగాని ఇక్కడనుంచి కదలను. ఏమయినాసరే కదలను. ఎవరు నన్నిక్కడినుంచి గెంటివేస్తారో చూస్తాను. ఎవరికి అధికారముంది? ఎవరికి ధైర్యముంది? నిజానికి తను ఇంత నిరాశపడవలసిన అవసరమేముంది? అయినా ఆ ముసలమ్మమాటలకి తను అంత విలువ ఎందుకివ్వాలి? ఎన్నడూ అబద్ధమాడి ఎరుగని శ్రీధర నీఇంటికి నువ్వురమ్మని పిలుస్తుంటే తనెందుకు వెనకాడాలి? లలిత అంత ఆప్యాయంగా ఆదరిస్తుంటే తను ఆమెని ఎందుకు దులుపుకుంటూ దూరంగా తిరగాలి? ఒకవేళ లలిత శ్రీధరహృదయాన్ని వశంచేసుకున్నా తను తిరిగి జయించాలి. ఈ ప్రయత్నంలో తనప్రాణం పోయినాసరే. అంతకంటే తనకి కర్తవ్యమేముంది? ఇక్కడినుంచి పారిపోయి తను ఈ ప్రపంచంలో ఏంచెయ్యాలి? రాత్రంతా సరళకి నిద్రపట్టలేదు.

"అక్కా, నిద్రపట్టిందా బాగా" అని అడిగింది లలిత పొద్దున్నే. పట్టిందని సరళ అబద్ధమాడింది. లలితకి అసలు సంగతి తెలుసు. ఎందుకు పట్టలేదోకూడా సరిగ్గానే ఊహించగలిగింది.

శ్రీధర లేవగానే ముఖం కడుక్కోటానికి చెంబూ, నీళ్ళూ, పళ్ళపొడీ ఎదురుగా పెట్టివున్నయ్. వెంటనే కాఫీకూడా వచ్చింది. కాని తెచ్చింది లలితకాదు, సరళ. ఆనాడు పగలంతా శ్రీధరపక్కదగర కూచుని [illegible] ఉపచారాలుచేస్తున్నది లలితకాదు—సరళ. రాత్రి అతని

షేక్స్పియర్ నాటకం చదివి వినిపించింది సరళ. సరళ పక్కనే కూచుని వింటూ లలిత లోలోపల పొంగిపోతోంది.

ఇదంతా శ్రీధరకి అద్భుతంగా వుంది. ఇల్లా జరుగుతుందని కలలోనైనా అనుకోలేదు.

రోజులు తిరిగిపోతున్నయ్. లలిత పగలంతా బడిపనిలో మునిగిపోతోంది. క్రమంగా శ్రీధర కోలుకొని బడికి వెళ్ళే ఓపిక వచ్చింది. "సరళా, రేపటినుంచీ బడికి వెళ్తాను."

"అప్పుడేనా ? ఇంకా బాగా ఓపికరాలేదు." అని సరళ అడ్డుపెట్టింది. ఈసమాధానం విని శ్రీధర మరీ చకితుడైపోయాడు. కాని సరళ ఈమాదిరిగా ఎందుకు మారిపోయిందో తన్నుకున్నా అతనికి తెలియటంలేదు.

కొన్నాళ్ళు పోయాక శ్రీధర సరళని పరీక్ష చేయటంకోసం "సరళా, నాకు ఆపదసమయంలో వచ్చావు. కాపాడావు. ఇక నీకు ఇక్కడ ఉండటం సుఖంగా లేకపోతే మీనాన్నగారి ఊరు వెళ్ళిపోవచ్చు" అన్నాడు. వెంటనే సరళ అతన్ని మధ్యలోనే ఆపి "ఇక ఎన్నడూ ఆమాట రానివ్వనని ఒట్టువెయ్యండి." అని కన్నీటితో అడిగింది. సూర్యుడు పడమట ఉదయించాడా అనిపించింది శ్రీధరకి.

ఆరోజు ఆశ పుట్టినరోజు. అందరి మనసులూ ఆనాడు ఆనందంతో నిండిపొంగుతున్నయ్. భోజనాలయినాక లలిత శ్రీధరని అడిగింది—"బావా, ఇప్పుడు చెప్పు, పందెంలో ఎవరు గెలిచారో?" శ్రీధర నవ్వుతూ వెంటనే అన్నాడు—"నువ్వే గెలిచావు లలితా. ఎట్లాగైనా మీ ఆడవాళ్ళ మనసులు ఆడవాళ్ళకే తెలియాలిగాని మాకేం తెలుస్తయ్?" ఇన్నాళ్లనుంచీ అడిగి తెలుసుకోవాలని తహతహలాడుతున్న సరళ ఆరాటం పట్టలేక అడిగింది-"ఏంపందెంలలితా ? నా కూడా చెప్పవ్ ! ఎవరు గెలిచారో నేను చెబుతాను." అని. లలిత క్షణంసేపు ఊరుకుని శ్రీధరముఖంకేసి చూసి చిరునవ్వుతూ బదులుచెప్పింది. "ఏంలేదు అక్కా. ఒకనాడు బావకి జ్వరం బాగా తీవ్రంగా వుంది. ఆశని చూడాలని ఒకటే కలవరించాడు. అప్పుడు నేను 'బావా, అక్కనీ ఆశనీ రమ్మని రాయనా' అని అడిగాను. 'వద్దు. నీ చేతకాదు. మీ అక్క ఎన్నటికీ రాదు, రప్పించటం నీతరంకాదు.' అని నిరాశతో అన్నాడు. అప్పుడు నేను రప్పిస్తానని పందెంవేశాను. ఎల్లా రప్పిస్తావన్నాడు. ఒక్క ఉత్తరంతో రప్పిస్తానన్నాను. నీతరం కాదన్నాడు. చూద్దాంగా అన్నాను. అదీ మాపందెం. ఇప్పుడు నువ్వే చెప్పు అక్కా, ఎవరు గెలిచారో ?"

సరళకూడా నవ్వింది. ఆ నవ్వుతో లోపలి బరువంతా ఎగిరిపోయింది. "అయితే, లలితా, నిజం చెప్పు. నువ్వనా దేమిటి హితకారిణీ దేవివి?" అని అడిగింది. లలిత నవ్వుతూ నేనేనని తలవూపింది. సరళకి పట్టలేని సిగ్గూ, చెప్పలేని సంతోషమూ ఒక్కసారి వచ్చి "లలితా, నీమేలు జన్మజన్మాలకీ మరిచిపోను" అంది. "అల్లా అనబోకు అక్కా. నేను చేసిందేముందీ?" అంటూ లలిత వెళ్లిపోవటానికి లేచింది.

ఇంతసేపూ అమాయకప్రేక్షకుడిగా వుండిపోయిన శ్రీధర లేచివచ్చి "నువ్వు చేసిన మేలు ఇంకెవరు చేస్తారు లలితా ? మనుష్యుల సంగతి అటుంచి దేవతలుకూడా చేస్తారో లేదో చెప్పలేను." లలిత నిలబడిపోయి తలవంచుకుంది. శ్రీధర మళ్ళీ అందుకున్నాడు-"అయితే లలితా, మన ఆశకి అక్షరాభ్యాసం ఎప్పుడు ?"

"ఇవాళే చేద్దాం. ఏం ఆశా, వస్తావా ఒళ్ళోకి?"

ఆశ వెంటనే లలితచంక ఎక్కి కూచుంది. "ఆశతోపాటు నన్నుకూడా నీఒళ్ళో చేర్చుకుంటావా లలితా? " అని అడిగింది సరళ. లలిత నవ్వుతూ బదులు చెప్పకుండా ఊరుకుంది. "నవ్వులాటకాదు లలితా, నిజంగా నీదగ్గర మళ్ళీ ఓనమాలు దిద్దుకోవాలని వుంది. నన్ను నీఒళ్ళోకి రానివ్వకపోతే వీల్లేదు." అంది. శ్రీధర "ఇదిగో లలితా, కొత్తశిష్యులు వచ్చారనే సంతోషంలో ఈ పాతశిష్యుడి మాట మరిచిపోకు. తెలిసిందా ? " అన్నాడు.

చెదిరిపోయిన మబ్బుల్లోంచి సూర్యుడు మిలమిల మెరుస్తూ కిలకిల నవ్వాడు.

# ఆరామంలో పిల్లులపటాలం

✵

= శ్రీ ముద్దా విశ్వనాథం =

లోగడ ఎంతోమంది మిత్రులు చెప్పారు. ఎన్నాళ్లనించో నాకూ కుతూహలంగానే వుండె. అంతమాత్రాన కలిసిరావడ మెట్లా?—దేనికయినా టయిమ్ రావాలికదా అని చెప్పి సరిపెట్టుకుంటూ వూరుకున్నా.

సరి—'పండూ పండింది, కాకీ వాలింది' అన్నట్టుగా, ఈమధ్య ఒకనాడు దానంతటదే అవకాశం తగిలింది. తలవని తలంపుగా శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి వూరికి బయల్దేరా.

అంపాపురంలో బస్సు దిగి ఒక్కసారి దశదిశలూ కలయజూచా. అక్కణ్నించి నాలుగుమైళ్లు నడిచివెళ్లాలి, సూరారానికి. నేనూ, నా హోల్డాల్ పట్టుకున్న బుడ్డోడూ (పది కృష్ణాజిల్లామాండలికం) కాలు సాగించాం. పొలాలు, పొలంగట్లంట అడ్డుతగిలే ముళ్లు, మధ్యమధ్య తరుచ్ఛాయలు, ఎండిపోయిన కాళ్లను తడుపుతూవుండే పిల్లకాలవలు, నడక సాగనీయక ఆటంకపరిచే యిసికపర్రలు, మానవుడి శక్తియుక్తుల్ని పరిశోధించే రాతిగుట్టలు—ఇవన్నీ దాటుకు వెళ్తాంటే ఇపుడు మహోన్నతకు సాగిస్తున్న మహాప్రస్థానం టమని తలపుకువచ్చింది.

దారంట వెళుతూంటే, మదరాసు వాతావరణం మారిపోయింది. అంతేకాదు. మనస్సునుండి మరలిపోయింది. నాకు తోడుగా ఒక క్రిస్టియన్ ముసలతడు తారసపడ్డాడు. నా లోగుట్టు ఆరాతీస్తూ అతడు చిటికలో కూపీ లాగేశాడు. శివరామశాస్త్రిగారు సూరారంతోటలో స్థావరం ఏర్పరుచుకోటానికి గల హేతువులు- మరి, వారి ప్రతిభావిశేషాలూ నిండు హృదయంతో వినికిడి చేశాడు. అతడు చెప్పిన చరిత్రంతా ఆయనపట్ల అనుకూలంగానే వుంది. అతడి అభిప్రాయాలన్నీ శ్రద్ధతో విన్నా.

క్రమంగా ధోరణి మార్చి, తన ఆత్మచరిత్రను (దారిలో నడుస్తూనే) నాకు అంకితం చేదామనే కుతూహలం అగపరిచాడు. నేనూ కాదనలేదు. తన పేదరికమూ, వృద్ధాప్యంలో సుఖజీవనానికై ఓచిన్న కొంప సంపాయించాలనే అభిలాష, అధికార్లకి అతడు పెట్టుకునివున్న అర్జీల తీరులు- ఇవన్నీ చెప్పీ చెప్పీ, చివరికి పర్యవసానం ఏమిటవుతుం దంటారని ప్రశ్నించాడు ఆత్రంతో— అమృతతుల్యమయిన నా నోటిమాటకోసం చెవులు రిక్కించివున్నాడు.

ఓస్, ఇదెంతపనోయి తాతా!—నువు ఈవిధంగా చెయ్యి అని కొన్ని కిటుకులు సూచించా. ఇటువంటి విషయాల్లో చాలామంది మిలిటరీవాళ్లు మనల్ని ఆశ్రయించి, మన సిఫారసుమూలకంగా మేలు పొందారనిన్నీ, మదరాసులో అధికారవర్గము యావన్మందీ మన గుప్పిట్లో ఉన్నారనీ, అతని మనసుకి తియ్యగా తగిలేటట్టు కోతలు కోశా. మీరు తండ్రిలాటివారని ఒక చిన్న బిరుదు పడేశాడు నాపయిన, కోరకుండానే. ఈ స్వల్పపరిచయానికే ఆ క్రిస్టియను తాత కృతజ్ఞతా సూచకంగా వూరిపొలిమేర దాటేవరకు మమ్మల్ని సాగనంపి, సూరారందారి అదుగో అని చూపించి, విడవలేక విడవలేక విడిపోయాడు.

ఇక నొక్క అరగంటసేపట్లో శాస్త్రిగారి గృహం చేరకుంటా మన్నమాట. లోగడ ఒకప్పుడు వారి దర్శనం చేసినప్పటినించీ శాస్త్రిగారినిగురించి ఒకరకమయిన వుద్దేశాలు మనస్సులో నాటుకుపోయాయి: ఆయన మితభాషి అనీ, కోపానికి దూర్వాసుడనీ, సామాన్యులు దర్శించటానికి సుగమసాధ్యులు కారనీ, అస్తమానం ఏ శరత్ బాబు నవలలో ఊహు అనుకరిస్తూ కూర్చుంటారనీ—ఇట్లా...

ఇటువంటి వ్యక్తితో ఎట్లా ప్రసంగించటం!—అంతా కత్తిమీది నడక!—అనుకుని సంశయాత్మలో అడుగులు వేస్తున్నా.

అసలు గ్రామానికి ఇంకా రెండుఫర్లాంగుల్లో కన్ను చెదిరేటటువంటి ఒక తోట- అందులో ఒకేఒక యిల్లు. అదే అయివుంటుం దనుకున్నా శాస్త్రిగారిది. అవును, నావూహ నిజమే అయింది. అప్పటికప్పుడే ఒక అబ్బాయి మా రాక తెలియజేసినట్టుంది, శాస్త్రి గారు ఎదురొచ్చేశారు, మందహాసంతో.



[శ్రీ వేలూరి శివరామశాస్త్రి]

'ఏబండీలో వచ్చారూ?' అని పలకరించారు.

'ప్యాసెంజర్లో వద్దామనుకున్నా నండి ముందు. కాని, మెయిల్లోనే బయల్దేరడం పడింది' అన్నా. కాళ్లు కడుక్కో నీళ్లిచ్చి, స్వయంగా పడకుర్చీ పట్టుకొచ్చి వేశారు హాల్లో. పాదప్రక్షాళన కావడం తోనే 'ఆ' హాల్లోపడకుర్చీలో కూర్చున్నా.

'ఆ' హాలంటే మామూలేమో అనుకునేరు గనక. అటువంటి హాలు ఇంతవరకూ చూసి యెరగను. సారస్వతార్చకులు ఎంతోమంది—మన కిటువంటి హంగుల్తో యిటువంటి ప్రదేశం ఉండిఉన్నట్టయితే ఎంత చక్కటి రచనలు సాగించగలమో!- అని ఉవ్విళ్లూరడం నాకు తెలుసు. నేనూ అందులో ఒకణ్ని గనుక. ఊహాగానమే తప్ప, ఇదమిత్థమని ఒక నిర్మాణానికి తెగలిగిన ఆరాధకుడు ఒక్కడూ నేటివరకు నాకు అగపడలేదు.

ఇట్లా ఆనేకులు వ్రాయసకాండ్రు కావాలని మనస్సులో సంకల్పించేదానికి శాస్త్రిగారు రూప మిచ్చి ప్రత్యక్షంగా చూపగలిగారని అవగతమయింది.

గాలికి గాలీ, వెలుక్కి వెలుగూ—తలుపులు తీయనక్కరలేదు, కిటికీలు మూయనక్కరలేదు! మనతో పరిచయమున్న గ్రంథజాలము యావత్తూ కను మూసినా తెరిచినా ఎదుట కనబడుతూవుండటం, రా అనేసరికి కోరిన పుస్తకం తలుచుకున్న దీరువాలోంచి చేతులోకి రావడం, పని కాంగానే పో అంటే వెళ్లి పోయి అలమారాలో దాని స్థానంలో అది అమరి పోవడం!—ఉత్తరాలు కొట్టిపెట్టడానికి ఒక వైపు మనం—రాసిన గ్రంథాలకు అనువయిన బొమ్మలు తయారుచేసిపెట్టడానికి 'పక్కనే మనసుకలిసిన చిత్ర కారుడు—ఇదంతా చూచి ఇంద్రజాలమా అనిపించింది. ఈ నట్టడవిలో — పల్లెటిపట్టులో—అబ్బా, ఎన్ని హంగులు! అని విస్తుపోయా.

ఇంతింత గొప్ప పుస్తకాలు రాసివేస్తున్నారు శాస్త్రిగారూ అంటే—ఇదేమయినా మంత్రబలమా, ఉపాసనాబలమా అనుకునేవాణ్ణి, చెప్పొద్దూ—ఇంతకు మునుపు.

అమ్మయ్యా, తెలిసిపోయింది కీలకం!—వేలూరి వారి ఉద్గ్రంథరచనకి కారణమయింది కేవలమూ వారి పాండిత్య ప్రకర్ష కాదు. కానేకాదు. మానవహృదయంలో కవిత్వాన్ని మొలకలెత్తించే ఆ మహత్తర మయిన కుటీరం. ఉపాధ్యాయ—కుటీరమూ కాదు. ఆ ఋషివాటికలోని 'ఆ' హాలు.

మీరు ఖండాంతరాలు దాటి అమెరికావంటి బ్రహ్మాండమైన దేశాలు చూచిఉండవచ్చు. అక్కడ ఆకాశాన్నంటే అరవై అంతస్తుల భవనాలున్ను చూశారేమో. ఇందుకు సుతరామూ ఆశ్చర్యపడను. కాని— సారస్వతసేవకుడికి సరిగ్గా సరిపడేటటువంటి హాలు మాత్రం మీకు చూచివుండరని ఘంటాపథంగా చెప్పగల.

కుర్చీలో కూచున్నాను. శాస్త్రిగారు ఎవో కుశలప్రశ్నలు వేస్తున్నారు. నేను అర్థంకాగానే జవాబులు చెబుతున్నా. నా దృష్టి అంతా ఆ హాలు మీదనే వున్నదాయిరి. జీవితంలో మనకి గృహనిర్మాణ యోగ మంటూ వుందని ఏదైవజ్ఞుడైనా కాస్తంత మంచి మాట చెప్పడమే తటస్థించినపక్షమందు, ముందు ఇటువంటి హాలునిర్మాణానికి శంకుస్థాపన చేసి కాని మరోపనికి వెళ్లనన్నమాట. ఇది నా దీక్ష. ఈ నిశ్చయంతోనే మళ్లీమళ్లీ నలుమూలలా పరికించి, ఆ కొలతలప్రకారం మనఃఫలకంమీద ప్లాను గీసుకున్నా.

తదుపరి—

నే తన్నిన కార్యపరంపర గబగబా వారికి నివేదించేశాను, తెచ్చిన సరకూ సప్పరా అందించివేశాను. వారి సంభాషణాచాతురికి, అంతకు మించిన ఆ కలివిడికీ ఆదరణకూ అభిమానానికీ ముగ్ధుణ్ణయినాను. శాస్త్రిగారి సదయహృదయం నాకు స్పష్టంగా అగపడింది. ఒక ప్రాణస్నేహితునితో ప్రసంగించినట్టుగానే ఆయనతో మనసువిప్పి మాటాడవచ్చునని నిబ్బరం కలిగింది. ఆ వేళబలంకూడా అగ్గలమైంది.

ఆయనిచ్చిన చనవు ఊతగా, పిచ్చాపాటీ వెళ్ళిపోతోంది. నా ధోరణికి చెవియిచ్చినట్టూ, శ్రద్ధచూపుతున్నట్టూ వారి వదనంలో కనిపెట్టా. సుధామధురమయినటువంటి ఆ సమాధానాలు నన్ను చకితుణ్ణి చేశాయి.

ఇంతలో భోజనానికి లెండని పిలిచారు. ఆయన పిలుపులో గోచరించిన ఆప్యాయత అనుభవించతగ్గదే కాని, వ్రాసిచెప్పటం సాధ్యంకాని పని. ఆ విశిష్టమయిన ఏర్పాట్లన్నీ నాలో ఒక అవిరతమైన ఆనందాన్ని జనింపజేశాయి. ఈసందర్భంలో ఒకటిరెండు మరువరాని చిత్రసంఘటన లున్నాయి. అయితే—నన్ను తనిపిన ఆ మృష్టాన్నభోజనాన్నిగురించి ఏమో వర్ణిస్తా ననుకుంటారు బహుశా, కాదుకాదు.

అక్కడికి ఒక పిల్లి వచ్చింది. చాలా చక్కగా, పుష్టిగా వుంది. అది అభిమానంతో పెంపకమవుతున్న మార్జాలచక్రవర్తి అని దాని రూపురేఖలే చెబుతున్నాయి. 'వేళ కాలేదు, అప్పుడే వచ్చావా?' అన్నారు శాస్త్రిగారాపిల్లితో.

భోజనంముందు కూర్చునివుండే—దాని వెంతో మక్కువతో రాస్తుకుంటూ, దింపుతూ 'ఇది కాదు సమయం'అన్నట్టుగా సూచించారు. అది మళ్లీమళ్లీ వస్తూనేవున్నది. వచ్చినప్పుడల్లా విసుకూ విరామం లేకుండా 'భోజనాలైనాక వద్దుగాని'అని అంటూ దానికి నచ్చచెపుతూనేవున్నారు. వారి సహనశక్తి నిజానికి ఆశ్చర్యగొల్పింది.

అదే కాదు. మరోపిల్లి—సరిగ్గా అచ్చుమచ్చు అటువంటిదే వచ్చింది. ఈ రెండూ కవలేమో ననిపించింది. ఉండబట్టలేక అడిగేశాను: 'శాస్త్రిగారూ, ఇవి పెంపుడుపిల్లులా?'

'అవునండీ. ఇదివరకు ఇంకా రెండుండేవి...'

'మరి, వీటికి పేర్లేమన్నా పెట్టారా లేదా?'

'పెట్టకేం!—ఒకదానికి హిట్లర్ పేరు పెట్టాము. అది అతడితోపాటే చచ్చిపోయింది. ఇదిగో, దీని పేరు స్టాలిన్. ఇంకా స్టాలిను బతికున్నాడుగా? అందుకనే యిదిన్నీ...'

నాలో కల్గిన భావపరంపరకు పారం లేకపోయింది. ఇటువంటిదే మా పిఠాపురంలో జరిగిన నా చిన్ననాటిఊసు ఒకటి ఆయనకి వినిపించా. వారి సరదా ఏమని చెప్పను?—

ఇంతలో ఇంకోపిల్లికూడా వచ్చింది రంగానికి. మొత్తం ఈ ముచ్చటయిన మూడు పిల్లులూ ఒక్క అచ్చున పోసిన ట్టనిపించింది. భోజనాలవేళ ఈ పిల్లుల పటాలాన్ని పెట్టుకుని ఆ బ్రాహ్మడు ఆడే ఆటలూ, వాటికి ఆయన చెప్పే మాటలూ బలే వినోదంగా వున్నాయి. ఈ పిల్లులు ఒకటొకటే వస్తూంటే, వాటిని మర్యాదాగా అవతలకు సాగనంపడంలో శాస్త్రిగారు పడే కాయకష్టం చూడ్లేకపోయానంటే నమ్మాలి. ఈ విషయంలో పసిపాపలుసయితం ఆయనకి చాలరనిపించింది.

అప్పు డనుకున్నా:

శాస్త్రిగారి ప్రతిభకీ, తత్ఫలితములయిన దివ్యరచనలకీ హేతుమూల మయినది ఈ భౌతికవాతావరణం మాత్రమే కాదు. ప్రకృతికి చేరువగా వుండేట్టు ఆయన సృష్టించుకున్న ఆరామమూ, ఆరామములో కుటీరమూ, కుటీరంలోని 'ఆ'హాలూ—ఇవిమాత్రమే కాదు. ఇన్నిటినీ మించిన ఆయనపరిపక్వహృదయం—ప్రకృతివైచిత్ర్యంలో లీనంకాగల ఆ నిండారిన ప్రేమపూరిత హృదయం!! ఆ హృదయజ్యోతి వెలుగుతున్నప్పుడే ఈ వాతావరణం కవికి సహాయపడుతుంది.

అటువంటి హృదయం, దాన్ని విప్పిచెప్పటానికి అనకూల్యమయిన ప్రకృతివాతావరణం—ఈ రెండూ అమరి, మేళవింపబడినప్పుడు మానవుడు కవి కావడంలో ఏద్దూర మేమి టుంటుంది?

కవికి ఆవశ్యకమయిన మానసిక, శారీరక సాధన సామగ్రి అమరటం తపఃఫలమన్నమాట. వేళ్లపై లెక్కింపతగిన అటువంటి అదృష్టశాలులలో శాస్త్రిగారొకరు. ఇట్టిఅనుకూలాలు నాకేఅమరివున్నట్టయితే నా—?

# వేదఋషుల గణితయంత్రము



= శ్రీ గొబ్బూరు వెంకటానంద రాఘవరావు =

ఆరువందల సంవత్సరముల క్రిందట వేద విద్యలను, వేదకర్మలను పునరుద్ధరించవలెననే సద్భావముతో వేదములకు వ్యాఖ్యానము చేసి భాష్యములు వ్రాసిన సాయణవిద్యారణ్యులు శబ్దార్థమాత్రము గ్రహించి కర్మపరముగా వ్యాఖ్యానముచేయ నుపక్రమించినట్లు ప్రారంభమునందే తెలియజేసియున్నారు:-

"కర్మాంగతా యాదృక్
వర్ణితా బ్రహ్మణేన తాం,
బోద్ధుం శబ్దార్థమాత్రస్య
వివృతిః క్రియతే స్ఫుటా"

ఈనాటి శాస్త్రజ్ఞులకు గల నిశితవైజ్ఞానికదృష్టితో వేదములు చదువుటకుగాని, వైజ్ఞానిక విశిష్టమైన వ్యాఖ్యానములతో భాష్యములు వ్రాయుటకుగాని పూనుకోవలసిన అవసరము విద్యారణ్యుల వారికి ఆకాలములో కలుగలేదు. ఒకమూల మహమ్మదీయుల విజృంభణము, మరొక ప్రక్క వేదబాహ్యులై వేదచోదితకర్మకాండపై ధ్వజమెత్తుచుండిన జైనబౌద్ధాదుల యొత్తిడి లోనగు చీకాకులనుండి వేదములను, వేదకర్మలను సంరక్షింపవలెననే సద్భావముతో సాయణాచార్యులు కర్మపరముగా వేదము లన్వయించుకొనుటకు వీలగునట్లు శబ్దార్థములను గ్రహించి భాష్యములు వ్రాసెను.

ఆభాష్యవ్యాఖ్యానములనే ముఖ్యముగా పురస్కరించుకొని, శ్రీ విజయనగరమహారాజు లత్యౌదార్యముతో నొసగిన ముప్పదివేల రూపాయల విరాళముతో మాక్సుముల్లరుదొర నైఘంటుకశబ్దార్థముల వల్లే తెలిసికొన యత్నించి ఋగ్వేదమును కష్టతో ఇంగ్లీషుభాషారూపము తేవలెనని తెచ్చెనేగాని వేదసూక్తముల జీవచైతన్యముల నింగ్లీషుగ్రంథములో ప్రవేశపెట్టజాలకపోయెను. భారతీయేతరులకు వేదభాషాజీవనముల నవగాహన చేసికొనుట సాధ్యమైన పని కాదు. వేదమంత్రముల నావేశించియున్న విశిష్ట వైజ్ఞానిక వాసనల నెంతమాత్రమును గ్రహింపజాలక మాక్సుముల్లర్ దొర వేదము నిట్లు విమర్శించినాడు:—
"ఓ భారతీయుడా! వేదము వేదమని మురిసేవు! మీ వేదంలో ఏముందోయి! వ్యవసాయదారులైన మీ పూర్వులు-ఆర్యులు - 'ఇంద్రుడా! వర్షం కురిపించవయ్యా! అగ్నిదేవుడా! వెచ్చగా వెలగవయ్యా! దేవతలారా! పుత్ర, పౌత్ర, ధన, పశు, ధాన్యసమృద్ధితో శత్రుజయం దయచేయండయ్యా!' అని స్తోత్రపాఠాలతో దేవతాప్రార్థనలు. అంతే. ఈ వేదం చదవడం అంటే ప్రాణం విసిగిపోతుంది. దానినిండా ఊక ఎక్కువ; గింజ తక్కువ. ఆమాటకు వస్తే మా బైబిలులో ఉండే మహత్తరఘట్టాలు-దివ్యమైనరచనలు, దేదీప్యమానమైన కావ్యభాగాలు వేదంలో కంచుకాగడాలు పెట్టి వెతికినా కనపడవు" అంటూ హేళనగా అనేశాడు. సంస్కృతభాషలో పాండిత్యం సంపాదించి వేదం ఇంగ్లీషులో వ్రాయ సాహసించినందుకు మనము ఈ దొరను ప్రశంసించవలసినదేకాని—కూరలో ఎంత తిరిగినా తెడ్డుకు రుచి అంటనట్టు మాక్సుముల్లరు ఎంత గింజుకున్నా వేదసారం మాత్రం ఇతనికి ఏమీ అంటలేదు. ఆలోచించిమాస్తే అంటించుకోవడము కూడా అసంభవమే. నిఘంటుమాత్రపాండిత్యమునకూ, సారగ్రహణమునకూ చాలా తేడా వున్నది కదా! అయినప్పటికీ భరతఖండము పరాధీనంలో వుండడంవల్ల ఆ దొరగారి మాటలకు చెల్లుబడి చాలా ఉంటూ వచ్చింది. అతని విమర్శ అంతా పూర్తిగా అంగీకరించక పోయినప్పటికీ, మన దేశంలో ఇంగ్లీషువిద్యాభ్యాసం చేసి పెద్ద డిగ్రీలు పుచ్చుకొన్న పండితులు

చాలామంది "The vedas have high spiritual philosophical and religious value" అని భావించుకుంటూవుంటారు. దేవతలనుగురించి, ఆధ్యాత్మిక మతవిషయములనుగురించి వేదాలు చక్కగా విమర్శిస్తవి. వేదములకు నమస్కారము. అంతే. అంత మాత్రమే. అది తప్ప శాస్త్రదృష్టితో, వైజ్ఞానికంగా చూస్తే వేదములకు విలువ లేదు—"The vedas have no scientific value in the modern sense of this word—science" అనేది యీ నాటి విజ్ఞాన శాస్త్రం అభ్యసించి అందులో అఖండపాండిత్యం సంపాదించిన మన సోదరులనేకుల అభిప్రాయమై ఉన్నది.

ఈ సందర్భంలో మనము ముఖ్యంగా ఒక విషయం గమనించాలి. ఏమిటంటే—ఈ వైజ్ఞానికులకు సంస్కృతభాష బాగా తెలియదు. స్వయంగా వేదముయొక్క మూలములు చదవరు. చదివినప్పటికీ, వేదఋషులు ఏదృష్టితో చూచి మంత్రద్రష్టలు కాగలిగిరో, ఆ విశిష్టవిషయములు అవగాహన చేసుకొనుటకు ప్రయత్నించరు. ఏ మాక్సుమ్యులరో వ్రాసిన తప్పు ఇంగ్లీషు వేదము చదివి సంతృప్తులై విమర్శ ప్రారంభిస్తారు. ఆంగ్లానువాదములలోనైన వేదవిమర్శ మన భారతభూమియొక్క దుర్భాగ్యములన్నిటిలో గొప్ప దుర్భాగ్యమని దుఃఖింపక తప్పదు. వేదఋషులకు గణితము ఏమీ రాదనిన్ని, వారికి యంత్రాంగవిషయము మేమీ లేదనిన్ని, వైజ్ఞానికవిషయముల వాసనే వారి కెక్కడనూ లేదనీ దృఢనిశ్చయంతోనే మన వైజ్ఞానికులు వేదవిమర్శ ప్రారంభం చేస్తారు. ఈ అభిప్రాయాలన్నీ ఎంత సత్యదూరములో నిరూపించుటకు రెండుమూడు వేదమంత్రములు విమర్శించి చూతాము.

చంద్రుడు భూమిచుట్టూ ఒకసారి తిరిగివచ్చుటకు పట్టు కాలము ఒకనెల. భూమి సూర్యునిచుట్టు తిరిగివచ్చుటకు పట్టు కాలము ఒక సంవత్సరము. భూమిచుట్టు చంద్రప్రదక్షిణకాలము ౨౯½ రోజులు. పన్నెండు చాంద్రమాసములు ౨౯½ × ౧౨: అనగా ౩౫౪ రోజులు చిల్లర; సౌరసంవత్సరము ౩౬౫ రోజుల చిల్లర. సకటున చిల్లరల నటుంచి చూచినపక్షమున ౩౬౦ రోజులు ఒక సంవత్సరము. రోజుకు ఒక పగలు, ఒక రాత్రి: సకటుసంవత్సరమునకు ౩౬౦ రోజులు. ఇందు ౩౬౦ పగళ్లు, ౩౬౦ రాత్రులు: ౭౨౦ అర్ధదినములు. కాబట్టి సౌరచాంద్రమానములను సరిచేయుటకు కలయు సవరణల నటుంచి సకటులెక్కను సరిగా చూచుకొనగా, సంవత్సరచక్రమునకు ౩౬౦ దినము లనే రేకులు; ౭౨౦ దివారాత్రము లనే అర్ధదినములు. ఈ యంశములు ఋగ్వేదముయొక్క ప్రథమ మండలము-౧౬౪ సూక్తము-౧౧, ౪౮ సంఖ్యలు గల మంత్రములలో దీర్ఘతమఋషి స్పష్టముగా వర్ణించియున్నాడు:—

"ద్వాదశారం నహి తజ్జరాయ
వర్వర్తి చక్రం పరిద్యామృతస్య
అపుత్రా అగ్నే మిథునాసో అత్ర
సప్తశతాని వింశతిశ్చ తస్థుః"
"ద్వాదశ ప్రధయ శ్చక్రమేకం
త్రీణి నభ్యాని క ఉతచ్చికేత
తస్మిన్త్సాకం త్రిశతా న శంకవో
ర్పితా షష్ఠి ర్న చలా చలాసః"

కాబట్టి సంవత్సరమునకు మున్నూట అరువది రోజులు. అందులో మున్నూట అరువది పగళ్లు; మున్నూట అరువది రాత్రులు. మొత్తము ౭౨౦ అర్ధదినములు ఉన్నవి. సంవత్సరచక్రంలో సూర్యుడు గడిచినట్లు కనపడేది దినమునకు ఒక డిగ్రీ—౩౬౦ రోజులకు మున్నూట అరువది డిగ్రీలు. సంవత్సరాత్మకమైన కాలచక్రమునకు ౩౬౦ డిగ్రీలు. క్రమముగా సంవత్సరకాలచక్రమునకేగాక ప్రతిచక్రమునకు, రేఖాగణితాత్మకమైన ప్రతివలయమునకు ౩౬౦ డిగ్రీలుగా గణకులు గైకొన్నారు. డిగ్రీలను మనవారు భాగలన్నారు.

కాబట్టి సంవత్సరచక్రమునందలి దినసంఖ్యను బట్టి మొట్టమొదట దీర్ఘతమఋషి వలయమునకు మున్నూటఅరువదిభాగ లేర్పరచినాడు. ఈ నిర్ణయమును భారతీయులును, ఇతరదేశముల గణకులును అలాగే ఆమోదించి రేఖాగణితశాస్త్రము నభివృద్ధిచేసుకొన్నారు.

ఇప్పటికి వేయిసంవత్సరములక్రిందట నుండిన భాస్కరాచార్యులవారు సిద్ధాంతశిరోమణి అనే గ్రంథం పదవ అధ్యాయం—యంత్రాధ్యాయం—లో వలయమును, వలయభాగములను చక్కగా తెలిపియున్నారు.

"దళీకృతం చక్ర ముశంతి చాపం,
కోదండఖండం ఖలు తుర్యగోళం" (X-౧౫)

అనగా ఒకచక్రము అనే వలయమును (Circle) రెండు సమభాగాల క్రింద ఖండించగా రెండు అర్ధవలయములు (Semi_circles) వస్తవి. ఇం దొక్కొక్కటి చాపము, లేక కోదండము అందుము (Semi-circle) ఒక్కొక్క కోదండమును రెండేసి సమభాగములు చేయగా. చక్రము నాలుగు సమభాగము లవుతుంది. ఇం దొక్కొక్క $\frac{1}{4}$ భాగమునే తురీయము, తుర్యగోళము అందురు. చక్రమంతటను మొత్తము ౩౬౦ భాగములు. అందు నాలుగవభాగమైన తురీయములో $\frac{౩౬౦}{౪}$ = ౯౦ భాగలు. ఒక నున్నని కఱ్ఱపలక మీద చక్రచతుర్థభాగమును లిఖించి, తొంబదిభాగల క్రింద విభజించినపు డది తురీయ మగును. దీనివలన ఒకానొక గ్రహముగాని, నక్షత్రముగాని, సూర్యచంద్ర బింబములుగాని మనకు కనబడుచున్న పు డయ్యది దిక్చక్రముపై నెన్నిభాగ యెత్తున నున్నదో తెలిసికొనవచ్చును. ఎట్లన గా:— పలకయొక్క పైకోణములు రెండింటిపైన చిన్నకొమ్ములవంటి కొయ్యముక్కలమర్చవలెను. పలక అంచుకు సరిదూరమున నుండునట్లు ఈ ముక్కలద్వారా రెండు చిన్నరంధ్రము లమర్చవలెను. మరిన్ని సుమా రొకగజము పొడుగు గల గట్టిదారమున కడుగున ముడివేసి, ఆపైన ఉసిరికాయంత సున్నపుఉండ దారముచుట్టును ఒకేమందము కలిగియుండునట్లు చూచుకొని సరిచేయవలెను. సున్నపుటుండ ఆరి గట్టిపడును. తాపీమేస్త్రీల చేతి తూకవగుండువలె ఈ సున్నపుఉండతో దారము Plumb-line వలె సరిగా వ్రేలుచుండును. దారపు రెండవకొసను చక్రనాభిరంధ్రములో దూర్చి, దూరిరాకుండ అవతల ముడివేయవలెను. ఈ యంత్రయుక్తికే తురీయమని పేరు.

ఈ తురీయయంత్రము వేదకాలమునుండి మన దేశములో వాడుకలో నున్నది. ఇక్కడి పటములో బ్రహ్మశ్రీ శ్రీపాద వెంకటరమణదైవజ్ఞ శర్మగారు తురీయయంత్రమును చేతబట్టి నిలుచున్నారు. ఈ యంత్రము చాలాకాలమునుండి వీరింటనున్నది. వీరు తూర్పుగోదావరిజిల్లా కోటరామచంద్రపురం కాపుర స్తులు. దైవజ్ఞులు. ఖగోళవేధ చేయునపుడు పలకపైనున్న కొమ్ములోని బెజ్జము నేత్రమునకు సరిగా పెట్టుకొని, రెండవ కొమ్ములోని బెజ్జముగుండా గ్రహణప్రారంభవేళకు సూర్యుని చూడగలము. పలకమీద గల


(తురీయయంత్రమనబడు గణితయంత్రము)

పెద్దభాగములు చూడగలము. అం దొక్కొక్కటి ౫ చిన్నభాగములుగా విభజింపబడినవి. మొత్తము ౯౦ భాగలు. సున్నపుఉండతో దారము స్వేచ్ఛగా వ్రేలుచు గ్రహణప్రారంభమున నేభాగమును సూచించునో గమనించుకొందము. గ్రహణాంతమున బింబము చాలదూరము గడచిపోవును. అప్పుడుకూడ బింబము ఏ యెత్తున నున్నదో గమనింతము. సంపూర్ణగ్రహణవిమోచనములమధ్య నెన్నిభాగ లగునో తెలిసినపుడు, పరిశీలనలోనున్న గ్రహణభాగల భేదమునుబట్టి గ్రహణము పాదాధికమో, అర్ధాధికమో, కించిన్న్యూనమో సరిగా గుణించి చెప్పగలము.

ఋగ్వేదము పంచమ మండలములో నలభయ్యవ సూక్తపు ఆరోమంత్రములో అత్రిమహాముని ఇట్టి తురీయయంత్రమూలముగా సూర్యగ్రహణము తెలిసికొనెనని స్పష్టముగా తెలియుచున్నది.

"స్వర్భానో రధ యదింద్రమాయా
అవోదివోవర్తమానాఅవాహన్
గూహ్ళం సూర్యం తమసాపవ్రతేన
తురీయేణ బ్రహ్మణా విందదత్రిః"

ఇక్కడ తురీయ మనేది ఒక యంత్రసాధనమని అర్థము చెప్పక విద్యారణ్యులు సంఖ్యావాచకముగా గ్రహించి ఈ ఆరవమంత్రమునకు నాలుగంక చేర్చి పదోమంత్రమువల్ల గ్రహణము అత్రి తెలిసికొనె నని వ్రాయుట చాల తప్పు అని లోకమాన్య బాలగంగాధర తిలక్ గారు కూడ విమర్శించియున్నారు. వేదఋషులు మన మనుకొనుచున్నంత గణితయంత్ర విజ్ఞానశూన్యులు గారు; వారి వైజ్ఞానికప్రతిభ గ్రహించుటకు మనము సరిగా యత్నింపవలె నని విన్నపము.




# పట్టీలు (Plastics)

రోజూ వార్తాపత్రికలను చదివి నేటి ప్రపంచపరిస్థితుల నెరిగియున్నవారిలో, పట్టీ లనునవి నవీనయుగమునకు చెందిన నూతనవస్తువు లని తెలియనివా రరుదు. పట్టీవస్తువు లీనాడు అన్ని పరిశ్రమలలోను, అన్ని గృహములలోను వాడబడుచున్నవి. బహుశః ఇక కొలదిసంవత్సరములలోనే పూర్తిగా పట్టీలతోనే నిర్మితమయిన ఇళ్లనుగూడా చూడగలమేమో! ఇంవరకు ఆధునికయుగములో వెలలేని వస్తువగు ఉక్కుయొక్క స్థానముగూడా తొందరలోనే పట్టీలచే ఆక్రమింపబడగలదని కొందరు శాస్త్రజ్ఞులు భావించుచున్నారు.

అయితే, పట్టీలనునవి ఏవో తెలిసినవారు బహుశా చాలామంది ఉండరు. కొంతమంది పగిలిపోయిన పాలనుండి చేయబడిన దొక పట్టీ అనియు, బేకలైటొక పట్టీ యనియూ చెప్పుచుందురు. వీటినిగూర్చిన అజ్ఞానమునకు కారణము లేకపోలేదు. ఏలననగా- పట్టీ పదార్థములు బాగా అభివృద్ధికివచ్చినది క్రీ. శ. ౧౯౩౦ వెనుకనే.

పట్టీ (Plastic) అనగా నేమి? ఉష్ణ,పీడనముల (Heat and Pressure) వల్ల కావలసిన ఆకారమున కచ్చువేయబడగలుగున వేపట్టీలు. ఆంగ్ల పదమైన 'ప్లాస్టిక్' అనుదాని అర్థము 'అచ్చువేయబడగలది' అని. వీటిని లెక్కింపరాని అనేకప్రయోగములలో వాడుదురు. ఈ రకము పదార్థములే లక్క, సెల్యులాయిడు మొదలయినవి. పూర్వపు పట్టీలు ప్రత్తి, పాలజున్ను మొదలగు ప్రకృతిలోని పదార్థములనుండి చేయుచుండిరి. నేటి పట్టీలు ఫినాయిలు, మూత్రిక (uria), ఫార్మాల్డిహైడు(Formaldehyde), అసిటిలీన్, ఎథిలీన్ మొదలగు రసాయనికపదార్థములచే తయారగుచున్నవి.

పట్టీలు రెండు ముఖ్యమయిన విధములుగా నున్నవి. ఉష్ణముచేసిన యెడల మెత్తగా అయ్యే రకము మొదటిది. ఇవి కావలసిన ఆకారమునకు ఉష్ణసహాయముతో సులభముగా అచ్చొత్తవచ్చును. ఇవి ఉష్ణము యెడల మైనమువలె ప్రవర్తించును. వీటికి థర్మోప్లాస్టిక్స్ (Thermoplastics) అని పేరు. రెండవ రకముపట్టీలు ఉష్ణసహాయముతో ఒక్కసారి అచ్చొత్తినపిమ్మట మరల ఉష్ణమువల్ల ఏ మాత్రముగూడా మెత్తనగా చేయబడవు. ఏలననగా, ఈరకముపట్టీలు ఉష్ణమువల్ల రసాయనికసంయోగము నొందుటచే నేర్పడినవిగాన మరల వీటిని ఉష్ణ మేమియూ చేయజాలదు. ఈరకములో బాగా ప్రసిద్ధమైయున్నది బేకలైటను పదార్థము. దీని నొకసారి కరగించి కావలసిన ఆకారమున కచ్చువేసిన పిమ్మట మరల కరగించి ఇంకొక ఆకారము ఇచ్చుటకు సాధ్యముగాదు. ఈరకమునకు థర్మోసెట్టింగ్ ప్లాస్టిక్స్ ( Thermo - setting Plastics) అని పేరు.

పట్టీల పదార్థములు చాలావిధములుగా పొడిగా, రేకులుగా, గొట్టములుగా చేయుదురు.

వేర్వేరుపట్టీలనుగూర్చి తెలిసికొనుటకు మునుపు వాటిని మనము దైనందినజీవితములో ఎట్లు ఉపయోగపరుచుచున్నామో తెలిసికొందము. రేడియో పూర్తిగా పట్టీలమయమే. సినిమాకు వెళ్లినపుడుగాని, ఫోటోలు తీయునపుడుగాని ఛాయాగ్రాహకరము (Photo-

graphic emulsion) ఒక పట్టీపొరకు (Plastic Film) అంటించబడియున్నదని మీరు ఎరుగుదురా?

ఎక్సరేఫిల్ములుగూడా పట్టీలచే చేయబడినవే. స్త్రీలు వాడే గుండీలు, అల్లే సూదులు మొదలయిన వన్నీ పట్టీపదార్థములే.

రకరకములయిన దువ్వెనలు, చాకుపిడులు, పళ్లతోముబ్రష్షులు ప్రతియేడూ చేయుట కెన్నో పట్టీలు వాడుచున్నారు. పళ్లతోమేబ్రష్షులలో వాడే బిరుసువెంట్రుకలుగూడా క్రొత్తగా పట్టీపదార్థముతో చేయుచున్నారు. ఈపదార్థమునకు నైలాను (Nilon) అని పేరు. దీనితో ఆడవాళ్లస్టాకింగ్స్ (Stockings) గూడా చేయుదురు. టేబిల్ టెన్నిస్ ఆడే బంతి పురాతన పట్టీ యగు సెల్యులాయిడుచే చేయబడినదే.

## యుద్ధకాలపు ఉపయోగములు

యుద్ధకాలములో పట్టీలను వాయువిమానములోని కిటికీలు, వైమానికుని కుర్చీలు, విమానములోని భాగములు, విషవాయునిరోధగొట్టముల (Gas-masks) లోని నేత్రకటకములు చేయుటకును, టాంకులలో పగులని ముఖకవచముల కిటికీలు మొదలగునవి చేయుటకును ఉపయోగింతురు. మొన్నటి యుద్ధకాలములో రబ్బరుకుబదులుగా పట్టీలనే చాలవరకు వాడిరి.

పోయిన శతాబ్దములో ఉపయోగించిన పట్టి సెల్యులాయిడుఒకటి మాత్రమే. ఇప్పుడు వేర్వేరురకముల పట్టీలు చాలా వాడుకలోనికి వచ్చినను అన్నింటికంటే ఎక్కువగా మనము సెల్యులాయిడునే వాడుచున్నాము. ఇది అతిబిరుసయినది-ప్రత్తినుండి చేయబడిన పట్టీ. దీనిని కావలసిన రంగులలో అద్దమువలె పారదర్శకముగా ఉండునట్లు చేయవచ్చును. దీనిని, ఇంటిలో చాకుపిడులు మొదలుకొని చిన్నపిల్లల ఆటవస్తువుల వరకు చేయుటకు ఉపయోగించుచున్నారు. కాని సెల్యులాయిడు తొందరగా నిప్పంటుకోగలదు.

సెల్యులాయిడు తయారుచేయుటలో మొదట ప్రత్తిని నత్రితపేశీమయము (Nitro-cellulose) గా చేయవలెను. ప్రత్తిని బాగా శుభ్రపరచి నత్రిత, గంధకితామ్లముల మిశ్రణద్రావణములో ముంచి కొంతసేపయిన తర్వాత బాగుగా కడిగి ఎండవేయుదురు.

౧౮౫౫ లో పార్క్స్ అనే బర్మింగ్‌హాము శాస్త్రజ్ఞుడొకడు కృత్రిమముగా కొమ్ము తయారుచేయుటకు పరిశోధనసల్పుచు నత్రితపేశీమయమును, తుపాకి ప్రత్తిని (Gun-cotton) కర్పూరము, అసిటోను మిశ్రణద్రవములో కరగించెను. ఈ విధముగా సెల్యులాయిడు తయారుచేయబడెను.

## నిప్పంటుకోని సెల్యులాయిడు

సెల్యులాయిడు దహనశీలత్వము గలది. అనగా అగ్నిచే తొందరగా కాలిపోవును. దీనివల్ల అగ్నిప్రమాదములుగూడా సంభవించుచుండును. అందువల్ల కాలిపోని సెల్యులాయిడుకోసము వెదకుచు శాస్త్రజ్ఞులు సెల్యులాయిడును పోలియుండే సెల్యులోసు అసిటేటు (Cellulose Acetate), లేక పేశీమయఅశిత మనే పదార్థమును కనుగొనిరి. ఇది సెల్యులాయిడంత దృఢత్వము గలది కాదు కాని అంత త్వరగా నిప్పంటుకోదు.

పేశీమయఅశితము తయారుజేయుటకు ప్రత్తిని నత్రికామ్లముబదులు హిమానీఅశితామ్లము (Glacial Acetic Acid) లో ముంచుదురు. అప్పుడు లభించు సెల్యులాయిడువంటి పదార్థము నిప్పుచే కాలునది గాదు. కాని ఇది సెల్యులాయిడుస్థానములో వాడునంతటి ప్రాముఖ్యతను పొందలేదు.

సినీమాఫిల్ముల నింకను సెల్యులాయిడుతోనే చేయుచున్నారు. ఏలననగా పేశీమయఅశితము ఫిల్ములు ఎక్కువ బాళిక (durability) గలవి కావు. అనగా సినిమాయంత్రపు వాడుకవల్ల ఈఫిల్ములు తొందరగా సమసిపోవును. ఇంతకన్న ఈ పేశీమయ అశితము పెయింట్లు, వార్నిషులు తయారుజేయుటకును, కృత్రిమసిల్కు చేయుటకును ఎక్కువగా వాడబడును.

## పాలనుండి గుండీలు

ప్రత్తిపాలమునుండి విజ్ఞానశాస్త్రము తనదృష్టిని సాధువయిన గోమాతపై మరల్చినదానికి ఫలితము—

ఈనాడు గుండీలు, రకరకాల ఫౌంటెన్ పెన్నులు, 'తాబేటిచిప్ప' సులోచనాలు మొదలగునవన్నియు మీగడదీసిన పాలనుండి లభించుచున్నవి. పాలనుండి పాలవిరుగుడు పదార్థము కాసీ (Casein) ననుదానిని తయారుచేయుదురు.

పాలవిరుగుడును పెరుగునుండి వేరుజేసి ఉష్ణముచేయుటద్వారా అచ్చొత్తుదురు. దీనిని వివిధవర్ణములలో అచ్చువేయవచ్చును. ఈ కాసీనును ఫార్మాల్డిహైడ్రు ద్రావణములో ముంచి వేడిచేసినయెడల ఇది ఉష్ణనిరోధకమయిన స్వచ్ఛమయిన తెలుపుగల పదార్థముగా తయారగుచున్నది. దీనినే గాలాలిత్ (Galalith), లేక కృత్రిమపుపాలరాయి యని పిల్తురు. ఇది ఏనుగు దంతమును బోలియుండుటచేత దీనికి కృత్రిమదంతమనికూడా పేరు. ఇది దృఢమయిన, దహనశీలములేని, బాగా మెరుగుపట్టు పదార్థము. అందువల్ల కొమ్ము, దంతము, తాబేటిచిప్పలకు బదులుగా దీనినే వాడుచున్నారు. దీనిని ముందు చెప్పిన ప్రయోజనములకేగాక స్త్రీలకై అల్లికసూదులు చేయుటకు గూడ వాడుచున్నారు.

పాలరాయిని బోలిన పట్టీనే బేకలైటు. నేడది ఈనాడు దీనితో చేయబడని పదార్థమే అరుదు. దీనిని డాక్టరు బేకలెండ్ అనే బెల్జియనుశాస్త్రజ్ఞుడు మొట్టమొదట తయారుచేయుటచే దీనికి బేకలైటని పేరు. దీనిని తారు, లేక వాసెకీలు (Coal tar) నుండి చేయబడిన ఫినైలును ఫార్మాల్డిహైడు ద్రవముతో కలిపి, రసాయనిక క్రియకు తోడ్పడుటకుగాను కొంత అమ్మోనియా వేసి వేడిమిసహాయముతో తయారుచేయుదురు. పిమ్మట వచ్చిన లక్కవంటి పదార్థమును సన్ననిపొడిగా చేయుదురు. ఈ పొడిలో కొంత కొయ్యపొడి కలిపి ఉష్ణ, పీడనముల సహాయముతో కావలసిన ఆకారమున అచ్చువేయుదురు. దీనిని చాలావరకు విద్యుత్పరికరములు చేయుటకు, నీటిగొట్టములు, బంతులు, రేడియో సెట్లు, కృత్రిమవజ్రములు చేయుటకు, బట్టనుగాని, కాగితమునుగాని నింపుటకు ఉపయోగింతురు. బేకలైటుచే నింపబడిన కాగితము, లేక బట్ట ఒకధాతువువలె దృఢమయినదిగా నుండును.

బేకలైటుగుంపుకు చెందిన పట్టీలు అంతఆకర్షణీయమయినవి కావు. రకరకరంగులు, ఇంద్రధనస్సు వర్ణములు కావలయునన్న ఇంకొక రకపు పట్టీలు—మూత్రిక (Urea) చే తయారుచేయబడిన అమినో–పట్టీలు (Amino-Plastics) అనునవిగలవు. ఈమూత్రికఅన్నది వ్యవసాయములో ఎరువుగా వాడబడును. ఇది అమ్మోనియా, కర్బనద్వ్యామ్లజనుల రసాయనిక సమ్మేళనముచే తయారుచేయబడుచున్నది. కర్బనద్వ్యామ్లజని మనము ఊపిరితిత్తులనుండి బయటికి వదిలే బొగ్గుపులుసు వాయువు. అమ్మోనియా గాలిలోని నత్రజనినుండి సమన్వయింపజేయుదురు. ఈ క్రొత్త పట్టిని ఆకర్షణీయమయిన రంగులు గల పాత్రలుగా చేయుదురు. దీనిని సీసామూతలు, గుండీలు, విద్యుత్పరికరములు చేయుటకుకూడా ఉపయోగించెదరు. దీనితోనే దోమవంటి వాయువిమానములు (Mosquito airplane) నిర్మింపబడినవి.

## కృత్రిమపుగాజు ( Synthetic Glass )

గాజును పోలియుండే పట్టీలుగూడా నేడు చేయబడుచున్నవి. ఇవి కెమేరాలు, సూక్ష్మదర్శినీ యంత్రములు మొదలయినవాటికి కావలసినటువంటి నాజూకయిన కటకములను బాగుగా మెరుగుపెట్టజేయుట కుపయోగించెదరు.

ఈ రకపు పట్టీలు తయారుచేయుట చాల రహస్యముగా ఉంచబడిన వాణిజ్యపుగుట్టు. వీటిని డయకను, పర్స్పెక్స్, ల్యూసైటను పేర్లతో బజారులో అమ్ముచున్నారు. వీటిలో పర్స్పెక్స్ (Perspex) అనునది వాయువిమానముల కిటికీల అద్దములుగా వాడుచున్నారు. ఇది గాజుకంటె స్వచ్ఛమైనది. దీనితో కృత్రిమపు పళ్లు (Teeth) చేయుదురు.

ల్యూసైటనే క్రొత్తపట్టినుండి వంకరదీపమొకటి తేజఃసంబంధ (Optic) కార్యములకొరకు తయారుచేయబడును. ఈపట్టీ నేలికదనము గలిగి స్వచ్ఛమైన, దృఢమయిన వస్తువు. దీని విశేషగుణమేమనగా, ఇది వెలుతురును వంకరలగుండ ప్రవహించునట్లు చేయగలదు. పైన చెప్పబడిన వంకరదీపము సహాయములో

దంతవైద్యుడు తన కార్యము మతిసులభముగా చేయగలడు.

అమెరికాలో క్రొత్తగా పాంటలైట్ (Ponta-lite) అనేపట్టీ కనిపెట్టబడినది. ఇది ఉష్ణముచే మెత్తబడును. అతినీలలోహిత (Ultra-voilet) కిరణముల నెక్కువగా ప్రసారముచేయు పాదరసపు ఆవిరిదీపము (Mercury vapour lamp) ముందుగా నుంచినయెడల ఈ పాంటలైటు దేదీప్యమానమగుచున్నది. ఒక్కనిమిషము మాదీపము ముందుంచుటవల్ల పొందిన ప్రదీప్తి దీపము తీసివైచినతర్వాతకూడా పదిసెకనులవరకు అట్లే ఉండును.

పట్టీకటకములు (Plastic Lenses) చాలా చౌకయయినవి. ఇవి గాజువలెగాకుండా, అతినీలలోహిత కిరణములను బాగుగా ప్రసరింపచేయగలవు.

౧౯౩౮ సం. లో అమెరికాలో కనిపెట్టబడిన చాలా క్రొత్తపట్టీ నైలాననేది. ఇది వేళ్వసుమందములుగలిగియుండే ఈనెలుగా తయారుచేయుదురు. ఈ ఈనెలు బిరుసువెంట్రుకలుగా పళ్లుతోముకుంచెల (Tooth-brushes) కమర్చబడును. టెన్నిస రాకెటకు గట్ల(Guts)గా, శస్త్రసంబంధపుకుట్లు వేయుటకుగాను వీటినే వాడుచున్నారు. ఈనైలానునారలు చాలా కఠినముగా నుండుటవల్ల త్రాళ్లనుగూడా వీటితో చేయుదురు.

పట్టీలకు గల ప్రాముఖ్యతకు అవి అన్నివస్తువులకంటె సులభముగా వేర్వేరు రూపములలో పరిణామము పొందగల్గుటయే కారణము. వీటినొక చిన్నసూదిమొదలుకొని, మోటారుభాగములవరకు ఒకటివెంటనొకటి అచ్చువేయవచ్చును. మరొకటి: పట్టీలు మంచి మెరుగును పొందగలవు. కొయ్యయితే మరీమరీ మెరుగుపెట్టుచుండవలెను. కాని పట్టీపదార్థముతో చేయబడిన ప్రతివస్తువు పుట్టుకతోనే మెరుగయివచ్చుచున్నది. దీని కాంతి ఎప్పటికినీ చెడదు— సాధారణముగా రోజూ మురికిని పోగొట్టుటకు ఒక గుడ్డతో తుడిచిన చాలును.

మెరుగుఅవసరములేకున్నను పట్టీలు అలంకారార్థము రంగులలో అద్దబడును. పట్టీలకు వేసిన రంగు చెడిపోదు. పట్టీపళ్లెరములో ఆహారము పెట్టినయెడల అది ఏమాత్రమూ చెడదు.

ఇకమీద పట్టీలు చాలా అభివృద్ధికి రాబోవుచున్నవి. అప్పుడే పట్టీలతో అమెరికాలో మోటార్లు చేయబడుచున్నవి. ఇండ్లుగూడ కట్టబడినవట. పట్టీరేకుల ఇంటి నొకదానిని రెండురోజులలో ఇద్దరు మనుష్యులు నిర్మింపగలరట!

రోజూ మనము చూసే లక్క ప్రకృతియొక్క పట్టీపదార్థము. కాని వైజ్ఞానికుని కృత్రిమపు సృష్టి ప్రకృతినే చిన్నబోవునట్లు చేయుచున్నదిగదా!

"రాము"



# భూప్రదక్షిణము

= శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య =

ప్రతినెలా ఒకపర్యాయం భూప్రదక్షిణం చేసి, అక్కడక్కడ జరిగిన వింతలు విశేషాలు సాభిప్రాయంగాను సవ్యాఖ్యానంగాను వివరించడమే ఈ వ్యాసముయొక్క ఉద్దేశం. ప్రపంచంలో జరిగిన చర్యల నన్నిటిని వివరించడం బ్రహ్మతరంకూడా కాదు. అట్టి వివరణ అవసరంకూడాకాదు. చర్యలలో ఏవి గమనార్హములో ఏవి కావో, ఏవి ప్రధానములో ఏవి అప్రధానములో పరీక్షణచేయడం అవసరం. ఫిబ్రవరి నెలకు సంబంధించిన వివరణచేయుటకు పూర్వం కొన్ని సామాన్య విషయాలను గ్రహింపవలసి యున్నది. ఇవి భూప్రదక్షిణ వ్యాసాలన్నిటికీ ప్రాతిపదిక అని చెప్పవచ్చును.

## సామాన్య విషయములు

(౧) ప్రపంచంలో ఇప్పుడు సుమారు డెబ్బై స్వతంత్ర రాజ్యాలున్నవి. వీటిలో కొన్ని అగ్రస్థానాన్ని, కొన్ని మధ్య స్థానాన్ని, తక్కినవి అల్పస్థానాన్ని వహించినవి. అగ్ర స్థానాన్ని వహించిన రాజ్యాలకు ఎక్కువ పలుకుబడి. వాటి మాట సాగడం సులభం. వాటిని పరిపాలించేవారు చెప్పేమాటలకు, చేసేపనులకు ఎక్కువ విలువ. విస్తీర్ణమందును, జన సంఖ్యయందును, భోగభాగ్యములందును, యుద్ధముచేయుటకు కావలసిన సర్వాంగబలమందును వీటికిగల ఆధిక్యతనుబట్టి ఈ అగ్రస్థానము వీటికి లభించియున్నది. ప్రస్తుతము (౧) యునైటెడ్ స్టేట్సు (౨) రషియారాజ్యములు ఈ తరగతిలో చేరియున్నవి. ఇంగ్లండు ఇదివరకు ఇందులో చేరియుండెను కాని రెండవ ప్రపంచయుద్ధానంతరం ఇట్టి స్థానానికి దీనికి అర్హత ఉన్నదా, లేదా అనే విషయాన్ని గురించి కొంత సందేహానికి అవకాశం యేర్పడ్డది. కాని మొత్తముమీద దీని కింకను అగ్రస్థాన మున్నదని చెప్పుటలో విస్తారప్రమాదం లేదు. ఫ్రాన్సు, కనడా, ఆస్ట్రేలియా, బ్రెజిల్ మొదలైన దక్షిణ అమెరికాలోని కొన్ని రాజ్యములు మధ్యతరగతిలో చేరినవాటిలో ముఖ్యమైనవి, తక్కినవి అల్పరాజ్యములని చెప్పవచ్చును. ప్రపంచయుద్ధము జరుగుచుండిన రోజులలో చైనా దేశమును అగ్రరాజ్యములలో లెక్కపెట్టుచుండిరి. కాని అట్టి పదవికి ఆ దేశము వచ్చుటకు కొంతకాలముపట్టును. ఆ దేశములో ప్రస్తుతము జరుగుచుండు అంతర్యుద్ధము ముగిసి, సౌష్ఠవమైన కేంద్రప్రభుత్వము స్థిరముగ స్థాపింపబడిన గాని అది అగ్రరాజ్యమని అనిపించుకొనజాలదు.

(౨) ప్రపంచమున కంతకు సంబంధించిన సమష్టి వ్యవహారములను పరిశీలించి పరిష్కరించుటకు ప్రస్తుతకాలమున కొన్ని సంస్థలు ఏర్పడియున్నవి. మొదటి ప్రపంచ యుద్ధము ముగిసిన తర్వాత నానాజాతిసమితి (League of Nations) అను పేరుతో ఇట్టి సంస్థ ఒకటి స్థాపింప బడినది. కాని ఇందులో అనేకలోపము లుండినందున దానిని రద్దుచేసి దానికిబదులుగ ఐక్యజాతుల సమితి (United Nations Organization) అను పేరుతో ౧౯౪౫ లో మరియొక సంస్థ స్థాపింపబడియున్నది. ఇందు ౫౫ రాజ్యములకు సభ్యత్వ మున్నది. తక్కిన ౧౦, ౧౫ రాజ్యములకుకూడ అచిరకాలములోనే సభ్యత్వము లభించవచ్చును. రాజ్యానికి రాజ్యానికి వివాదాలు పుట్టినప్పుడు ఆ వివాదాలు యుద్ధరూపము ధరింపకుండునట్లు శాంతిపద్ధతిని మధ్యవర్తుల ద్వారా వాటిని పరిష్కరించుటకును, సామాన్యముగ యుద్ధములు రాకుండచేయుటకును, శాంతిభద్రతలను ప్రపంచమందంతట నెలకొల్పుటకు కావలసిన ఏర్పాటులు చేయుటకును ఈ సమితి ఏర్పడియున్నది. పూర్వకాలానికి, ప్రస్తుత కాలానికి అనేకభేదము లున్నవి. రాకపోకలకు కావలసిన సౌకర్యములు సులభమగుటచేత ఈకాలమున ఏదేశముగాని ఏకాకిగా ఉండుటకు వీలులేదు. ఇతర దేశములతో ప్రతి

దేశమునకు సంబంధ మేర్పడియున్నది. ఏదేశము బాగుపడ వలె నన్నను ఇతరదేశములతో సాంగత్య మవసరమైనది. ప్రపంచ మీకాలమున పరస్పరాశ్రయ మైనదని చెప్పుటలో ఇదే అర్థము. ఇట్టి ప్రపంచములో యుద్ధములు ప్రారంభ మైనయెడల అవి ఏదోఒక ప్రాంతమందు మాత్రమే జరుగుటకు వీలులేదు. ఎక్కడ ప్రారంభమైనను అవి క్రమక్రమముగ ప్రపంచమందంతట వ్యాపించుట స్వభావము. మొదటి ప్రపంచయుద్ధము, రెండవ ప్రపంచయుద్ధము యూరపు ఖండములో ఒకమూలలో ప్రారంభమై తుదకు ప్రపంచమందంతట వ్యాపించినవి. ఇదిగాక ఇప్పటికాలపు యుద్ధములు సర్వనాశకరములు. బాంబుల ప్రయోగమువలన నిమిషకాలములో గొప్పగొప్ప పట్టణములు, లక్షలకొలది మనుష్యుల ప్రాణములు దగ్ధములగుచున్నవి. గనుక యుద్ధములు రాకుండుటకై మానవకోటి అంతయు కలిసి అనేక ఏర్పాటులు చేసుకొనవలసిన అగత్యము ఎప్పటికంటే ఇప్పుడు ఎక్కువగా ఏర్పడినది. అందునిమిత్తమే ఐక్యరాజ్య సమితి, దానికి సంబంధించిన సభలు, సంఘములు నిర్మింపబడినవి. భూప్రదక్షిణం చేయడంలో ఈ సభలు, సంఘములు చేయు పనులను వివరించవలసి యున్నది.

(౩) భూప్రదక్షిణము చేయునపుడు ప్రపంచముయొక్క స్వరూపము కండ్లకు కట్టినట్లుండవలెను. ప్రపంచములోని వివిధఖండములు, దేశములు, సముద్రములు మొదలైనవి ఎచట నుండునది తెలియనియెడల ప్రపంచవ్యవహారములకు గల పరస్పరసంబంధమును గుర్తెరుగుట సాధ్యముకాని పని. సాధారణముగ కొన్నిభూభాగములు ప్రస్తుతకాలమున ప్రాధాన్యము వహించియున్నవి. వాదప్రతివాదములకు, క్లిష్టసమస్యలకు ఇవియే మూలస్థానములు, పాలెస్టయిన్, ఈజిప్టు, ఇరాన్, గ్రీసు, ఇండోచైనా, ఇండోనీషియా ఈలాటివి. స్థూలముగ పరిశీలించినయెడల భూగోళదృష్ట్యా ప్రపంచమును ఒకవిధముగ విభాగముచేయవచ్చును. ఇందు పశ్చిమార్ధగోళము (లేక అమెరికా) ఒక ప్రధానభాగము. అమెరికాలో యునైటెడ్‌స్టేట్సు కేంద్రస్థానమును వహించియున్నది. కనడాదేశము, దక్షిణఅమెరికాలోని రాజ్యములు దీనిచుట్టు తిరుగుచుండు ఉపగ్రహములు. అమెరికానుండి పశ్చిమముగ పసిఫిక్‌మహాసముద్రము మీదుగ ప్రయాణము చేసినయెడల (౧) ఆస్ట్రేలియాన్యూజీలెండులకును. (౨) ఆసియాఖండమునకును రాగలము. ఆస్ట్రేలియాన్యూజీలెండులు ప్రస్తుతబ్రిటిష్‌సామ్రాజ్యములో భాగములుగ నున్నవి. కాని రెండవ ప్రపంచయుద్ధకాలమందు వీటిని సంరక్షించుటలో యునైటెడ్‌స్టేట్సువారు ఎక్కువసహాయము చేసినందున వీటికిని, యునైటెడ్‌స్టేట్సుకును దగ్గిరసంబంధము ఏర్పడినది. అందువలన రానురాను వీటికి బ్రిటిష్‌సామ్రాజ్యముతోటి సంబంధము దూరమగు నను సందేహ మేర్పడుచున్నది. ఆసియాఖండములోని ప్రదేశములను కొన్ని భాగములుగ విభజింపవచ్చును. వీటిలో ప్రధానములైనవి (౧) జపాన్ (౨) కొరియా (౩) మంచూరియా (౪) మంగోలియా (౫) రషియాలోని రాష్ట్రములు (౬) చైనా (౭) ఫిలిప్పైన్‌ద్వీపములు (౮) ఇండొనీషియా, ఇండోచైనా, థైలాండ్, బర్మాలతో కూడిన ప్రాగ్దక్షిణ ఆసియా (౯) ఇండియా (౧౦) అఫ్‌గన్‌స్థానము, ఇరాన్ (పర్షియా), ఇరాక్, టర్కీ, సిరియా, పాలెస్టయిన్‌లతోకూడిన మధ్యప్రాచ్యము ప్రధానములు. సామాన్యముగ వార్తాపత్రికలలో ప్రాగ్దక్షిణఆసియా (South-east Asia) మధ్యప్రాచ్యము (Middle East) అను విభాగములను గురించి ఎక్కువ ప్రశంస కనుపించుచుండును. ఈ విభాగములు ప్రస్తుతకాలపు అంతర్జాతీయ వివాదములలో అనేకములకు జన్మభూములు. ఆసియాఖండమునుండి పశ్చిమముగ ప్రయాణము చేసినయెడల యూరపుఖండమును చేరెదము. భూప్రదక్షిణదృష్ట్యా ఈఖండమును ప్రస్తుతము కొన్ని భాగములుగ విభజింపవచ్చును. వీటిలో (౧) రషియా (౨) రషియాపలుకుబడిలో నున్న తూర్పుయూరపు. ఇందులో బల్గేరియా, రుమేనియా, హంగెరి, జెకోస్లోవేకియా, పోలెండు, యూగోస్లేవియా, ఆల్బేనియా దేశములు చేరియున్నవి. (౩) గ్రీసు. ఇది తూర్పుయూరపులో ఇంగ్లీషువారి పలుకుబడియందుండు దేశము. (౪) మిత్రమండలి వశమందున్న జర్మనీఆస్ట్రేలియా దేశములు (౫) ఇటలీ, స్పెయిన్, పోర్చుగల్, ఫ్రాన్సు, బెల్జియం, హాలెండు, డెన్మార్కు, నార్వే, స్వీడన్‌దేశములు (౬) ఇంగ్లండు (౭) ఐర్లాండు. యూరపు ఖండమునకు దక్షిణముగ ఆఫ్రికాఖండ మున్నది. ఇందులో గమనింపదగిన భూభాగములు (౧) ఈజిప్టు (౨) దక్షిణ ఆఫ్రికాలుమాత్రమే. తక్కిన ప్రదేశములు ఏదోఒక యూరోపియన్‌జాతుల సామ్రాజ్యములో చేరినవి. ప్రస్తుతము వీటికి ఎక్కువ ప్రాధాన్యము లేకున్నను రానురాను వీటికికూడ ప్రాధాన్యము రాగలదు. వీటిలో అనాగరికులును, అజ్ఞానులును అగు నల్లజాతివారు నివసించుచున్నారు. ప్రస్తుతము వారు యూరోపియనులకు విధేయులై ప్రవర్తించుచున్నారు.

రానురాను వీరుకూడ తిరుగుబాటు చేయగలరని చెప్ప వచ్చును. మహాసముద్రములలో పసిఫిక్ మహాసముద్రము నకు ప్రస్తుతము ఎక్కువ ప్రాధాన్యము లభించియున్నది. అమెరికా ఆసియాఖండములకు మధ్యన ఇది ఉండుటచేతను. అగ్రరాజ్యములు రెండును దీనిని అనుకొనియుండుటచేతను ఈ మహాసముద్రమున కిప్పుడు ప్రాధాన్యము వచ్చినది. ఇంతకుపూర్వము ప్రపంచములోని అగ్రరాజ్యములు అట్లాంటిక్ మహాసముద్రమును అనుకొనియుండెను. అందుచేత ౧౬-వ శతాబ్దము మొదలు ౨౦ వ శతాబ్దప్రారంభమువరకు దీనికి ఎక్కువ ప్రాముఖ్య ముండెను.

ఈ ప్రాతిపదికను ఆధారముగ తేసుకొని గతమాసము లోని విశేషములను గమనింతము—

## సంధిపత్రముల సంతకము

రెండవ ప్రపంచయుద్ధమున జర్మనీపక్షము వహించి మిత్రమండలివారితో యుద్ధముచేసి ఓడిపోయిన ఇటలీ, రుమేనియా, బల్గేరియా, హంగేరీ, ఫిన్లాండు రాజ్యములపై ఎట్టి సంధిషరత్తులను విధింపవలె నను విషయమునుగురించి ఒక సంవత్సరకాలము వాదోపవాదములు జరుగుచుండెను. ఇంగ్లండు ఫ్రాన్సు రషియా యునైటెడ్ స్టేట్సురాజ్యముల విదేశాంగమంత్రులు నలుగురితో కూడిన విదేశాంగమంత్రుల సభలలో ఈచర్చలు మొదట జరిగెను. వారొక చిత్తుసంధి పత్రమును తయారుచేసిరి. దానిని విమర్శించుటకై గత సంవత్సరము జూలై ఆగస్టులలో మిత్రమండలి పక్షము వహించి యుద్ధముచేసిన రాజ్యముల ప్రతినిధులందరు ప్యారిస్ పట్టణములో సమావేశమైరి. వారాపత్రములలో కొన్ని మార్పులను సూచించిరి. ఆసూచనలను పరిశీలించి చిత్తుపత్రములను కొంత మార్చి విదేశాంగమంత్రుల సభవారు సాపుపత్రములను తయారుచేసిరి. ఫిబ్రవరి ౧౦ తేదీని ఈ పత్రములను ఇటలీ మొదలైన రాజ్యములవారు మిత్రమండలివారు సంతకముచేసిరి. వీటి మూలమున ఓడిపోయిన రాజ్యములవారందరు నష్టపరిహారముక్రింద ఎక్కువ ద్రవ్యమును ఇచ్చుకొనవలసినవారైరి. ఇటలీ తన సామ్రాజ్యము నంతను కోల్పోయెను. ముసోలినీ నియంతగ నుండినపుడును, తత్పూర్వమును ఇటలీకి ఉత్తర ఆఫ్రికాయందును, తూర్పు ఆఫ్రికాయందును కొన్ని వలసరాష్ట్రము లుండెను. వీటి నన్నిటిని ఇటలీ ఈసంధులమూలమున వదలుకొనెను. ఇది గాక మొదటి ప్రపంచ యుద్ధములో ఇటలీ సంపాదించిన ట్రీస్టురేవుపట్టణమును, దాని చుట్టుపట్లనుండిన ప్రదేశమును కూడ వదలుకొనవలసి వచ్చెను. ఫిన్లాండు కొన్ని ప్రదేశములను రషియా స్వాధీనము చేసెను. యూరపులో ఇటలీ వదలుకొన్న ప్రదేశములలో చాలాభాగము యూగోస్లోవియా వశములోనికి వచ్చెను. ట్రీస్టుపట్టణము మాత్రము ఎవరి వశముగాక ఐక్యరాజ్య సమితి పరిపాలనలోకి వచ్చెను. ఈ సంధిషరత్తులవలన కలిగిన మార్పులలో ప్రధానములైనవి ఇవియే.

సంధిషరత్తులను తయారుచేసిన సభలన్నిటియందును రషియా ఒక పక్షమును, ఇంగ్లండు యునైటెడ్ స్టేట్సులు మరియొక పక్షమును వహించియుండెను. వీరి మధ్యన వాదోపవాదము లనేకములు జరిగి ఒక్కొక్కప్పుడు అతి తీవ్రరూపమును ధరించెను. యుద్ధకాలమందు వీరియందున్న మిత్రభావ మంతయు అదృశ్యమయ్యెను. ఈ విధముగ అగ్రరాజ్యములలో పరస్పర విభేదము లేర్పడుట ప్రస్తుత ప్రపంచ పరిస్థితుల కొక ప్రధానలక్షణమని చెప్పవచ్చును. అంతర్జాతీయ సభ లన్నిటియందును ఈ వైరుధ్యము కనుపించు చున్నది. మూడవ ప్రపంచయుద్ధము వచ్చుట కిది ప్రధాన కారణ మగుననికూడ అనేకులు అభిప్రాయపడు చున్నారు.

సంధిపత్రములలో సూచింపబడని గొప్పమార్పొకటి రెండవ ప్రపంచయుద్ధము మూలమున యూరపుఖండమందు జరిగెను. బల్గేరియా, రుమేనియా, హంగేరి, జెకోస్లోవేకియా, పోలెండు దేశములందు రషియాయొక్క పలుకుబడి స్థిరముగ నాటుకొనెను. రషియాను కాదని ఈ రాజ్యములవా రేమి చేయుటకును సమర్థులును, స్వతంత్రులును కారు. వీరు రషియాకు అనుచరులై ప్రవర్తించవలసిన స్థితిలోనికి వచ్చిరి. యూరపులో ఇంతకు పూర్వము ఏచక్రవర్తి కూడ వశపరచుకొనలేనంతటి సామ్రాజ్యమును రషియావా రిప్పుడు వశపరచుకొన గలవారైరి.

## భద్రతా సంఘము

ఐక్యరాజ్యసమితికి చెందిన అంగము లనేకము లున్నవి. వాటిలో భద్రతాసంఘ మొకటి. ఇందు పదకొండు గురు సభ్యులు: ఇంగ్లండు, ఫ్రాన్సు, రషియా, యునైటెడ్ స్టేట్సు, చైనాలకు దీనియందు స్థిరసభ్యత్వము కలదు. అనగా వారి ప్రతినిధు లెల్లప్పుడు ఇందు ఉండి తీరవలెను. వీరుగాక తాత్కాలిక సభ్యులు ఆర్గురున్నారు. వీరిని సమితి మహాసభవారు రెండు సంవత్సరముల కొక పర్యాయము

ఎన్నుకొనుచుందురు. ఈ పదకొండుగురు సభ్యులతో కూడిన భద్రతాసంఘము ఏదోఒక సమయమందు గాక ప్రతిరోజు సమావేశమై అనేక వ్యవహారములను విచారణ చేయుచుండును. ప్రస్తుత మిది రెండు వ్యవహారములను విచారణ చేయుచున్నది. ఒకటి ఆయుధ విసర్జనకు సంబంధించినది. రెండవది ఇంగ్లండు ఆల్బేనియాలకు మధ్య కలిగిన వివాదము.

## ఆయుధ విసర్జనము

యుద్ధములలో ఉపయోగించదగిన ఫిరంగులు, తుపాకులు, బాంబులు, ట్యాంకులు మొదలగు ఆయుధములను అపరిమితముగ కొన్ని దేశములవారు సేకరించుటయు,తయారు చేయుటయు యుద్ధములకు కారణమగుచున్న దను భావము ప్రబలుటచేత, అట్టి ఆయుధముల సంఖ్యను తగ్గించుటకును, వీలైనయెడల వాటిని పూర్తిగా విసర్జించుటకును వివిధరాజ్యములవారు సంసిద్ధులు కావలెననియు, అట్టి విసర్జన జరుగుటకు కావలసిన ఏర్పాటులను భద్రతాసంఘమువారు సూచించవలసిన దనియు సమితి మహాసభవారొక తీర్మానమును గత డిసెంబరులో చేసియుండిరి. ఆవిషయమై ఇప్పుడు భద్రతాసంఘమున చర్చలు జరుగుచున్నవి.

## అణుశక్తి సంఘము

ఆయుధవిసర్జన విషయమునకును, అణుశక్తిని (ఆటంబాంబు) యుద్ధములో ఉపయోగించు విషయమునకును సంబంధ మున్నది. ఆటంబాంబును రెండవ ప్రపంచయుద్ధమందు అమెరికనులు జపానులోని రెండుపట్టణములపై ప్రయోగించి వాటిని ధ్వంసముచేసిన విషయము అందరికి తెలిసినదే. అంతటి వినాశకరమైన అస్త్రము ప్రస్తుతకాలమున మరియొకటి లేదు. తక్కిన ఆయుధము లెన్నిటిని విసర్జించినను ఎట్టి లాభము ఉండదు. అన్నిటికంటె ఆటంబాంబును విసర్జించుట అత్యావశ్యము. కాని ఈ విసర్జనవిషయములో కొన్ని క్లిష్ట సమస్యలున్నవి. ప్రస్తుతము యునైటెడ్‌స్టేట్సువారికి తప్ప మరెవ్వరికి కూడ ఈ బాంబులను తయారుచేయుటకు కావలసిన జ్ఞానము, శక్తి, నేర్పు లేదు. వారుమాత్రము ఈ బాంబులను కొన్నిటిని తయారు చేసియున్నారు. ఇంకను తయారు చేయుచున్నారు. వీటిని విసర్జించవలయు నను తీర్మానము అమలులోనికి వచ్చినయెడల దానిమూలమున నష్టపడువారొక యునైటెడ్ స్టేట్సువారు మాత్రమే. ఇదిగాక ఏ అణుశక్తి సహాయమున ఆటంబాంబు తయారగుచున్నదో ఆ శక్తి సహాయమున మామూలు పనులను అతి చౌకగను, శీఘ్రముగను చేయుట కవకాశ మున్నది. విద్యుచ్ఛక్తి, పెట్రోలుశక్తి మొదలైన ప్రకృతిశక్తులకంటె ఎన్నోరెట్లు ఎక్కువ ఉపయోగకరముగ అణుశక్తిని వాడుటకు వీలుకలదు. అణుశక్తియొక్క ఉపయోగమును విసర్జించినయెడల యుద్ధములకై ఉపయోగించు ఆటంబాంబులను విసర్జించుటయేకాక మామూలు పనులయందు—వ్యవసాయము, రాకపోకలు, కర్మాగారములు మొదలగు వాటియందు—కూడ ఆటంశక్తిని విసర్జించుట సంభవించును. కాని ఇట్టి విసర్జనమువలన మనుష్యకోటికి విపరీతమైన నష్టము సంభవించును. అందుచేత ఎట్టి కర్మలలో అణుశక్తిని ఉపయోగించవచ్చును, ఎట్టివాటిలో ఉపయోగించకూడదు అను విచక్షణ సేయుట అవసరము. యుద్ధకర్మలందు దానిని నిషేధించుట ఉచితమేకాని, ఇతర కర్మలలో నిషేధించుట అనుచితము. కాని అణుశక్తిజ్ఞానము క్రమక్రమముగ అన్ని దేశములవారికి లభింపకతప్పదు. ప్రతిదేశమందును శాస్త్రపరిశోధనలు జరుగుచున్నవి. ఇప్పుడు కాకపోయినను, మరి ఒకటిరెండు సంవత్సరములలో రషియావారు, తదితరులు ఆటంబాంబులను తయారుచేయగలవారగుదురు. ఇట్టి సందర్భములలో తాము తయారుచేసి సేకరించుకొన్న బాంబులను యునైటెడ్‌స్టేట్సువారు వెంటనే విసర్జించి నాశనముచేయవలె ననుట వారికి మిక్కిలి నష్టకరము. ఎప్పటికిని ఎవ్వరూ ఈబాంబులు తయారు చేయకూడ దను మర్యాద ఏర్పడుటయు, అట్టిమర్యాదను అతిక్రమించక అందరు నడుచుచున్నారా, లేదా అని విచారించుట కొక అంతర్జాతీయ సంఘము స్థాపితమగుటయు, ఆ మర్యాద నతిక్రమించిన వారిని శిక్షించుట కాసంఘమునకు సంపూర్ణాధికారముండుటయు జరిగినగాని యునైటెడ్‌స్టేట్సువారు ఆటంబాంబులను విసర్జించుట కంగీకరించరు. ఈ క్లిష్టవిషయముల నన్నిటిని విమర్శించి అవసరమైన సూచనలను చేయుటకు గత సంవత్సరమున ఐక్యజాతి మహాసభవారు "అణుశక్తి సంఘ" మను పేర ఒక సంఘమును స్థాపించిరి. ఈ సంఘమువారు ఒక నివేదికను తయారుచేసిరి. ఆనివేదికలో పైన పేర్కొనిన సూచనలన్నియు ఉన్నవి. దానిని విచారించుటకును, ఆ సూచనలలో ఆచరణయోగ్యము లేవియో నిర్ణయించుటకును భద్రతాసంఘమువారు పూనుకొనవలసివచ్చెను. కాని ఈ విషయములో రషియాయునైటెడ్‌స్టేట్సులమధ్యన అభిప్రాయభేదమేర్పడెను. ఈ నివేదికను ప్రత్యేకముగ విమర్శించుట అన

వసరమనియు, ఆయుధ విసర్జనసమస్యను పరిష్కరించు నపుడు దీనినికూడ విమర్శించవచ్చుననియు రషియాసభ్యుడు వాదించెను. యునైటెడ్‌స్టేట్సు సభ్యుడీవాదము నంగీకరింపక, అణుసమస్య ప్రత్యేకసమస్య అనియు, దానిని ఆయుధ విసర్జన సమస్యతో ముడిపెట్టకూడ దనియు వాదించెను. తుదకు సభ్యులలో అనేకులు యునైటెడ్‌స్టేట్సుతో ఏకీభవించుటచేత ఈ రెండు విషయములను వేరువేరుగ విచారణ చేయుటకు భద్రతాసభవారు తీర్మానించిరి. ప్రస్తుతము అణుశక్తి సంఘమువారి నివేదిక విచారణలోకి వచ్చినది. దాని ఫలిత మెట్లుండునో కొన్ని వారములలో తెలియగలదు.

## చైనా

చైనాదేశములోని పరిస్థితులు ఈ నెలలలో మరింత క్లిష్టములయ్యెను. ఈ క్లిష్టతకు రెండు ప్రధాన కారణములు కలవు. చియాంగ్‌కైషేక్ నాయకత్వమున నుండు జాతీయ పక్షమునకును, రెండవ రాజకీయ పక్షమగు కమ్యూనిస్టుపక్షమునకును రాజీ కుదరకపోవుటయే గాక, సంవత్సరమునుండి ప్రబలమైన అంతర్యుద్ధము జరుగుచుండుట మొదటి కారణము. ఉత్తరభాగమున కొన్ని రాష్ట్రములందు కమ్యూనిస్టులు అధికారమందున్నారు. దేశములోని ౪౫ కోట్ల ప్రజలలో పదికోట్ల ప్రజలు వారి పరిపాలనయందున్నారని చెప్పవచ్చును. తక్కినవారు చియాంగ్ పాలనలోనున్నారు. కమ్యూనిస్టులను ఓడించి దేశమంతను ఒకే కేంద్ర ప్రభుత్వ పాలనలోనికి తేవలయునని జాతీయపక్షమువారి పట్టుదల. ఇదిగాక చియాంగ్ ప్రభుత్వముయొక్క ఆర్థికస్థితి మిక్కిలి విషాదకరముగనున్నది. పదిసంవత్సరములనుండి దేశములో యుద్ధం జరుగుచుండుటచేత వ్యవసాయము, పరిశ్రమలు ఎంతో నష్టమునకు గురి అయ్యెను. పన్నులభారముచే ప్రజలు క్రుంగిపోయిరి. కాకితపునోట్ల చెలామణి విపరీతమగుటచేత ధరలు పెరిగి పేదవారి కెక్కడలేని నష్టములు కలిగెను. విదేశ వ్యాపారము క్షీణించెను. కమ్యూనిస్టులకును, జాతీయపక్షము వారికిని మధ్య రాజీకుదుర్చుటకు యునైటెడ్‌స్టేట్సు రాయబారి చేసిన ప్రయత్నములన్నియు విఫలము లగుటచేత అతడు విసుగుచెందె. అదివరకు జాతీయప్రభుత్వమువారి కియ్యదలచిన అప్పును ఇచ్చుటకు వెనుకతగ్గెను. ఇందుచేత ప్రభుత్వమువా రెదుర్కొనవలసిన సమస్యలు క్లిష్టతరము లగుచున్నవి.

## ప్రాగ్దక్షిణ ఆసియా

చైనా ఎదుర్కొనుచుండు సమస్యకు అంతర్యుద్ధము ప్రధానకారణమైనట్లు ప్రాగ్దక్షిణ ఆసియాలోని ఇండొనీషియా, ఇండోచైనా, బర్మాదేశము లెదుర్కొనుచుండు సమస్యలకు సామ్రాజ్యాధికారమును చెలాయించుచుండు విదేశీయులతోటి పోరాటము ప్రధానకారణము. ఈ విదేశీయులందరు యూరపుఖండములోనివారు. వారిలో నొకరగు డచ్చివారు (హాలెండుదేశమువారు) రెండవ ప్రపంచయుద్ధమునకు పూర్వము ఇండొనీషియాకు పరిపాలకులుగ నుండిరి. ఫ్రెంచివా రట్లే ఇండోచైనాకును, బ్రిటిష్‌వారు బర్మాకును పరిపాలకులుగ నుండిరి. కాని జపానువా రీప్రదేశములపై దండెత్తివచ్చి, డచ్చివారిని ఫ్రెంచివారిని బ్రిటిష్‌వారిని ఓడించి, వాటిని తమవశముచేసుకొని, అందులోని ప్రజలకు స్వాతంత్ర్యమందును స్వరాజ్యమందును అభిరుచి కల్పించిరి. ౧౯౪౫ లో జపానువారోడిపోయినతర్వాత ఈ ప్రదేశములలో జాతీయోద్యమము ప్రబలెను. ఇండొనీషియాలో చేరిన జావాద్వీపమందు జాతీయపక్షమువారు స్వరాజ్యమును స్థాపించుకొనిరి. ఇండోచైనాలో ఉత్తరభాగమందుకూడ ఇట్లే జరిగెను. కాని ఈ స్వతంత్రరాజ్యములను నాశముచేసి తమ అధికారమును పునరుద్ధారణ చేసుకొనుటకై డచ్చివారు జావాలోను, ఫ్రెంచివారు ఇండోచైనాలోను ప్రయత్నములనుసాగించి తుదకు విఫలులై తమపై తిరుగుబాటుచేసి స్వరాజ్యమును సంస్థాపించిన నాయకులతో సంధిచేసికొనిరి. ఇండో చైనాలోని ఉత్తరభాగమున స్థాపింపబడిన వీట్‌నాంరాజ్యమునకు నాయకుడైన హోచిమిన్ తన అధికారమును సుస్థిరము చేసుకొనెను. జావా సుమత్రాద్వీపములలో సోకర్నో నాయకత్వమున ఇట్లే జరిగెను. ఈ సంధి షరత్తులలో రెండు లక్షణములు గుర్తింపదగియున్నవి. మన దేశములో పాకిస్థాన్‌సమస్యను లేవదీసినట్లు ఈ ప్రదేశములలో దేశవిభజన సమస్య నొకదానిని సామ్రాజ్యాధికారులు లేవదీసిరి. ఇండొనీషియాకంతకు ఒకే కేంద్రప్రభుత్వము ఏర్పరుటకు బదులు దానిని రెండు స్వతంత్రరాష్ట్రములుగ విభజించిరి. ఇట్లే ఇండోచైనాలో ఉత్తరభాగమందుండు వీట్‌నాం రాజ్యమును దక్షిణభాగములోని కొచిన్ చైనానుండి వేరుచేసిరి. ఇవి గాక ఇట్లేర్పడిన రాజ్యములు సర్వస్వాతంత్ర్యమును అనుభవించుటకు బదులు కొన్ని విషయములలో సామ్రాజ్యాధిపతులగు డచ్చివారితోడను, ఫ్రెంచివారితోడను కలిసియుండవలె నని

ఏర్పరచిరి. కొంతవరకు ఈ ఏర్పాటులకు కూడ జాతీయ నాయకులు అంగీకరించిరి. కాని డచ్చివారు నవంబరులో వా రంగీకరించిన సంధిషరత్తులను బాయపరచుటకు వెను దీయుచు, జావాసుమత్రాలను తిరిగి జయించు ఉద్దేశముతో గొప్ప సైన్యమును తెచ్చిరి. సైనికబలము తమకు ఎక్కువగ నున్నదనియు, యుద్ధమునకు ఇప్పు డువక్రమించిన నౌకల తమకు తప్పక జయము రాగలదనియు వారు నమ్మి ఇండొనీషియాలో చిక్కులు కలిగించుచున్నారు. ఫ్రెంచివారుకూడ వీట్‌నాం రాజ్యములో యుద్ధమునకు దిగి మూడు మాసములుగ యుద్ధము చేయుచున్నారు. సైన్యములను ఆకాశవిమానములను ఎక్కువగ తెచ్చుచున్నారు. హోచి మిన్ నాయకత్వమును తా మంగీకరింపమని చెప్పుచున్నారు. అతడు రాజీమార్గమున వ్యవహారమును పరిష్కరించు కొనుటకు సంసిద్ధుడై యున్నను ఫ్రెంచివా రతని మాటలను పెడ చెవినిబెట్టి యుద్ధముసాగించి దేశమును తిరిగి జయించ నిశ్చయముతో నున్నారు.

బర్మాలో మాత్రము జాతీయనాయకులలో కొందరికిని, సామ్రాజ్యాధికారులగు బ్రిటీషువారికిని కొంత రాజీ కుదిరినది. కాని ఈ రాజీషరత్తులను నిరసించు రాజకీయ పక్షములవారు కొంద రున్నారు. ఈ వివిధ పక్షములవారికి సంఘర్షణ జరిగే సూచనలు కనుపించుచున్నవి.

## పాలెస్టైన్

మధ్యప్రాచ్యములోని దేశములన్నిటిలో పాలెస్టయిన్ దేశమందలి చిక్కులు అపరిమితముగ నున్నవి. పాలెస్టయినులో రెండుజాతులవారు నివాసముచేయుచున్నారు. ఒకరు అరబ్బీలు, రెండవవారు యూదులు (Jews). అరబ్బీల సంఖ్య ౧౨ లక్షలు; యూదుల సంఖ్య ౬ లక్షలు. వీరి మధ్యన వివాదములు మొదటి ప్రపంచయుద్ధఫలితముగ కలిగినవి. ఆయుద్ధమునకు పూర్వ మీ దేశములో కొన్నివేల మంది యూదులుమాత్రమే ఉండిరి. వారచట అనాదిగ కాపురముచేయుచుండినవారు. వారికిని, అరబ్బీలకును ఎట్టి వైషమ్యము ఉండినది కాదు. కాని యుద్ధకాలములో జర్మనీ యునైటెడ్‌స్టేట్సు మొదలగు దేశములలోని యూదుల అభిమానమును, సహాయమును సంపాదింపనెంచి బ్రిటిష్ వారు పాలెస్టయిన్ దేశమును యూదుల దేశముగ చేయ వాగ్దానముగావించిరి. అప్పటికి ఆదేశము టర్కీసామ్రాజ్యములో చేరియుండెను. మొదటి ప్రపంచయుద్ధములో టర్కీవారు జర్మనులతో కలసి బ్రిటిష్‌వారిపై యుద్ధముచేసిరి. టర్కీవారిని బ్రిటిష్‌వారోడించి పాలెస్టయినును వశపరచుకొని యూదుల కీవాగ్దానము చేసిరి. అరబ్బీలు అప్పుడే ఆక్షేపణ చేసిరి. కాని వారి ఆక్షేపణకు సమాధానముగ వారి హక్కులకు భంగములేక ప్రవర్తించునట్లు వాగ్దానము గావించిరి. యూదులకు చేసిన వాగ్దానము, అరబ్బీలకు చేసిన వాగ్దానము—ఈరెంటిని నెరవేర్చుట సాధ్యముకానిపని. యూదులకు చేసినదాని ననుసరించి ఏటేట వేనకువేలయూదులను యూరపుఖండపు దేశములనుండి తెచ్చి, పాలెస్టయిన్‌లో చేర్చిరి. వారి సంఖ్య క్రమక్రమముగ పెరుగసాగెను. అరబ్బీలు భయపడి, యూదుల రాకను అడ్డగించుటకై బ్రిటిష్‌వారిపై తిరుగబడిరి. వారిని సమాధానపరచుటకై పాలెస్టయిన్‌కు వచ్చు యూదుల సంఖ్య కొక పరిమితిని కల్పించిరి. అందుపై యూదులకు ఆగ్రహము కలిగెను. హద్దులేక యూదులు దేశములోనికి వచ్చినయెడల అల్పసంఖ్యాకులగువారు అధికసంఖ్యాకులై అరబ్బీలదేశమును యూదుల దేశముగ మార్చెదరను భయము అరబ్బీలలో నాటుకొనియున్నది. విదేశములందుండు యూదులు మరి పాలెస్టయిన్‌కు రాకూడదనియు, పాలెస్టయిన్ బ్రిటిష్‌వారి అధీనమందుండక స్వతంత్రరాజ్యము కావలెననియు, ఆరాజ్యములో అధికారము అధికసంఖ్యాకులగు అరబ్బీలచేతులలో నుండవలెననియు అరబ్బీల వాదము. మొదటి ప్రపంచయుద్ధములో బ్రిటిష్‌వారు చేసిన వాగ్దానము ననుసరించి, పరిమితి ఏమియు లేక ఇష్టము వచ్చిన యూదులందరు పాలెస్టయినులో చేరవలెననియు, పాలెస్టయిన్ యూదుల రాజ్యము కావలెననియు యూదుల వాదము. దేశమును రెండుభాగములుగ జేసి, ఒక భాగమున యూదుల ప్రభుత్వమును, మరియొకదానియందు అరబ్బీల ప్రభుత్వమును స్థాపించిన బాగుండునని బ్రిటిష్‌వా రొకప్పుడు సూచించిరి. కాని అరబ్బీలు ఈ సూచనను ప్రతిఘటించిరి. యూదులు విభజనకు కొంతవరకు సుముఖులుగ నున్నను అరబ్బీల ప్రతిఘటనవలన బ్రిటిష్‌వారు దీనిని ఉపసంహరించుకొనిరి. ఈ వ్యవహారముల నన్నిటిని రాజీమూలముగ పరిష్కరించుటకు ఈ మధ్యన బ్రిటిషువారు లండనులో ఒక సభ చేసిరి. యూదులు ఆసభను బహిష్కరించిరి. దీనినంతను చూచి బ్రిటిషువారు విసుకుపడి తుదకు ఈ వ్యవహారమునంతను ఐక్యజాతిసమితివారు పరిష్కరించుటయే ఉత్తమమార్గ మని నిశ్చయించుకొనిరి.

## ఇంగ్లండు : విషమస్థితి

గతమాసమున ఇంగ్లండులోని ప్రజలు విపరీతములగు కష్టములను అనుభవింపవలసినవారైరి. బొగ్గుక్షామమే దీనికి ప్రధానకారణము. శీతాకాలములో కావలసినంత బొగ్గు వారు నిలవచేసుకొనలేకపోయిరి. యుద్ధఫలితముగను, యువకులలో అనేకులు సైన్యములలో చేరి విదేశములం దుండుటచేతను గనులలో పనిచేయుటకు కావలసినందరు కూలిజనము లభించుటలేదు. అందుచేత బొగ్గుఉత్పత్తి అధికము చేసుకొనుట సాధ్యముకాదయ్యెను. బొగ్గు కాటకమువలన దేశములో ఉత్పత్తియగు విద్యుచ్ఛక్తి తగ్గెను. అందుచేత ఫ్యాక్టరీలనేకములను మూయవలసివచ్చెను. లక్షలకొలదికూలిజనము పనిలేక నిరుద్యోగులైరి. బొగ్గు, విద్యుచ్ఛక్తి లేనికారణమున సామాన్యగృహస్థుల బాధ లపరిమితము లయ్యెను. దీనికంతకు తోడుగ చలిగాలి, మంచు విపరీతము లయ్యెను. బొగ్గుకాటకము, కావలసినంత కూలిజనము దొరకకపోవుట-ఇవి తాత్కాలిక కష్టములు మాత్రములే కావనియు, కొంతకాలమువరకు—అనగా కొన్ని సంవత్సరములవరకు వీటిని ఎదుర్కొనవలసియుండు ననియు, వీటివలన కలుగు నష్టములను, కష్టములను తొలగించుటకు ఉపాయాంతరములను కనుగొనవలయు ననియు, అట్టి ఉపాయములు లభింపనియెడల ఆర్థికముగ ఇంగ్లండు దేశము హీనస్థితికి వచ్చుట తప్పదనియు ప్రముఖులు అభిప్రాయపడుచున్నారు.

## భరత ఖండము

రెండవ ప్రపంచయుద్ధము మూలమున తమస్థితి విషమమగుటచేత ఇండియా, బర్మా మొదలగు దూరదేశములను పాలించుటకు కావలసిన ఆర్థికబలము, సైనికబలము తమకు లేదన్న భావము ఇంగ్లీషువా రనేకులలో దృఢముగ నాటుకొనిన కారణముచేతనే వా రిప్పు డీదేశములలో తమ అధికారమును వదలుకొని, ఆ అధికారమును ఆయా దేశపు నాయకుల హస్తగతము చేయ సంసిద్ధులు కావలసివచ్చెను. ఫిబ్రవరి ౨౦ తేదీనాడు బ్రిటిష్ ప్రధానియగు అట్లీ పార్లమెంటులో ఇండియా విషయమై గావించిన ప్రకటనయొక్క అంతరార్థము ఇదియే. ఈ ప్రకటనలోని ముఖ్యవిషయములను మనము గమనించి వాటి అర్థమును గ్రహించవలసియున్నది. (౧) ౧౯౪౮ జూన్ నెలనాటికి బ్రిటిష్‌వారు భరతఖండముపై వారికిగల అధికారము నంతను వదలుకొని, ఆ అధికారమును భారతీయుల పరముచేయ నిశ్చయించుకొనిరి. (౨) భారతీయులలో ఎవరిపరముగా ఈ అధికారమును పరివర్తనము చేయుదు రను విషయమున వారు రెండుమూడు సూచనలను చేసియున్నారు. ఇప్పుడు సమావేశమైన రాజ్యాంగపరిషత్తులో అన్నివర్గముల వారు - అనగా ముస్లింలీగువారు, సంస్థానప్రతినిధులు - కలిసి అందరూ ఆమోదించిన రాజ్యాంగప్రణాళిక నొకదానిని ౧౯౪౮ నాటికి తయారుచేసినయెడల ఆ ప్రణాళికను అనుసరించి ఏర్పడు ప్రభుత్వమునకు అధికారమును అప్పగించు సూచన ఒకటి. కాని అన్నివర్గములు చేరి రాజ్యాంగము తయారుచేయు అవకాశము లేనట్లే వారు భావించుచున్నారు. అట్టి సందర్భమున వారు పరిపాలనాధికారమును భరతఖండమున కంతకు చెందిన ఒక కేంద్రప్రభుత్వమునకు అప్పగించుటకు బదులు బ్రిటిష్ ఇండియాలో ఒకప్రభుత్వమునకు గాని, లేక ఆయారాష్ట్రములలో ౧౯౪౮ జూన్ నాటికి ఏర్పడి ఉండు ప్రభుత్వములకుగాని అప్పగించుటకు నిశ్చయించుకొనియున్నారు. అనగా బ్రిటిష్ ఇండియా కంతకు ఒకే కేంద్రప్రభుత్వ ముండుటకు బదులు, అది అనేక రాజ్యములుగ విభజితమై కొన్నిటియందు ఒకరాజకీయ పక్షమువారును, మరి కొన్నిటియందు మరియొక రాజకీయ పక్షమువారును పరిపాలకులగుట సంభవించును. దేశమును హిందూస్థాన పాకిస్థానము లను రెండు స్వతంత్రరాజ్యములుగ విభజించవలయు నను ముస్లింలీగువాదము దీనిమూలమున కొంతవరకు క్రియారూపము ధరించును (౩) సంస్థానముల విషయమున ౧౯౪౮ జూన్ నాటికి ప్రతిసంస్థానము సర్వస్వతంత్రము కలది యగునని అట్లీ ప్రకటన నిర్ధారణ చేయుచున్నది. అనగా తేలిన సారాంశము ఒకటే. వెంటనే కాంగ్రెసు పక్షమువారు, లీగు పక్షమువారు, సంస్థానాధీశులు వారివారి అభిప్రాయభేదములను విసర్జించి, అందరూ కలిసి, రాజ్యాంగపరిషత్తులో సమాలోచనచేసి, భరతఖండమున కంతకు వర్తించు రాజ్యాంగమును తయారుచేయని పక్షమున ౧౯౪౮ జూన్‌నాటికి భరతఖండము అనేక చిన్నచిన్న రాజ్యములుగ విభజితమగును.

ఇట్టి ప్రకటనను అట్లీ ఎందుకు చేసెను? భరతఖండములో జాతియోద్యమము ప్రబలుటచేతను, రాష్ట్రములను పాలించు అధికారము ఇదివరకే భారతీయుల హస్తగతమగుటచేతను, బ్రిటిష్‌పరిపాలనమును యథాపూర్వముగ నడుపుట సాధ్యముకాని పని. గనుక అధికారమును వదలుకొనుటతప్ప మార్గాంతరము లేదని బ్రిటన్‌లోని కార్మిక ప్రభుత్వమువారికి స్పష్టమయ్యెను. నిర్వహించలేని అధి

భారమునుగాని, బాధ్యతనుగాని తమ చేతిలో నుంచుకొని, తమ పేరుప్రతిష్ఠలను కోల్పోవుటకంటె దేశమునుండి వెడలిపోవుటయే కర్తవ్యమనుభావము వారియందు గాఢముగ నాటుకొనియున్నది. కాని తాము దేశమును వదలిపెట్టినయెడల కాంగ్రెసుకు లీగుకు రాజీ కుదరకపోవుటయు, సంస్థానాధీశులు కాంగ్రెసుతో కలియకపోవుటయు, దీని మూలమున అంతర్యుద్ధములు బయలుదేరి ప్రజలు నానాబాధలు పడుదురన్న సంశయము వారికి లేకపోలేదు. కాని అంతర్యుద్ధము మూలమున ప్రజలందరు బాధపడుదురను భావము చేత వివిధపక్షముల నాయకు లందరు రాజీకిరాగలరేమో అను విశ్వాసముకూడ వారి కున్నది. ఏదెట్లయినను రాజీకుదిరినను కుదరకపోయినను తాము నిస్సహాయు లగుటచేత తాము చేయగలిగినది ఏమియు లేదనియు, దేశమును చక్కబెట్టుకొను భారమును భారతీయనాయకులే వహించవలసియున్నదనియు, వారు శక్తిసామర్థ్యములతో వహించగలిగినయెడల దేశము బాగుపడుననియు, లేనియెడల దేశమునకు కలుగు కష్టనష్టములకు ఆనాయకులే కారకులగుదురనియు, ఇతర జాతుల ఇండ్లను చక్కబెట్టుటకు తమ కిదివరకున్న సదుపాయము లిప్పుడు లేవనియు బ్రిటిష్‌వారి నమ్మకము.

దీనిమూలమున భారతీయులపై పరిపాలనాభార మంతయు పడ్డదని చెప్పవచ్చును. రాబోవు ౧౫ నెలలు మన చరిత్రలో మిక్కిలి క్లిష్టమైన కాలమని చెప్పవచ్చును. లీగువారు కాంగ్రెసు వారితో రాజీకి వచ్చునట్లులేదు. పాకీస్థాన్ వాదమును కొంచెముకూడ తాను వదలుకొనుట లేదని జిన్నా ప్రకటించెను, గనుక లీగువారు రాజ్యాంగ పరిషత్తులోనికి రాజాలరు. పరిషత్తువారు హిందువులు అధికసంఖ్యాకులుగ నుందు మద్రాసు, బొంబాయి, మధ్యరాష్ట్రములు, సంయుక్త రాష్ట్రములు, బీహారు, ఆసాంరాష్ట్రములతో కూడిన బ్రిటిష్ ఇండియాలోమాత్రము అమలులోకి రాదగిన రాజ్యాంగమును తయారుచేయుటమాత్రమే జరుగును. బహుశః ఈ రాజ్యాంగమును బ్రిటిష్‌వారు ఆమోదించి, దాని మూలమున ఏర్పడు ప్రభుత్వమునకు ఈరాష్ట్రములలోని అధికారమును అప్పగించెదరు. గనుక ఈ ఆరు రాష్ట్రములు కలిసి ఒక ప్రత్యేక రాజ్యము కాగలదు. తక్కిన రాష్ట్రములలో ౧౯౪౮ జూన్ నాటికి ఎవరు అధికారములో నుండెదరో వారికి తమ అధికారమును అప్పగించుటకు బ్రిటిష్‌వారు సంసిద్ధులుగదా ? సింధు రాష్ట్రమున అప్పటికి లీగువారు అధికారములో నుండెదరు. ఆరాష్ట్రము వారి పరమగును. బంగాళములోకూడ ప్రస్తుతము లీగువారు అధికారములో నున్నారు. కాని, అందు హిందువులు లీగుప్రభుత్వమును నిరసించుచున్నారు. ఇట్టి స్థితిలో లీగు ప్రభుత్వము రాష్ట్రమందంతట స్థిరముగ నాటుకొనుటకు వా రంగీకరించజాలరు, హిందువులకును, లీగువారికిని ఆ రాష్ట్రములో సంఘర్షణ తప్పదు. అదియే అంతర్యుద్ధము. ఇట్లే పంజాబులోకూడ జరుగవచ్చును. ప్రస్తుత మచట ముస్లిములు, హిందువులు, శిక్కులు కలిసిన మంత్రివర్గము అధికారములో నున్నది. కాని లీగువారు తమ అధికారమును స్థాపించుటకు సర్వ ప్రయత్నములు చేయుచున్నారు. శాసన సభకు ఎన్నికలు జరుగవలెననికూడ ఆందోళన చేయుచున్నారు. ఇట్టి సందర్భములో హిందువులు, శిక్కులు చేతులు ముడుచుకొని కూర్చుండరు. అధికారము లీగువారి హస్తగతము కాకుండుటకై వారు అన్ని ప్రయత్నములను చేయగలరు. అవసరమైనయెడల అంతర్యుద్ధమునకు కూడ వారు దిగెదరు. సరిహద్దు రాష్ట్రములోకూడ కాంగ్రెసు పక్షమువారికిని లీగుపక్షమువారికిని ఇట్టిపోరాటమే సంభవించును.

అట్లీ చేసిన ప్రకటనలోని లోపము ఇదియే. ౧౯౪౮ జూన్ నాటికి ప్రస్తుతము అధికారములో నుండు తాత్కాలిక ప్రభుత్వమునకు (Interim Goverrment) బ్రిటిష్‌వారు అధికారమునంతను అప్పగింప నిశ్చయించుకొన్నారని ప్రకటించినయెడల ఇట్టిఅంతర్యుద్ధప్రమాదములు కొంతవరకు తగ్గియుండునేమో ? కాని అట్లు చేయక రాష్ట్రప్రభుత్వములకుకూడ అధికారమును అప్పగించుటకు వారు సంసిద్ధులగుటచే అంతర్యుద్ధప్రమాదములు తప్పనిసరియగుచున్నవి.

మరియొక సమస్యకూడ ఈ ప్రకటనమూలమున ఉత్పన్నమైనది. ౧౯౪౮ జూన్ నాటికిని ఇప్పటికిని మధ్యన రాష్ట్రములం దెచ్చటనైన అల్లరులు, అంతర్యుద్ధములు జరిగినయెడల, వాటిని అణచుటకై బ్రిటిషువారు భరతఖండమున ప్రస్తుతము వారి వశమందున్న సైన్యములను ఉపయోగింతురా ? దీనికి ప్రకటనలో సమాధాన మేమియు కనుపించదు.

ఇప్పుడు జరుగవలసిన పని ఎట్టిది ? ఏయేరాష్ట్రములలో కాంగ్రెసుపక్షమువారు అధికారమును వహించియున్నారో ఆరాష్ట్రములందు వారు ఆ అధికారమును సుస్థిరముచేసుకొనుటకు ప్రయత్నించవలెను. అందుకు కావలసిన సైన్యములను, పోలీసులను, స్వచ్ఛందసేవాదళములను వారు నిర్మించుకొనవలెను. వారి అధికారము వదలకుండుటకై కావలసిన [illegible]ములను వారు సిద్ధముచేసుకొనవలెను. కాంగ్రె

ముకు విరోధులుగ నుండు కమ్యూనిస్టులు మొదలగువారి వలన అల్లరులు రాకుండ రాష్ట్రములను కాపాడవలెను. ప్రస్తుతము కాంగ్రెసుపాలనమందుండు రాష్ట్రములలో ప్రజలందరు కాంగ్రెసునందుమాత్రమే అభిమానము కలవా రను కొనుట ప్రమాదకరము. అనేకులు కాంగ్రెసుకు విరోధులుగ నున్నారు. అట్టివారి మూలమున ప్రమాదమురాకుండ చేసుకొనవలెను.

బంగాళము, పంజాబురాష్ట్రములలో లీగుపక్షము వెదుర్కొని, పాకిస్థాననిర్మాణమును ప్రతిఘటించు హిందువులకు, శిక్కులకు కాంగ్రెసుపక్షమువారు సహాయముచేయ సంసిద్ధులై, అందుకు కావలసిన ఏర్పాటుల నన్నిటిని చేసుకొనవలెను.

సంస్థానములలో కొన్ని కాంగ్రెసుపక్షమునకును, జాతీయనాయకుల ఆశయములయెడను అభిమానము కలిగియున్నవి. అట్టివానితో కాంగ్రెసునాయకులు సంప్రదించి, ౧౯౪౮ జూన్ లో ఏర్పడబోవు భారతీయ రాజ్యములో ఆ సంస్థానములు చేరుటకు కావలసిన ఏర్పాటులను చేయవలెను.

ఇంతకూ అధికారమును బ్రిటిష్‌వారు అప్పగించెదరను వాక్యమునకు అర్థము లేనే లేదు. ప్రస్తుతము వారికున్న అధికారము ఎంతటిమాత్రము? అధికారమును తిరిగి సంపాదించుటకు సాధ్యముకాదన్న కారణముచేతనేకదా వారు దేశమునుండి వెళ్లిపోవుట? గనుక వారు అధికారమును ఇతరులకు ఇచ్చుటయు, ఇతరులు వారినుండి అధికారమును సంపాదించుటయు అర్థములేని మాటలు. అధికారము బ్రిటిషువారి చేతులనుండి ఇప్పటికే వెళ్లిపోయెను. వారి స్థానమున ఏ పక్షమువారు ఈ ౧౫ నెలలమధ్యన అధికారమును సంపాదించగలరో వారే దేశపరిపాలకులు కాగలరు. కొన్నిరాష్ట్రములలో కాంగ్రెసుపక్షమువారును, మరికొన్నిటిలో లీగువారును ఆ అధికారమును సంపాదింపగలరని ఊహించుట కవకాశమున్నది.

కాని, ఇవన్నియు ఊహలుమాత్రమే. జరుగబోవునది పలానిదని నిస్సంశయముగ చెప్పుటకు వీలులేదు. ౧౯౪౮ జూన్ నాటికి ఇంగ్లండులో ప్రభుత్వము మారవచ్చును. క్రొత్తప్రభుత్వమువారు ఆట్లీప్రకటనను మార్చవచ్చును. లేక పరిస్థితులు మారినవని లేబర్ మంత్రివర్గము వారే తాము చేసిన ప్రకటనను మార్చుకొనవచ్చును. ఈ రెండు సంవత్సరములమధ్యన ఎన్నిప్రకటనలు మారలేదు? క్యాబినెట్ మిషనువారు ౧౯౪౬ మేనెల ౧౬ తేదీ చేసిన ప్రకటనకు విరుద్ధముగ ౧౯౪౭ ఫిబ్రవరి ౨౦ తేదీని అట్లీ ప్రకటన చేసియుండలేదా? ఇదిగాక బ్రిటిష్‌వారు వదలినతర్వాత అగ్రరాజ్యములుగ నుండు రషియా యునైటెడ్ స్టేట్సువారు మన దేశములో జోక్యము కలుగజేసుకొనజాలరని ఎవరు చెప్పగలరు?

## మద్రాసు రాష్ట్రము

ఫిబ్రవరి మాసమున మద్రాసు రాష్ట్రములోని రాజకీయములు అంత తృప్తికరములుగ లేవు. శాసనసభలోని అధికార పదవిలో నున్న కాంగ్రెసు పక్షమువారిలో ననేకులకును, పక్షమునకు నాయకుడును, రాష్ట్రమునకు ప్రధాన మంత్రియు నగు టంగుటూరి ప్రకాశంగారికిని అభిప్రాయ భేదములు కలిగి, వారి నాయకత్వమందు తమకు విశ్వాసము లేదని, వారిస్థానే మరియొకరిని నాయకుడుగ నెన్నుకొనుటకు కాంగ్రెస్ పక్షమువారి ప్రత్యేకసభ నొకదానిని సమావేశ పరచవలసినదని కొందరు కోరగా, ఆ కోరిక ననుసరించి ౨౮ తేదీన ప్రకాశం పంతులుగారు ప్రత్యేకసభను సమావేశపరచిరి. కాని నాయకునిలో విశ్వాసరాహిత్యమును ప్రకటించుటకు కాంగ్రెస్ పక్షమువారి నిబంధనలలో అవకాశము లేదన్న కారణమున అట్టి తీర్మానమును గురించి చర్చించుట అక్రమమని అధ్యక్షులగు ప్రకాశంపంతులుగారు అభిప్రాయపడి సమావేశమును వెంటనే రద్దుచేసిరి. అధ్యక్షులగు వారి అభిప్రాయమును మన్నించక, వారికి వ్యతిరేకులుగ నున్న ౧౩౪ సభ్యులు ప్రత్యేకముగ వెంటనే సమావేశమై తమకు ప్రకాశంపంతులుగారి నాయకత్వమందు విశ్వాసము లేదని తీర్మానించి, వారి స్థానే శ్రీ ఓమాండూరు రామస్వామి రెడ్డిగారిని నాయకునిగ నెన్నుకొని, ఈ ఎన్నికను ఆమోదించి వీరి నాయకత్వమున క్రొత్త మంత్రివర్గమును ఏర్పాటుచేయుటకు అనుజ్ఞ ఇయ్యవలసినదిగా కాంగ్రెస్ హైకమాండువారిని కోరుట జరిగినది. శ్రీ రామస్వామిరెడ్డిగారి ఎన్నిక సక్రమమైనదా, కాదా అను విషయమును హైకమాండువారు నిర్ణయించి, మద్రాసులో క్రొత్త మంత్రివర్గమును ఏర్పరచవలసియున్నది. బహుశః ఈ నెలాఖరులోగా మద్రాసులో మంత్రివర్గము ఏర్పడివచ్చును.

ఇట్టి మార్పు ఈరాష్ట్రములో జరుగుట కొంతవరకు విమర్శింపతగ్గ విషయమే. ప్రకాశం పంతులుగారికి విరోధులుగ నున్న శాసనసభ్యులు కొంచెము తొందరపడిరని చెప్పవలసియున్నది. వారు ప్రస్తుతము సాధించినదికూడ ఏమియు లేదు. సంవత్సరమున కొక పర్యాయము నాయకుని ఎన్ని

కాను హక్కు వారికే ఉండనే ఉన్నది. ఈ మార్చి ౩౦ తేది ఈ సాంవత్సరికసభ సమావేశమగుటకు అధ్యక్షులు ప్రకాశంపంతులుగా రిదివరకే ఏర్పాటుచేసియున్నారు. ఈ నెల రోజులు ఓపికపట్టి, ఆ సభలో వారి స్థానే మరియొకరిని ఎన్నుకొనినయెడల అట్టి ఎన్నిక క్రమమైనదా కాదా అన్న సంశయము లేకుండెడిది. ఏలాగైనా ప్రస్తుతమంత్రివర్గము మార్చి ఆఖరువరకైన ఉండకతప్పదు. హైకోర్టు వారు రామస్వామిరెడ్డిగారి ఎన్నికనుగురించి విచారించుటకును, అటుపైన వారు గవర్నరుతో సంప్రతించి క్రొత్తమంత్రివర్గమును ఏర్పరచుటకును కొన్నిరోజులు పట్టును. గనుక ఫిబ్రవరి ౨౮ తేదీన రెడ్డిగారిని ఎన్నుకొనుటమూలమున మంత్రివర్గము మారుట సంభవించలేదు.

ఇంతకూ ప్రకాశంపంతులుగారియెడ ఏకారణముచేత శాసనసభ్యులు విశ్వాసమును కోల్పోవలసివచ్చినదో విదితముకాలేదు. విశ్వాసరాహిత్యతీర్మానమును ప్రకటించినవారు కారణములను వివరించియుండలేదు. కారణములను వివరించుట వారి ధర్మము. శాసనసభ్యులు ప్రజలచే ఎన్నుకొనబడినవారు. వారనుసరించు కార్యక్రమమునుగురించి ప్రజలకు తెలియపరచుట వారివిధి. ఈ ధర్మమును వారీ సందర్భములో అనుసరించినవారు కారు.

రాజాజీముఠాకు రెండు మంత్రిపదవులుమాత్రమే ఇచ్చుటకు ప్రకాశంగారు అంగీకరించినట్లును, మూడు మంత్రిపదవులను వారు కోరినట్లును, ఆకోరికను నిరాకరించుటచేతనే ఇట్టి విశ్వాసరాహిత్యతీర్మానము తీసుకొనిరాబడినదనియు రాజాజీముఠాకు నాయకుడగు రాజాగారు ప్రకటించిరి. ఇంతటి స్వల్పకారణముతో మంత్రివర్గమందు అవిశ్వాసము ప్రకటించుట ఖండించతగ్గ విషయమే.



# డి. డి. టి. తో

## మంచి ఫలితములను పొందు విధము






**1** క్రిమి నాశనమునకు డి డి టి ని ప్రవేశ పెట్టుటకు మూలపురుషుడగు జె. ఆర్. గైగి తెల్పిన విధముగా తయారుచేయబడిన న్యూసిడ్ పొడరులో నూటికి 10 వంతులు డి డి టి గలదు ఆసుపత్రులలోను, పాక శాలలలోను ఉపయోగించుటకు అనుకూలముగా న్యూసిడ్ పొడరు అన్ని మంచి స్టోరుల యందును 2 ఔన్సులు, ½ పౌను లేక 1 పౌను డబ్బాలు దొరకును. 28 పౌనుల డబ్బాలు ఆస్పత్రులకు, పాకశాలలకు యితర సంస్థలకును దొరకును.

**2** వంట శాలలలోను, పురుగులు చేరుటకు యితర తావులలోను న్యూసిడ్ పొడరును విరివిగా చల్లవలయును. విస్తృతముగా అనేకమార్లు ఉపయోగించుట కంటె, ఒకే పర్యాయము మేడలో అన్ని గదులయందును పూర్తిగా చల్లుట మంచిది. ఇట్లు సరియగు పద్ధతిలో పొడరును చల్లి కొద్ది రోజులుంచినచో బొద్దింకలు, ఈగలు, చీమలు, దోమలు, నల్లులు మొదలగు కీటకములు చేరకయుండును. అవసర మయినచో పొడరును తిరిగి ఉపయోగించ వచ్చును.

# న్యూసిడ్

**పొడరును వాడుడు మరియు దానిని సక్రమముగా ఉపయోగించుడు.**

గైగి ఇన్సెక్టిసైడ్స్ లిమిటెడ్




సెసిల్ కోర్ట్, లకీ రోడ్డు, అపోలో బందర్, బొంబాయి.

DJK. 8319

మైసూరు స్టేటు, దక్షిణ మండలాలకు డిస్ట్రిబ్యూటర్లు : మెసర్సు మహమ్మద్ రహీం ఖలీలి,
99 బి. ఉస్మాన్ ఖాన్ రోడు, బెంగుళూరు సిటీ.

# కలగూరగంప

ఆధునిక యంత్రయుగనిర్మాత థామస్ ఆల్వా ఎడిసన్



ఈయన జన్మదిన శతవార్షికము మొన్న ఫిబ్రవరి ౧౧ వ తేదీ నాడు జరుపబడింది. నాటికి ఈయన పుట్టి నూరేండ్లు నిండినవి. ఆధునిక యంత్రయుగానికి ఎడిసన్ విశ్వకర్మ. విశ్వప్రజకు నవీన సౌకర్యాలు చేకూర్చే ప్రతి యంత్రకల్పనలోనూ ఎడిసన్ గోచరిస్తాడు.

ఆధునిక యంత్రయుగ నిర్మాత థామస్ ఆల్వా ఎడిసన్ మొట్టమొదట తయారు చేసిన విద్యుద్దీపము. విద్యుచ్ఛక్తితో కాంతిప్రసారం తేవలెనని అనేక ప్రయత్నాలుచేసి, అనేక లోహాలతో పరిశోధనలు జరిపి, ఎన్నో ప్రయాసలకోర్చి, సుమారు ౪౦ వేల డాలర్లు ఖర్చుపెట్టి, కార్బనైజు చేసిన దారపుపోగును శూన్య గోళంలో ఉంచి, ఆపోగులోనుంచి విద్యుచ్ఛక్తిని పంపించడంతో ఈ విద్యుద్దీపాన్ని కల్పించినాడు. ఇది ౧౮౭౯నాటి మాట. ఆ తొలియత్నంలోనే ఆయన ఈ దీపాన్ని ౪౦ గంటలపైగా వెలిగించగలిగినాడు.





ఆధునిక యంత్రయుగ నిర్మాత థామస్ ఆల్వా ఎడిసన్ కేవలము తన ౩౧-వ యేట, ౧౮౭౭ ఆగష్టులో తయారుచేసి ప్రదర్శించిన తొట్టతొలి ఫోనోగ్రాఫు.

---

## భారతి కథల పోటీ

ఆదిలో అనుకొన్న రీతిగా అంత మంచి కథలు రానందున ఏ నెలకానెల ఆశాభంగము చెందవలసి వచ్చుట చేతను, పలువురు రచయితలు కూడ ఈ పోటీ పద్ధతికి అయిష్టత కనబరచుట చేతను విధిలేక ఈ పోటీని విరమించుకోవడమయినదని తెలుపుటకు మిక్కిలి చింతిల్లుచున్నాము.

సంపాదకుడు, భారతి.

---



# విమర్శనము



3/1947

## విప్లవసందేశం

రచన: క్రొపాట్కిన్ అనుసరణ: జగన్మోహన్. వెల ౮ అ.

క్రొపాట్కిన్ విధ్వంసవాది (Anarchist). విద్యాలయాలు, ఆరోగ్యసంస్థలూ అవసరం లేవనీ, ఆధునికరహదారీమార్గాలు తీసేసి అధికార కేంద్రీకరణకు అవకాశం లేకుండా చేయాలనీ, విదేశవ్యాపారాలు, విద్యుచ్ఛక్తి, వ్యవసాయంలో యంత్రసాధనాలు— వీటిని నిర్మూలించాలనీ, అడవులలో జంతువులవలె మానవులు సంచరిస్తే సర్వం ప్రజాస్వామ్యమే అవుతుందనే ఆశయంతో ఈ విధ్వంసవాది యువకులకు, న్యాయవాదులకు, బడిపంతుళ్లకు, ఇంజనీర్లకు, కళోపాసులకు "విప్లవసందేశా"న్నిస్తున్నాడు. అనువాదరచనలో శైలి, విధానం బాగున్నా, ఆశయఫలితంమాత్రం ప్రమాదకరమైనది. అభ్యుదయకాంక్షతో కాక పరిశీలనాదృష్టితో మానవకర్తవ్యాకల్పం చేయటానికైతే ఈ పుస్తకాన్ని అందరూ చదవవచ్చును.

* * * *

## లెనిన్ ఉపదేశాలు

రచన: పామీదత్తు. అనువాదం: రామమోహన్. వెల రూ. ౧

మార్క్సిసిద్ధాంతాలకు సంపూర్ణ అధికారం (Authority) ఇప్పుడు పామీదత్తుకే. పామీదత్తు భారతీయుడు. ఈ గ్రంథం అతని రచన.

మార్క్సిసిద్ధాంతాలే లెనిన్ ఆశయాలు. లెనిన్ అనుభవాలూ, ఆ అనుభవాన్నుంచి సేకరించిన సందేశాలూ ఈ పుస్తకంలో ఉన్నాయ్.

అనువాదం బాగున్నది. సాంకేతికపదాలను తెనిగించక అనువాదకుడు వాటికి భాష్యాలు వ్రాస్తే బాగుండేది.

## సోవియట్ ప్రజాస్వామ్యం

రచన: లోమ్మండగురు సోవియట్ రచయితలు. అనువాదం: జగన్మోహన్. వెల ౧౨ అ.

లెనిన్ ఉపదేశాలు చదివిన అనంతరం, విప్లవానికి పూర్వపు రష్యాచరిత్రనుంచి లెనిన్ తెచ్చిన మార్పులను గ్రహించడానికి ఈ పుస్తకం ఉపకరిస్తుంది.

అనువాదరచన ఎడనెడ కుంటుపడింది.

* * * *

## బలిదాన్

'లియోనిద్ లియోనోవ్' అను రష్యన్‌రచయితయొక్క Invasicn అనే నాటకానికి శ్రీ మహీధర జగన్మోహన్ అనువాదం. వెల రూ. ౧

'మానవజీవితాన్ని యాంత్రికంగా చిత్రించడం' ఈరచనలోని అనార్తిష్టత. అసలు వస్తువులోనే విదేశీయ అనుభవాల తెనిగింపు కావటంవల్ల "మూండేం జరుగుతుందా" అనే ఆతుర్దా చదువరుల్లో కలగదు. పాత్రల సంభాషణ ఒక నాటకమా అనిపిస్తుంది. సన్నివేశంలో పాత్రల కదలికలు అతినడిచియై 'ప్యాదయ' వాదులకు దెబ్బకొడుతోంది. మాటకిమాట అనువదించడం మూలాన రచనలోని 'రసపట్టులు' చచ్చిపోయాయి. యాంత్రికంగా చదువుకోగలవారికి ఇది పఠికవసుంది.

ఈనాలుగూ విశ్వసాహిత్యమాల, రాజమండ్రి వారి ప్రచురణలు. రాంషా.

---

# గ్రంథ స్వీకారము

---

## ఆంధ్రకవితరంగిణి

మొదటి సంపుటము. రచయిత : చాగంటి శేషయ్యగారు. ప్రకాశకులు : ఆంధ్రప్రచారిణీ లిమిటెడ్, కాకినాడ. 3 రూ.

## దేవీ కథ

దేవీభాగవత తత్వరహస్యము. రచయిత : జన్ములమడక మాధవరామశర్మగారు. ప్రకాశకులు : శంకర్ ఫాంస్త్రీ, బెజవాడ.

## ఆంధ్ర ప్రతిష్ఠ

పద్యకావ్యము. రచయితలు : శతావధానులు సత్యసుధీశ్వరకవులు. ప్రాప్తిస్థానము : ద్వివేది సత్యకవిగారు, సీతంపేట, రాజమండ్రి.

## ప్రకృతివైద్యము

ప్రకాశకులు : శ్రీ యోగాశ్రమము, మునులతోట (కొర్తోట), గుంటూరుజిల్లా. ౮ అ.

## స్వరాజ్యసోపానాలు

రచయిత : ముదిగొండ సుబ్రహ్మణ్యంగారు. ప్రకాశకులు : మాడరన్ పబ్లిషర్సు, తెనాలి. ౮ అ.

## వినుపీథి

ఖండకావ్యము. రచయిత : అయ్యగారి వీరేశ్వరరావుగారు. ప్రకాశకులు : కాశీహాస్తీ తమ్మారావు అండుసన్సు, రాజమండ్రి. ౧ రూ.

## ౧. భగవత్ప్రాప్తి-ఉపాయములు

అనువాదకులు : కుందుర్తి వెంకటనరసయ్యలుసు సూర్యప్రకాశశాస్త్రిగార్లు వెల ౪ అ.

## ౨. నరసదాసు కీర్తనలు

ప్రథమభాగము. కర్త : కుందుర్తి వెంకటనరసయ్యగారు. ౧౦ అ.

పై రెంటికిని ప్రకాశకులు: వెంకటరామా అండుకో., తెనాలి.



---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.



# ఏప్రిల్, 1947



త్రివర్ణచిత్రము: దీర్ఘాలోచన—శ్రీ జేలూరి రాధాకృష్ణగారు.

అఖిల ఆసియా మహాసభ—ఢిల్లీచిత్రశాలలలోని కొన్నిచిత్రాలు





దీర్ఘాలోచన

చిత్రకారుడు: శ్రీ వేలూరి రాధాకృష్ణ